కులగు క్రైస్తవ మతాధికారుల లేఖనముల నుట్టంకితము 83. నిర్ణీతములయిన ప్రచారక మండలములలోని వ్యవహార భాషలలో కొంత పరిచయము సంపాదించిన తరువాత గాని క్రైస్తవమత ప్రచారకులు గోవా నుండి ప్రచార ప్రాంతములకు పంపఁబడెడివారు కారు 84. క్రీ. శ. 1600 ప్రాంతముల రోమన్ కాతలిక్ పాదిరీలు తెలుఁగు నేర్చి, పూర్వ వేదము —బైబిలు ప్రాత నిబంధన గ్రంథమును—తెలిఁగించి, తెనుఁగులోనే మతప్రచారము గావించుచుండి రనుట ఆలోచింపఁదగిన యంశము 85. డచ్చి మిషనరీలు (1600) ను తూత్తుకుడి, నాగపట్టణము ప్రాంతములలో బుడతకీచు భాషయందే తమ మత ప్రచారమును సాగించుచుండిరఁట 86. పదునెనిమిదవ శతాబ్దాదిని క్రైస్తవమత ప్రచారము చేసిన లూథరన్ తెగ పాదిరీలు బుడతకీచు భాషను అభ్యసించు చుండిరఁట. వారు అడప దడప బుడతకీచునందే తమ ప్రచారము సలుపుచుండినట్లు వారి దినచర్యా గ్రంథములలో ఉల్లేఖ్యము 87. పదునెనిమిదవు శతాబ్దాదిని దినమార్గ (డెన్మార్కు) మత సంస్థల తరఫున తమిళనాడులో పనిచేసిన 'ట్సీగెన్‌బల్గ్' '(Bartholomew ziegenbalg, 1683–1739) ను, అతని సహచరుఁడగు 'ప్లుట్‌షా' (Plutschau) యును బుడతకీచు భాషాముఖమున తమిళ భాషను నేర్చుటలో పడిన పంచకర పాట్లు ఫ్రెంచి పరిశోధకుఁడగు ల క్రోజ్ (1661—1739) వ్రాతలలో వివృతములయినవి 88.

"As the portuguese language has a strong hold in India for more than two centuries, they considered it appropriate to learn it first. With the aid of the portuguese they applied themselves to the study of Tamil, but found the books in this language on palm leaves. It was all the help they were able to reckon, understanding by it the living voice of some country people.... They made little progress so they engaged a Tamil school master, who brought his school of small children with him, and the two missionaries began to write like them the Malabari Tamil) letters on sand with the fingers and Join them as the school master dictated them. Unfortunately the master knew no portuguese, so they were left in the dark as to the meanings of most of the words they learned to write and pronounce. But eventually they found a Tamilian who knew portuguese, Danish, Dutch and German! This man had rendered them a great help...."

పూర్వ ప్రచారకులగు బుడతకీచు పాదిరీల ప్రచార రీతుల మూలముగా ప్రచురవ్యవహారము సంపాదించిన మాటలను, విషయ సుబోధకమునకును దేశీయుల విశ్వాసమును చూఱగొనుటకును అర్వాచీన ప్రచారకులు తమ ప్రచార సందర్భములలో వాడుచుండుటచేత మత పరమయిన ఆయా మాటలు అటులే స్థిరపడినవి. చెన్నపట్టణములోని పరంగులపేటలో బుడతకీచు పిల్లల కొరకు ఒక పాఠశాలను స్థాపించుటకు 1717 లో కుంఫిణీ దొరతనమువారు మత సంస్థల కనుమతి నిచ్చినట్లు ఆధారము లున్నవి 89. దేశీయుల పిల్లల నిమిత్తము కడలూరులో కుంఫిణీ దొరతనమువారి గ్రాంటుల తోడను, అనుచరుల తోడ్పాటు తోడను 'ట్సీగెన్ బల్గ్' ప్రారంభించిన పాఠశాలయందు Radewitz (1680—1732) అను నతఁడు బుడతకీచును బోధించిన ఉపాధ్యాయుఁడు. చెన్నపట్టణము ఫోర్టులో 'ట్సీగెన్‌బల్గ్' స్థాపించిన బుడతకీచు పాఠశాలలో ఇతడు చిరకాలము పనిచేసినవాఁడు 90. అనంతపురము మండలములోని ఆలమూరు, పడమటి యూలేరు, మదిగుబ్బలు రోమన్ కాతలిక్కులకు ప్రధాన కేంద్రములుగా నుండినవి. అనంతపురము పాళెయగాఁడగు హండే ప్రసన్నప్పనాయని (1680—1719) సాయము వీరి కుండినదఁట 91. ఆంధ్ర క్రైస్తవులచే అధికనాథస్వామి

83. Manucci, op. cit., p. 471.
84. Dr. R. Caldwell. op. cit., p.102
85 C. P. Brown, A Review of Mss. of Purvavedamu and Rajulacharitra Madras Journal of literature and Science' No 28, July, 1840, quoted in the Introduction to the 'Bible History, Part I, Nellore. 1942
86. Dr. Caldwell, ep. cit, p 238
87 Hobson-Jobson, 1903, Introductory Remarks. p. XVIII
88. La Croze, op. cit., ఈ ఫ్రెంచి రచనలోని అవశ్యక భాగములను అనువదించి యిచ్చిన శ్రీ జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణమూర్తి—ఆంధ్ర విశ్వ కళా పరిషత్కళాశాలలో తత్త్వశాస్త్రోపన్యాసకులు — గారికి కృతజ్ఞత.
89. Proceedings Book of the Madras Govt., Monday the 27th May, 1717; MAMP, Vol, I, p 566, fn.
90. MANP: Vol, I, p. 566, fn
91. W. Francis, Gazetteer of Anantapur District, P. 27.

92 యను పేర వ్యవహృతుడయిన గోవా వాస్తవ్యుడు రెవరెండు జో ఆకిమ్ దిసోజా (Joachim D' souza 1775—1829) యను పాదిరి 1784 లో బళ్లారికి వచ్చి, కడప, బళ్ళారి, అనంతపురము మండలములలో కాథలిక్ క్రైస్తవమును ప్రచారముచేసి, పలు తావుల పాదిరి గుడులు నిర్మించినట్లు జిల్లా గెజెటీర్ల కథనము [93]. ఆ యూరపులో ఆదోని, బళ్లారి, ముద్దణగేరి, రామదుర్గము సత్యాపురములలో పలువురు బాప్తిస్మము స్వీకరించుటచే అవి కాథలిక్ క్రైస్తవమునకు ముఖ్య కేంద్రము లయినవి. రోమన్ కాథలిక్ శాఖానుయాయులయి, ఇంగ్లీసు కుంఫిణీకి చెందిన సైనికుల ప్రార్థనాదికముల నిమిత్తము ఆర్చిబిషప్పు పర్యవేక్షణమున 1828 లో రెవరెండు పెద్రోజా (1828—1844) బళ్లారిలో పాదిరిగా నియమితుడయి యుండెను [95]. 1887 లో ఈ కాథలిక్ కేంద్రములపై గోవా యాజమాన్య మంతరించినది. పదునేడు పదునెనిమిది శతాబ్దములలో క్రైస్తవమత ప్రచారము సలిపిన పాదిరీలు పెక్కురు కేవలము వాగ్రూప ప్రచారముతో తృప్తిపడక ఇండో-బుడతకీచు కోశవ్యాకరణాదులను రచించి భాషా విషయక కృషిని సైతము కావించుట బుడతకీచు భాషా ప్రభావమునకు పరమ ప్రమాణము. ప్రధానముగా సాగరతీర ప్రాంతములే వారి ముఖ్య ప్రచారసీమలగుట వలన తత్తద్దేశ్య వ్యవహార భాషా పరముగా వారి కృషి సాగినది. పారసీ-హిందూస్థానీ-ఇంగ్లీసు-బుడతకీచు భాషలలోని సమానార్థక పదజాలము కలిగి రోమక లిపిలో 1630(?) లో సంగ్రథితమయిన దను ప్రతిలి కల మారతు 69 నిఘంటువును, 1679 లో కొచ్చినులో అచ్చయినట్లు అర్వాచీనములగు పాదిరీ వ్రాతల వలన తెలియుచున్న పాదిరీ అంతెమ్ దీ ప్రోయెన్‌కా (Antem de Proenca) రచితమగు తమిళ—బుడతకీచు నిఘంటువును [97], 1743లో బుడతకీచు బాసలో రోమకలిపిలో సంధానితమయిన బంగాళీ—బుడతకీచు వ్యాకరణ (పుటలు-1-40) బంగాలీ-బుడతకీచు (పుటలు 47 — 306), బుడతకీచు — బంగాళీ (పుటలు 307—577) నిఘంటు సంపుటమును [98], వీరపల్లిలోని బుడతకీచు పాదిరీలు 1746 లో అచ్చువేసిన మలయాళ—బుడతకీచు, బుడతకీచు — మలయాళ నిఘంటు సంపుటములను [99], బార్నబైటు (Italian Barnabite) పాదిరీల తెగకు చెంది బర్మాలో ప్రచారము చేసిన Johannes Maria Percoto (1761—1776) అను పాదిరీ రచించిన బర్మా — లాటిన్-బుడతకీచు నిఘంటువును [100], గుంటూరు మండల పరిసరములలో ఏసీయ పాదిరీలు పదునెనిమిదవ శతాబ్దమున కూర్చిన తెలుగు నిఘంటువును 100 అక్షర రూప మెత్తిన పాదిరీల కృషికి నిదర్శనములు. ముద్రితాముద్రితములయిన ఇట్టి కోశవ్యాకరణములును, వీనికి పూర్వరంగమున సాగిన కృషి ఫలితముగా రూపొందిన అముద్రిత రచనలు పరిశీలకుల దృష్టికి అందక ఎన్ని అంతరించినవో ? ప్రాచీన క్రైస్తవమత ప్రచారకుల భాషా విషయకములైన అముద్రిత రచనలు అర్వాచీన కోశవ్యాకరణ నిర్మాతల చేతులలో పడి, వీరి రచనా సంప్రదాయమునకు మాతృకలయి యుండునని ఆచార్య ఫర్త్ గారి ఆశంక[102].

---

92. 'ఆదికణాద' యని లిప్యంతీకరణము, తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వము, సంపుటము, III పు. 573
93. W. Francis, Gazetteer of Bellary District, Vol. I, p. 57; C. F. Brackenbury, Gazetteer Cuddapah District, Vol I, p. 55
94. గోవాలోని ఆర్చిబిషప్పు అధికారమునకు లోబడిన రోమను కాథలిక్ ప్రచారకులు ఆంధ్ర ప్రాంతములో ఆనాడు 21 మంది ఉండిరట ! (MAMP, Vol. I, p. 629.)
95. 1500 లో మొట్టమొదట పోర్చుగాలు నుండి రోమను కాథలిక్ ప్రచారసంస్థవారు భారతదేశమునకు వచ్చిరి. దు అర్తి మ్యానిక్ (1514—17) మొదటి బిషప్పు. జవోవ్ దీ అల్బ్యాకర్క్ (1539—1551) గోవాలో మొదటి ఆర్చిబిషప్పు. సెయింట్ గ్జేవియర్ యాజమాన్యమున 1542 నుండి ఈ పాదిరీల ప్రచారము చురుకుగా సాగినది.
96. G. A. Grierson Linguistic Survey of India, Vol. IX. part i, pp 4-11
97. Introduction to the Tamil lexicon, p. xxxvi.
98. G. A. Grierson, op. cit., Vol. V, Part i, p. 23.
99. MAMP, Vol. I, p. 550; also Rev. H. Gundert, A Malayalam and English Dictionary, Mangalore, 1872, Preface, p. iv.
100. E. Luce, A short note on the Alphabetum Barmanorum, Journal of the Burma Research Society, August, 1914, p. 144; quoted by J. R. Firth in his 'Papers in Linguistics', p. 57.
101. A. D. Campbell, Advertisement to his Dictionary of Teloogoo language, commonly termed the Gentoo, College Press, Madras, 1821.
102. J. R. Firth, 'Papers in Linguistics', p. 57.

భారతదేశములో బుడతకీచు స్థావరముల వైశాల్యము పదునైదు వందల చదరపుమైళ్లు. జనసంఖ్య తొమ్మిది లక్షలు. ఈ ప్రాంతములోని ముఖ్య పట్టణముల యందలి పరంగులును, మిశ్రజాతీయులును, క్రైస్తవమతస్వీకర్తలును, విద్యాధికులైన దేశీయులును బుడతకీచును మాట్లాడుదురు. దేశీయులలో బుడతకీచుల వివాహములను అల్బూకర్కు ప్రోత్సహించుటచే 103 ఈ సంబంధములవలన నొక మిశ్రజాతి ఉద్భవించినది. ఈ మిశ్రజాతీయులు అటు బుడతకీచునందును, ఇటు దేశీయ భాషలయందును మంచి ప్రవేశము కలవారుగా నుండిరి. బుడతకీచులకు పిమ్మట భారత దేశమునకు వచ్చిన ఇతర పాశ్చాత్య జాతుల వారికిని, దేశీయులకును వీరు 'తొపాసులు' 104 (ద్విభాషులు) గా పనిచేయుచుండిరి. అందువలననే ఈ మిశ్ర జాతీయులకు 'తొపాసి' అను పేరు కలిగినది. గోవాలో నాటికి నేటికి నాలుగున్నర శతాబ్దులుగా బుడతకీచు రాజకీయ భాష.

**గోవా ప్రభావము**

బుడతకీచు సేనలలోని సైనికులు, బారకాసులలోని బానిసలు, ప్రభుత్వ కార్యాలయములలోని కార్కూనులు, బంట్రోతులు, ఆస్పత్రులలోని ఆయాలు, నౌకరులు, సరకుల గిడ్డంగులలోని సిబ్బంది, కప్పరి భోగులలోని కళాసులు, పరంగులు 105 పాదిరిగుడులలోని ప్రచారకులు, పరిచారకులు, ఉన్నతోద్యోగుల చాకరులు, శ్రీమంతుల సేవకులు అందఱును ఆ నాఁడు బుడతకీచులు కారు. తొలుత వీరి సంఖ్య అధికముగా నుండినను క్రమక్రమముగా దేశీయులును, మిశ్రజాతీయులును ఈ యా కొలువులలో విరివిగా నియోజితులైనట్లు ఊహించుట కాధారములు కలవు. మత ప్రచార సంస్థలలోను, ఇతర ధనవంతుల ఇండ్లలోను పరిచారకులు కావలసి వచ్చినపుడు పోర్చుగాలునుండి భారత దేశమునకు సబురులు చేసెడి నావలలో ఏడెనిమిదేఁడుల యీడుగల బాలురను ఆయా నావికాధికారులు వెంటఁ గొనితెచ్చి, వీరి కప్పగించి, ప్రతిఫలముగా కొంత ధనమును స్వీకరించెడివారు. ఆ నాఁడు గోవాలోని మత సంస్థలు మిక్కిలి ధనవంతములు. నెల సరి జీతములు సరిగా అందనందునను, అందిన జీతములు సుఖ జీవితమునకు చాలనందునను బుడతకీచు సైనికులు పలువురు మతప్రచార సంస్థలలో చేరుచుండిరి. తమతో చేరుఁడని కూడ మతాధికారులు సైనికులను ప్రోత్సహించెడివారు. తిండి తిప్పలు సరిగా లేక, ప్రాణములను అరచేతఁ బెట్టుకొని సైనికుఁడుగా బ్రదుకుట కంటె, చీకు చింత లేని మత సంస్థలలో చేరి కాలము గడపుట వారికి హాయిగా కన్పట్టినది. 1635 లో గోవాలో తీసిన లెక్కల ప్రకారము సైనికుల, సాధారణ పౌరుల మొత్తము కంటె మత ప్రచార సంస్థలలోని సిబ్బంది ఎక్కువని తేలినది 106. పెద్ద పాదిరీలు మత ప్రచార పర్యటనమునకు బయలుదేరునపుడు వారి పరివారములో ఈ సజ్ఞంతయు చేరుచుండెడిది. ఇక, గిడ్డంగుల ప్రాంగణములలో కన్పట్టెడి కొవ్వుదారులు, మాలు చేరగాండ్రు, ఓడలు రేవులో నుండగా సరకులెత్తి దించు బత్తాయిలు, అమాలీలు, రేవులలోని ఇసుకమేటలు త్రవ్వు ఉప్పరులు, వడ్రంగులు అందఱును అచ్చముగా దేశీయులు. మే, జూన్, జూలై, ఆగస్టులు సబురులకు సరిపడని మునురు నెలలు. ఈ నాల్గు నెలలును ఓడల మరమ్మత్తులు 107, క్రొత్త పడవల, తెప్పల కట్టుబడులు, సిబ్బంది ఉడుపుల తయారీలు, ఇట్టి సర్దుబాటులకు సరిపోయెడివి. ఇటికపనివారు, ఓడ

---

103. Commentaries. Vol III. p. 1.

104. ప్రభువు అను నర్థమున ఈ 'తుపాసి' యను మాట ఆంధ్ర పద్య నిఘంటువుల కెక్కినది. చూ. వేంకటేశాంధ్రము (1653) మానవర్గు; సాంబ నిఘంటువు (1750) మానవర్గు; ఈ నిఘంటు కర్తల కాలమునను, వారికి కొంత పూర్వమునను పరంగుల కుంఫిణీలలో తుపాసులు - దుబాసులుగా పనిచేసిన దేశీయులను ప్రజల దృష్టిలో—అందును కైవారపు కవుల సృష్టిలో ప్రభుకల్పులుగా పరిగణితు లగుటలో వింత లేదు.

105. ibid. Vol. IV, p. l; also vide: 'The Portuguese make a marvellous profit all over India. Where they are well received they associate with the natives of the country, who in their turn accompany them in their voyages, so much so, that even all the crews of their ships and pilots are Indians...' Pyrad Francisco de Laval, Viagem, Vol. I, p. 438,

106 F. C Danvers, op. cit., Portuguese in India, pp. 253, 254.

107. 1497—1612 ల మధ్య పోర్చుగాలు నుండి భారత దేశమునకు వచ్చిన నౌకలు 806 అనీ, వీని కపితానులు 107 అనీ లెక్కలు. వీనిలో 425 నౌకలు పోర్చుగాలుకు తిరిగి పోయినవి. 285 నౌకలు భారత దేశములోని బుడతకీచు స్థావరములలో ఉండిపోయినవి. తక్కిన 96 ను ప్రమాదములకు గురియై యుంయు మునిగిపోయినవి. (History of Goa, p. 37.)

బలిజెలు, కమ్మరులు, కాసె పనివారు, దర్జీలు, ముచ్చి పనివారు, వ్రడంగులు 108 —ఇట్లెన్నో వృత్తులవారు పలువాడుల నుండి పరంగివాడలకు వలస వచ్చెడివారు. ఈ నాల్గు నెలలును వీరికి చేతినిండ పని. తమ కిచ్చెడి జీతబత్తెములు చాలమిని, బారకానులయందే నివసింపవలెనను నియమము లేమిని బుడతకీచు సోల్డాదులు (Soldiers) చాకబారు పూటకూటిండ్లలో అద్దెల కుండెడివారు. బ్రదుకుఁదెరువు చూచుకొన వచ్చిన పరిసరసీమల వృత్తివిద్యల వారికిని ఈ పూటకూటిండ్లే ఆహార విహారముల కాశ్రయములుగా నుండినవి. జూదసాలలు, పూటకూటిండ్లు, లాహిరి దుకాణములు అన్నివాడలలో నుండినవి. ఇవి యన్నియు ముప్పూటలును కిటకిట లాడెడివి. ఈ వాడలలో 'బొట్లేరు బుడతకీచు' పుట్టినది. ఇంటి కంటె గుడి పదిలమని దిగఁబడిపోయినవారు పోఁగా, మిగిలినవారు 'సుగ్గి' చూచుకొని తక్కిన ఋతువులలో తమ తమ వీడులకు తరలి పోయెడివారు. ఈ రాకపోకలు ఏఁటేఁట జరిగెడివి. ఈ రాకపోకలవలనను కొన్ని బుడతకీచు నుడులు ఇరుగు పొరుగు వాడుల బాసలలో వాడుక కెక్కి యుండవగును. 1878 లో జరిగిన ఆంగ్ల—బుడతకీచు గోవా ఒడంబడిక లోని ఆఱవ నిబంధనప్రకారము రెండు ప్రాంతములను కలుపుచు, బళ్లారి, హుబ్బళ్లి పట్టణముల ద్వారమున మార్మగోవా దాఁక ఇనుపదారిని నిర్మింపవలసి యుండినది. 1882లో ఈ ఇనుపదారి పనిమొదలయి 1887 లో రాకపోకలకు తెఱవఁబడినది. మార్మగోవానుండి కొల్లెం, కాజిల్‌రాక్, ధార్వాడ, హుబ్బళ్ళి, గదగు, హొసపేట, బళ్ళారి పట్టణముల ద్వారమున ఈ దారి గుంతకల్లును చేరుచున్నది. 1885 నాఁటికే బళ్ళారి గుంతకల్లు ఇనుపదారి తయారయి యుండినది. బళ్ళారి—హొసపేటల మధ్య నలువది మైళ్ల ఇనుపదారియును 1877—1878 లో కఱవు పనిగా మొదలయి 1884 నాఁటికి పూర్తయి యుండినది. గుంతకల్లు—బెజవాడ దారియును 1882 మొదలయి 1893 లో సిద్ధమయినది. గుంతకల్లు నుండి బయలుదేరి, ద్రోణాచలము, నంద్యాల, కంబము, మార్కాపురము, దొనకొండ, గుంటూరుల మీఁదుగా బెజవాడను చేరి, ఆ పిమ్మట గుడివాడ మీఁదుగా మచిలీపట్టణము వరకు సాగి ప్రాక్పశ్చిమ సముద్రములను కలిపిన ఈ ఇనుపదారి ఆంధ్రప్రాంతమునకును, బుడతకీచు ప్రాంతమునకును గల సంబంధమును ఇనుమిక్కిలిగా పెంపొందించినది. [సశేషం]

---

108. బయలాటల—వీథి నాటకముల-లో పంచాణము వారి ప్రసక్తి కల ఘట్టములలో మా మండలమున కొంకణ దేశీయులను ప్రవేశపెట్టుట సంప్రదాయము. కొంకణము పోఁ: కంకణము తెచ్చిన కొంకణాచార్యులని వీరు ప్రశంసితులు.

# నా స్వామి

శ్రీ మీరా మొహిద్దీన్

జలధి యుప్పొంగ దెపుడును జగతిమునుగ

అనలు డెపుడు జ్వలింపడు ననలుజాచి
తార లెప్పుడు రాలవు ధరణిమీద
తెలియరాదయ్య నీ లీల తిరుమలేశ

సారమేలేని సంసార సాగరాన
దారి గానక వెఱగునై దప్పిపోతి
వైరమూనక రక్షించు పరమపురుష
తరమె? నిన్నుకీర్తింప శ్రీ తిరుమలేశ

కవిని కల దొక్క కోరిక కమలనాభ !
యెన్ని జన్మలు కల్గిన యెక్కడైన
నిన్ను జేరఁ గోరుదు నిర్మలాత్మ!
అరసి పాలింపు ప్రేమతో తిరుమలేశ !

వారు వీ రను భేద భావంబులేక
అన్ని మతముల భక్తులు నిన్ను జేర
పరుగు పరుగున వత్తురు పరమపూజ్య
తరమె? నిన్నుకీర్తింప శ్రీ తిరుమలేశ !

శిరము వంతునె పరులకు శీల ముడిగి
శిరము వంచితి నీ ముందు సిగ్గువిడిచి
"పాహిమాంపాహి" యనుచును పాడుకొంచు
తెరవుజూపుము కరుణను తిరుమలేశ !

తావిమించిన పన్నీట తనివి దీర
జలకమాడింతు హాయిగా జగతినాథ !
మంచిగంధము నొడలను మెంచిబూసి
కోరి భజియింతు భక్తితో తిరుమలేశ!

నిన్నుజూడగ లేరిల నన్ను తాంగ!
నీదు కీర్తిని బొగడరు నిర్మలాత్మ!
నీదుగుణములు తెలియరు నీచులకట
తరమె? నిన్నుకీర్తింప శ్రీ తిరుమలేశ !

# గాలిగోపురం

శ్రీ అంగర సూర్యారావు

## పాత్రలు:

| | | |
|---|---|---|
| మారుతి | — | లచ్చన్న |
| కొండయ్య | — | రత్తయ్య |
| నారాయణ | — | చంద్రయ్య |
| రఘుపతి | — | శ్యామసుందరం |
| స్వామి | — | పుల్లయ్య |
| బసవయ్య | — | వీరయ్య |

గారి

## ఒకటవ అంకం

స్థలం: ఒక పాతయింటి ముందుభాగం

సమయం: తెల్లవారుఝాము

రంగస్థలాన్ని చీకటి ఆవరించివుంది. దూరాన్నుంచి—గాలిపైన తేలివస్తున్నట్లు—శ్రావ్యంగా పాట వినిపిస్తోంది. నెమ్మదిగా రంగస్థలంమీదికి వెలుగు ప్రసరిస్తోంది. మసక వెలుగులో ఒక పూరింటి ముంగిలి కనిపిస్తోంది. యింటికి మధ్య భాగంలో ద్వారం వుంది. తలుపులు మూసివున్నాయి. యింటికి ముందు పొడవుగావున్న అరుగుమీద ఎడమవైపున వట్టిగడ్డి కుప్పగా పడివుంది. యింటిముందురోడ్డు.—పాట అంతకంతకు దగ్గరగా వస్తుంది. పాడుకుంటూ, స్వామి రోడ్డుమీదినుంచి వెడుతూ వుంటాడు. చిందర వందరగా వున్న తల, తడిసిన వస్త్రాలు—అతను తెల్లవారుఝామున నదికిపోయి స్నానంచేసి వస్తున్నట్లు తెలియజేస్తాయి. మధ్య వయస్సు. యిహంపై విరక్తి కలిగినవాడని—అతని రూపం, మాటలూ తెలియజేస్తాయి.

స్వామి:—

నిదురించే మానవుడా
తెల వారెను లేవోయీ
హరి నామమె కీర్తించు
శ్రీహరినే మది నిలుపు.....

(సూర్యకాంతి రంగస్థలం మీదికి ప్రసరిస్తుంది. వెంటనే యింటి తలుపులు తెరుచుకుంటాయి. నారాయణ ద్వారంలోంచి ఒక అడుగు యివతలకువేసి, బిగ్గరగా నవ్వుతాడు. చింపిరిజుత్తు, లోపలికి పోయిన కళ్ళు, చిరిగిన బట్టలు—వయస్సు 55 సంవత్సరాలు.)

నారాయణ:—(బిగ్గరగా నవ్వుతూ) హహ్హహ్హ! వచ్చావూ?—నాంది ప్రస్తావనలు ప్రారంభిస్తున్నావా?

స్వామి:—కులాసాగా వున్నావా బాబూ?......

నారా:—కులాసాకి యేమీ లోటులేదు. చూడూ! (వేలెత్తి చూపిస్తూ) అదుగో! ఈ వూరికి దక్షిణ దిశను ఒక కొండ వుంది. అది మన తాత ముత్తాతల కాలంనుంచీ ఎండకు యెండీ, వానకు తడిసీ చెక్కు చెదరకుండా—అంగుళమైనా కదలకుండా అక్కడే నిలబడివుంది. నేను కూడా అంతే! (లోపలికి వెళ్ళిపోయి పెద్ద చప్పుడుతో తలుపులు మూస్తాడు.)

స్వామి:—(పాడుకుంటూ రోడ్డుమీద ముందుకు నడుస్తూ వుంటాడు.)

రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం......

(ఎడమవైపునుంచి స్వామికి ఎదురుగా వీరయ్య పరుగెత్తుకు వస్తాడు. వయస్సు రమారమి 50 సంవత్సరాలు. బనీను, మోకాళ్ళవరకూ పంచెకట్టు, తలపాగా.)

వీరయ్య:—(వస్తూనే, ఆత్రుతతో) స్వామీ! స్వామీ! రక్షించండి! రక్షించండి!

(స్వామి పాదాలముందు కూలబడతాడు.)

స్వామి:—(అతనిని లేవనెత్తి) భయపడకు నాయనా! నిన్ను దేవుడే రక్షిస్తాడు!

(తిరిగి తన ధోరణిలో పాడుకుంటూ ముందుకు వెళతాడు. వీరయ్య నిస్పృహాయుడై అతనికేసి చూస్తూ వుంటాడు.)

రఘుపతి రాఘవ రాజారాం
పతిత పావన సీతారాం
ఈశ్వర అల్లా తేరే నాం
సబ్ కో సన్మతి దే భగవాన్! (నిష్క్రమణ)

(వీరయ్య భయంతో చుట్టూ చూస్తాడు. ఏదో ఆలోచన స్ఫురించిన వాడిలా యింటి మెట్లెక్కుతాడు.)

వీరయ్య:—(తలుపు తట్టుతూ) నారాయణా! నారాయణా!

నారా:—(అమాంతంగా తలుపు తెరిచి) నారాయణ చచ్చిపోయి నాలుగేళ్ళయ్యింది. యిప్పు డెవ్రడా పిలుస్తున్నవాడు?

వీర:—బాబ్బాబు! నన్ను దాచెయ్యరా నారాయణా! నన్ను తరుము కొస్తున్నార్రా బాబూ!

నారా:—నిన్ను తరిమేస్తున్న వాళ్ళెవరు?

వీర:—యింకెవ్రరా బాబూ! అచ్చన్నగారి పెంపుడు కుక్కలు!

నారా:—(బిగ్గరగా నవ్వి) హహ్హహ్హా! కుక్కల్ని చూసట్రా జడుస్తావ్ నువ్వు? చిన్న సలహా చెబుతాను. విను.

వీర:—(బెదురుతూ) యేమిటది?

నారా:—ఒక చదునైన కర్ర పుచ్చుకొని—పచ్చడిచేసి వదిలెయ్యి (లోపలికి పోబోతాడు.)

వీర:—(అతని రెండుచేతులూ పట్టుకొని ఆపుచేసి) బాబ్బాబు! నన్ను కాపాడు!

నారా:—అయితే లోపలికివచ్చి ఆ అటుకుకింద దూరిపో!

(వీరయ్య తొందరగా యింటిలోకి వెళ్ళిపోతాడు. నారాయణ లోపలికివెళ్ళి తలుపు చేరవేస్తున్న సమయంలో గౌరి ఎడమవైపునుంచి ప్రవేశిస్తుంది. ముఖంలో అందం, ఉత్సాహం కనిపిస్తూ వుంటాయి. సిల్కు జాకెట్టు, పరికిణీ, వోణీ—జడ కుచ్చులతో అందంగావున్న వాలుజడ—చేతిలో పూలసజ్జ—వయస్సు 18 సంవత్సరాలు.)

గౌరి:—(వస్తూనే) ఓ! నారాయణ మావా!

నారా:—(మూసిన తలుపు తిరిగి తెరిచి) ఎవరది?

గౌరి:—నేను మావా!

నారా:—(పరికించి చూసి) నువ్వు అచ్చన్న కూతురివి కాదటే పిల్లా?

గౌరి:—రోజూ ఆమాటే అడుగుతావేం? నీకుఎన్నిసార్లు చెప్పాలేం? (ద్వారంలోంచి లోపలికి చూస్తూ) బావ వున్నాడా లోపల?

నారా:—లేదు. లేదు. వాడు యీ భూమ్మీద ఎక్కడ వుంటాడే పిచ్చిదానా?

గౌరి:—ఓ! అదా సంగతి! బావ గోపురంలో వున్నాడా? నేను గుడికి వెళుతున్నాన్లే. అక్కడే పట్టుకుంటాను. ఒక వేళ యింటికివస్తే నేను వచ్చేవరకూ వుండమని చెప్పు.

(గౌరి కుడివైపు వెళ్ళిపోతుంది.)

నారా:—వెర్రిపిల్ల! (లోపలికిపోయి తలుపులు మూసేస్తాడు.)

(నేపథ్యంలో అరుపులూ, కేకలూ వినిపిస్తాయి....

"నన్నొది లెయ్యండ్రా నాయనోయ్"

"నాకు తెలియదురా బాబూ!"

—అంటూ రత్తయ్య గోల పెడుతూ వుంటాడు. అతనిని చెరో రెక్కా పట్టుకొని కొండయ్య, పుల్లయ్య యీడ్చుకు వస్తారు. రత్తయ్య లావుగా, పొడవుగా వున్నాడు. ముఖంలో అమాయకత్వం కనిపిస్తూ వుంటుంది. వయస్సు 20 సంవత్సరాలు. చిన్న పంచెకట్టు, పొట్టి చేతుల చొక్కా, నూనూగు మీసం. —కొండయ్య పొట్టిగా, బలంగా వున్నాడు. గ్లాస్కో పంచె, చొక్కా వేసుకున్నాడు. చిన్న కోరమీసం, గిరిజాల జుత్తు. చేతిలో కర్ర. —పుల్లయ్య మాసిన పంచె, చిరిగిన చొక్కా వేసుకున్నాడు. పొడుపుపాటి మీసాలు. చేతిలో కర్ర. వయస్సు సుమారు 35 సంవత్సరాలు.)

కొండయ్య:—నిజం చెప్పు! మీ అయ్య ఎక్కడున్నాడు?

రత్తయ్య:—నాకు తెల్దు!

పుల్లయ్య:—(వీపుమీద ఒకటి చరిచి), మళ్ళీ అదే మాటంట్రా?

రత్తయ్య:—బాబోయ్! నేను చూళ్ళేదురా!

కొండ:—పోనీ! పొద్దున్న లేవగానే మీ బాబు కనపడ్డాడా?

రత్త:—మంచంమీంచి నేను లేచేసరికి మీ యిద్దరి ముకాలే నాకు కనబడ్డాయి. మీ ముకాలు చూశాను. నా వళ్ళు హూనం అయ్యింది.

కొండ:—(కోపంతో) నా ముహం మంచిది కాదంటావా? (చెయ్యి పైకెత్తుతాడు.)

రత్త:—బాబోయ్! కొట్టకు! మంచిదే!

పుల్ల:—యేట్రోయ్! నా ముహం మంచిది కాదంటావా?

రత్త:—(దూరంగా జరిగి) అదే కొంచెం అనుమానంరా!

పుల్ల:—వుండు! నీ అనుమానం తీర్చేస్తాను. (కర్ర పైకెత్తుతాడు.)

రత్త:—(రెండు చేతులూ తలకు అడ్డం పెట్టుకొని వెనక్కి దూకి), ఒరేయ్! ఒరేయ్! పుల్లిగా! కొట్టెయ్యకురా! దెబ్బ తగిలేస్తది.

కొండ:—(రత్తయ్య మీదికివచ్చి) నిజం చెప్పరా అంటే, ఎందుకు తెగ సాగుతావ్?

రత్త:—నాకు తెల్దయ్యా కొండయ్య బాబూ! తెలిస్తే సెప్పనా? అసలు మా బాబు అవసరం మీ కెందు కొచ్చిందీ అంట?

పుల్ల:—అడ్గదీ! మళ్ళీ మొదటి కొచ్చేడ్రా కుర్ర యెదవ?

రత్త:—మా బాబు మీ సొత్తేదైనా యెత్తుకు పోయేడా? దొంగతనం సేశాడా? దోపిడీ సేశాడా? కూనీ సేశాడా? యేం సేశాడూ అంట?

పుల్ల:—అప్పుసేసి పప్పుకూడు తినేసి నప్పుడు లేదంట్రా?

రత్త:—పొద్దున్న సద్దికూటిలోకి ఉప్పు కూడా లేదు. పప్పు కూడు అంటావేంట్రా?

కొండ:—ఒరేయ్ రత్తయ్యా! మీ బాబు వంద రూపాయలు అప్పు పుచ్చుకున్నాడు.

రత్త:—ఈడిసి తన్నినా మా బాబు దగ్గిర దమ్మిడీ వుండదు గందా! ఆడికి వంద రూపాయలు అప్పిచ్చిన యెర్రో డెవడంట?

కొండ:—(కళ్ళెర్రచేసి) అచ్చన్న రైతుని యెర్రోడంటావ్రా? జాగర్త!

రత్త:—కాకపోతే మరేంటిసెప్పు కొండయ్య బాబూ! మా బాబుకి అర్ధణా సుట్టముక్క లేవడూ అరువియ్యడు గందా! అలాంటోడికా వంద రూపాయలు అప్పు!!

పుల్ల:—మీ బాబు యెక్కడ దాక్కున్నాడో సెప్పరాఅంటే— అనవసరం వాగుడంతా వాగుతావేంట్రా?

కొండ:—మిమ్మల్ని సందుకొని చూడగానే పరుగెత్తుకుపోయేడు మీ బాబు!

రత్త:—అప్పుడు మీరెందుకు పట్టుకోలేదూ అంట?

పుల్లి:—ఆడు అసలే మాయలమారి. యే గొందులోనో దూరి పోయేడు.

రత్త:—సేతగాక ఆణ్ణొదిలేసి (బిక్క మొహంతో) మేక పిల్ల లాంటోళ్లి నన్నా పట్టుకుంటారు?

కొండ:—మీ బాబు రోజూ యెక్కడెక్కడికెళతాడో చెప్పు.

పుల్లి:—నువ్వు మా కూడావచ్చి సూపించు. మేం ఆణ్ణి పట్టేస్తాం.

రత్త:—యిప్పుడుగాని నేను మా బాబుకి కనపడ్డానంటే— నన్ను పట్టుకుని గూర్భిరగ బొడుస్తాడు.

కొండ:—నిన్నెందుకు పొడుస్తాడ్రా?

రత్త:—రాత్రి మా బాబు నాకేం సెప్పేడంటే.....(బుర్ర తడుముకుంటాడు)

పుల్లి:—యేం సెప్పేడు?

రత్త:—పొద్దున్నే పల్లప్పొలంయెళ్ళి దూడకి గడ్డి తెమ్మన్నాడు. లేకపోతే సంపేస్తాడు. మళ్ళా మద్యానం కని పిస్తాన్నే. (పోబోతాడు.)

పుల్లి:—(రెక్క పట్టుకొని నిలబెట్టి) యేడిశావులే! నీ యేషాలు మా దగ్గిరా? మీ బాబు దొరికేదాకా నిన్నొదిలెయ్యం.

రత్త:—అయితే ఓ పని సెయ్యండి.

కొండ:—యేమిటది?

రత్త:—మీ రిద్దరూ నాకూడా పల్లప్పొలం రండి. మీరు గట్టు మీద ఒక గంటసేపు కూచోండి. నేను గబగబా గడ్డి కోసేస్తాను. అప్పుడు ముగ్గురుం కలిసి వూళ్లోకొచ్చి పొయింత్రం సీకటిపడేదాకా మా అయ్యని యెతికేద్దాం. యేం? బాగుందా?

పుల్లి:—యేడిసి నట్టేవుంది.

కొండ:—మీ బాబుని పట్టి అప్పగించు. నిన్నొదిలేస్తాం.

రత్త:—ఆడు దొరకనియ్యి. దొరికిం తరవాత పట్టి అప్పగించక పోతే ఒట్టు!

పుల్లి:—దొరికేక నువ్వు పట్టి అప్పసెప్పేదేంట్రా యెర్రెదవా! మేమే పట్టుకుంటాం.

రత్త:—అలాగే పట్టేసుకోండి. యింక నే నెందుకు? నేను పొలం పోతాను. (పోబోతాడు.)

కొండ:—(చెయ్యి పట్టుకొని నిలబెట్టి) యేషాలేస్తున్నావట్రా! ఆగు!

రత్త:—నేనేం సెయ్యగల్ను కొండయ్య బాబూ!

కొండ:—ఒరేయ్ పుల్లయ్యా!

పుల్లి:—(ఎడమవైపు చూస్తున్న పుల్లయ్య) ఓయ్!

కొండ:—యిప్పుడు మనం ఒక పని చేద్దాం.

పుల్లి:—యేం టది?

కొండ:—ఒక పరసని యింటింటికీ వెళ్ళి వెతికేద్దాం.

పుల్లి:—అన్ని యిళ్ళల్లోకీ దూరిపోయి యెతికేద్దామంటావా కొండయ్యబాబూ?

కొండ:—అంతే! యింక దీనికి తిరుగేలేదు. యీ దెబ్బతో ఆడు చచ్చినట్టు దొరుకుతాడు.

పుల్లి:—బలే! యీమాటు యీరయ్యగాడు యెలా తప్పించు కుంటాడో సూస్తాను.

కొండ:—యింక పరస పెట్టి మొదలెడదాం. (ఇంటిని చూపిస్తూ) ముందు యీ యింటి తలుపు కొట్టు.

పుల్లి:—(భయంతో) బాబోయ్! ఆ యింటి జోలికి నే నెళ్ళను.

కొండ:—యేం? యెందుకెళ్ళవ్?

పుల్లి:—ఆ యింట్లో ఒక పిచ్చోడు ఒక మొండోడు వున్నారు. పిచ్చోణ్ణిసూస్తే నాకు బయంలేదు కానీ మొండోణ్ణి సూస్తే.........

కొండ:—యెవడ్రా ఆడు?

పుల్లి:—యింకా యెవరని మెల్లిగా అడుగుతున్నావా కొండయ్య బాబూ! ఆ మారుతిగాడి సంగతి నీకు తెల్దా?

రత్త:—ఆడి సంగతి కొండయ్యకి బాగా తెలుసును. యెనకటికి గ్రిపోతు పందాలకాడ మారుతిగాడు కొండయ్యని యీపుసాపు సేసి.....

కొండ:—(మధ్యలో అందుకొని కోపంతో) నోర్ముయ్! (ఒక్క టేస్తాడు)

రత్త:—బాబోయ్! వున్నమాటంటే వుడుకు మోత్తనం యెందుకు?

కొండ:—(పుల్లయ్యతో) ఈ యింట్లోకి నువ్వెళ్ళవా?

పుల్లి:—ఈ ఒక్క యింటిలోకి నువ్వెళ్ళు కొండయ్యబాబూ! మిగతా యిళ్ళన్నీ నేను సూస్తాను.

కొండ:—నే నుండగా నీకు భయమంట్రా!—ఒరేయ్ రత్తయ్యా! పోనీ! నువ్వెల్లి తలుపు కొట్టు!

రత్త:—ఊహూ! నే నెళ్ళను.

కొండ:—(బుజ్జగిస్తూ) నువ్వేం చెయ్యొద్దు. గుమ్మం దగ్గిర నిలబడి 'అయ్యా!' అని పిలు. చాలు.ఆడు లోపలవుంటే నీ పిలుపుకి యివతల కొస్తాడు. అప్పుడు మేం ఆణ్ణి పట్టేసి నిన్నొదిలేస్తాం.

పుల్లి:—అప్పుణ్ణువ్వు నిచ్చేపంగా పొలంపోయి గడ్డి తెచ్చుకో వచ్చును.

కొండ:—యేం? మాట్లాడవేం?

రత్త:—బాబోయ్! నేను పిల్ను! మా అయ్య పొతేస్తాడు నన్ను.

కొండ:—(విసుగుతో) యిదేం గొడవరా? యెక్కడా తేలకుండా వుంది.

పుల్లి:—(ఆలోచన తట్టిన వాడిలా) ఒక్కపని చేద్దాం కొండయ్య బాబూ!

కొండ:—యేమిటది?

పుల్లి:—మనం ఈ రత్తయ్యగాణ్ణి పట్టుకుని దూదేకినట్టు యేకి వదిలేద్దాం. అప్పుడు యీడు, "బాబోయ్, నాయనోయ్" అని అరుస్తాడు. ఆ దెబ్బతో యీడిబాబు యెక్కడున్నా వచ్చినట్టు యివతలకొస్తాడు.

కొండ:—(సంతోషంతో పుల్లయ్య వీపు తట్టి) బలే! బలే ఆలోచనరా వీడి?

రత్త:—(బెదురుతో) ఒరేయ్! ఒరేయ్! నిజమేనేంట్రా?

కొండ:—నోర్మూయ్! తిన్నగా నిలబడు! (కర్ర యెత్తుతాడు)

పుల్లి:—ఈమాటు పిల్లా మీ బాబుని (కర్ర పైకెత్తుతాడు.)

రత్త:—(యిద్దరిమధ్య చిక్కుకొని భయంతో దెబ్బలు తప్పించుకుంటూ) నంపెయ్యకండ్రా బాబోయ్ (భయంతో కేకలు వేస్తూ వుంటాడు.)

నేపథ్యంలో:—(బిగ్గరగా) ఆగు! ఆగు! ఎక్కడికి పోతావు!

పుల్లి:—(కుడివైపు చూస్తూ) బాబోయ్! మారుతి (ఎడమవైపు పారిపోబోతాడు.)

కొండ:—(అమాంతంగా పుల్లయ్యను పట్టుకొని) ఆగరా! ఆగు! రావేయ్! అడి సంగతి చూద్దాం!

పుల్లి:—బాబ్బాబు! నన్నొదిలెయ్! మూర్డోజుల్నుంచి ఆడు నా కోసం చూస్తున్నాడు.

కొండ:—యివేళ అడి బుర్ర ఎగర కొట్టేస్తాను. నువ్వు నా యెనకాల నిలబడు.

(కొండయ్య కోపంతో కుడివైపు చూస్తూ వుంటాడు. వెనక్కీ ముందుకూ బెదురు చూపులుచూస్తూ వుంటాడు పుల్లయ్య—రత్తయ్య "హమ్మయ్య" అనుకొని ఆటే చూస్తూ వుంటాడు. మారుతి ప్రవేశిస్తాడు. చారల చొక్కా, నలిగి పోయిన పంచె—ముఖంలో నిర్లక్ష్యం కనిపిస్తూ వుంటుంది. వయస్సు 24 సంవత్సరాలు. కుడి చివర నిలబడి చేతిలోవున్న పావురాన్ని దువ్వుతూ మాట్లాడుతూ వుంటాడు.)

మారుతి:—నేను వచ్చేవరకూ నువ్వెక్కడికీ వెళ్ళకు. ఈ చెట్టు కొమ్మమీద కూర్చో! ఆ తరవాత ఇద్దరం కలిసి జంటగా గాలిగోపురంలోకి ఎగిరిపోదాం. (పావురాన్ని కుడివైపు విడిచిపెట్టి ముందుకుచూసి కోపంతో) ఒరేయ్ పుల్లయ్యా!

పుల్లి:—బాబోయ్! (ఒక్కదూకు దూకి ఎడమవైపు పారిపోతాడు.)

మారు:—ఓహో! కొండయ్యా! చాలా కాలానికి కనపడ్డావే!—రత్తయ్యా వంట్లో బాగుందా?

రత్త:—యేం బాగురా బాబూ! వళ్ళు హూనమైపోతే! (వీపు తడుముకుంటాడు.)

మారు:—యేం? యెందు కయ్యింది?

రత్త:—అచ్చన్న రైతు దగ్గిర మా అయ్య అప్పు పేశాడంట!

మారు:—చేస్తే?

రత్త:—తీర్చలేక పారిపోయేడు.

మారు:—(కొండయ్య కేసి చూస్తూ) ఓహో! అదా సంగతి! తండ్రి అప్పు తీర్చకపోతే కొడుకుని శిక్షిస్తున్నారన్న మాట! చక్కని రాజనీతి! నేనూ ఒప్పుకుంటాను. (కొండయ్యను భుజం తట్టి) యేం కొండయ్యా? యేమంటావ్?)

కొండ:—(కోపంతో) నిన్ను యిందులో కలగ చేసుకోవద్దంటాను.

మారు:—మంచిమాట చెప్పావు—చూడూ! స్నేహితుడైనా, శత్రువైనా ఒకటే రాజనీతి—మీ మామ అచ్చన్న యెన్నో కొంపలు కూలదీశాడు. అచ్చన్నకు నువ్వు కుడిభుజం!

కొండ:—అది నా యిష్టం. మధ్యని ను వ్వెవడవ్?

మారు:—మామ ఆస్తిలో అల్లుడికి వంతు వుంటుంది. మామ శిక్షలో కూడా అల్లుడు వంతు పుచ్చుకోకోవడం ధర్మం. యేమంటావ్?

కొండ:—(కోపంతో) కొంచెం వళ్ళు దగ్గిర పెట్టు కోమంటాను.

మారు:—దివ్యమైన సలహా! రత్తయ్యా! నువ్వు నాతో రా! (రత్తయ్య చెయ్యి పట్టుకొని యింటివైపు నడుస్తాడు.)

కొండ:—(అడ్డువచ్చి) ఆగు! ఆణ్ణి వదిలెయ్!

మారు:—వదిలెయ్యమంటావా? మంచిది. అలాగే వదిలేస్తాను. (రత్తయ్యను విడిచిపెట్టి) అయితే నువ్వేరా నాతో! (కొండయ్యను చెయ్యి పట్టుకొని లాగుతాడు.)

కొండ:—(చెయ్యి విడిపించుకుంటూ) వేళా కోళంగా వుందా?

మారు:—సరిగ్గా అలాగేవుంది. (కొండయ్యని రెండు భుజాలూ పట్టుకొని) యీ హంస తూలికాతల్పంపై కూర్చో! (అరుగుమీదవున్న గడ్డిమీద బలవంతంగా కూర్చో బెడతాడు.)

కొండ:—(పట్టు విడిపించుకుంటూ) ఒరేయ్!

మారు:—ఆవేశ పడకు. కాలచక్రం తిరిగి—రారాజులు, చక్రవర్తులూ—బికారులై, యీ పాన్పుమీదే పడుకుంటూ వుంటారు. (కొండయ్య కోపంతో లేవబోతాడు. మారుతి బలవంతంగా అతనిని తిరిగి కూర్చోబెట్టి) గడ్డిని నీచంగా చూడకు కొండయ్యా! మహా మహులకు జ్ఞానోదయం యీ పాన్పుమీదే కలిగింది. అంతేకాదు. నిత్యం గడ్డినే తిని జీవించే పశువుల్లో సాధుత్వం వచ్చింది. పంచభక్ష్య పరమాన్నాలు తినే మనిషిలో పశుత్వం వచ్చింది. యిప్పటికైనా గడ్డి మహాత్మ్యం బోధపడిందా నీకు? (అతనిని రెండు చేతులతో లేవతీసి) యిక యీ సమీపానికి యెప్పుడూ రాకు! ఫో! ఊఁ! (ఎడమవైపు విసిరేస్తాడు.)

కొండ:—(తూలి—పడిపోబోయి—ఆగి—అవమానం కోపం మిళితమైన స్వరంతో) ఒరేయ్! తొందరపడకు! నీ గుండెల్లో నిద్రోకపోతే నా పేరు కొండయ్యేకాదు!

(ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

రత్త:—(సంతోషంతో) మా బాగా గడ్డెట్టేవు యెదవకి?

మారు:—(పైకి చూస్తూ) ఆకాశంలో పక్షులు చూడు. బారులు తీరి—స్వేచ్ఛగా హాయిగాపోతున్నాయి. యెంత ప్రశాంత మైన జీవితం వాటిది! (రత్తయ్య భుజం పట్టుకొని) నువ్వు కూడా ఆ పక్షులలా—హాయిగా ప్రపంచంలోకి వెళ్ళిపో! ఊ! యిక వెళ్ళు.

రత్త:—(భయంతో) బాబోయ్, నేను యెళ్ళను.

మారు:—యేం?

రత్త:—నే నిప్పుడు పైకెళితే అళ్ళు నన్ను పట్టుకుని తన్నేస్తారు.

మారు:—అయితే యిక్కడే కూర్చో! గాలిలో మేడలు కట్టుకో! వాటిలో తిరుగుతూ సంతోషించు.

(మారుతి యింట్లోకి వెళ్ళిపోతాడు. —రత్తయ్య అరుగు మీద కూర్చుంటాడు. దూరాన్ని పాట వినిపిస్తుంది. కుతూహలంతో లేచి నిలబడతాడు. ఎడమవైపు పరికించి చూస్తూ వుంటాడు. రాక్ అండ్ రోల్ పాట పాడుతూ శ్యామసుందరం, మౌత్ ఆర్గన్ వూదుతూ రఘుపతి ప్రవేశిస్తారు. యిద్దరూ సుమారు 22 సంవత్సరాల వయసులోని యువకులు. రఘుపతి తెల్లటి సిల్కు బుష్షర్టు, చాక్లెట్‌కలర్ సిల్కు ఫాంటు వేసుకున్నాడు. శ్యామసుందరం బొమ్మలున్న అమెరికన్ జాకెట్, ఫ్లేర్ ఫాంట్ వేసుకున్నాడు. తలమీద ఈవెనింగ్ హేట్‌వుంది. రత్తయ్యకు యీ యిద్దరు యువకుల రూపం వింతగా కనిపిస్తుంది. పాటకు అతను పరవశుడౌతాడు. యిద్దరి మధ్యకూ వచ్చి పాట వింటూ, యిద్దరికేసి చూస్తూవుంటాడు.)

శ్యామసుందరం:—(పాట)

వారే వారే వారేవా
జారీ జారీ పోయేగా
చక్కనైనా చుక్కారా!
చుక్కల్లోనీ జాబిలిరా!
నన్నూ చూసీ నవ్వేరా
నవ్వుల్లోనూ వెన్నెలరా!
అల్లా అల్లా అల్లాలా!
లాలీ అల్లా లాలాలా!

రత్త:—(సంతోషంతో) బలే! బలే! యేంపాట! యేం పాట! (శ్యామసుందరంతో) యే వూరండీ మంది? యేం పాటండీ యిది?

శ్యామ:—మాది మహాపట్నం! పాటపేరు రాక్ ఎన్ రోల్!

రత్త:—అబ్బెబ్బే! యిది రోలూ రోకలి పాటకాదు. అదైతే
అత్తలేని కోడ లుత్తమూరాలు—నువ్వ
కోడల్లేనీ అత్త గుణవంతురాలు—నువ్వ!

శ్యామ:—హాయ్! హాయ్! ధుమా ధుమా!

రత్త:—రోకలి పాటంటే యిదీ!

రఘు:—నువ్వు పాడినపాట శుద్ధ పల్లెటూరిపాట. మా పాట అమెరికాదేశంలోని హాలివుడ్ పుణ్యక్షేత్రంనుంచి దిగుమ తయ్యింది. ఈ సారి తెలిసిందా?

రత్త:—ఓరి దీని తస్సాదియ్యా! అలాగంటండి! (శ్యామసుందరంతో) మీ పేరేంటండి?

శ్యామ:—నాపేరు మిస్టర్ శ్యామసుందర్!—మేం ఓ రాచ కార్యంమీద వచ్చాం. యిక నీ పనేదో నువ్వు చూసుకో.

రఘు:—శ్యాం! రెండు ఫర్లాంగులదూరం నడిపించావు. కానీ పిల్ల జాడ యెక్కడా కనపడలేదు.

శ్యామ:—యీ దారినే వెళ్ళింది. నేను స్వయంగా చూశాను.

రఘు:—ఎక్కడికి వెళ్ళిందంటావ్?

శ్యామ:—అదే తెలియకుండా వుంది. చేతిలో పూల సజ్జ వుంది. ఒకవేళ దేవాలయానికి వెళ్ళిందేమో! (రత్తయ్యతో) యీ చుట్టుపట్ల దేవుడి గుడి యేదైనా వుందా?

రత్త:—(కుడివైపు చూపిస్తూ) అదుగో! గోపురం కనపడతందికాదూ? ఆదే దేవుడి గుడి.

రఘు:—అయితే సందేహంలేదు. పిల్ల గుడికి వెళ్ళి వుంటుంది. మనం అక్కడికే వెళ్ళి చూద్దాం. పద! (కుడివైపు వెళ్ళబోతాడు.)

శ్యామ:—(ఆపుచేసి) వద్దు. మనం అక్కడికి వెళితే ఎవరైనా అనుమానించవచ్చు. యిక్కడే నిలబడదాం.

రఘు:—యివేం పద్ధతులో—యేం పెళ్ళిచూపులో నాకేం బోధపడ్డంలేదు. గాలిరానిగదిలో పందిరిపట్టె మంచంమీద నన్ను కూర్చోబెట్టారు. ఒక ముసుగు మనిషిని తీసుకువచ్చి "యిదిగో—పెళ్ళికూతు" రన్నారు.

శ్యామ:—మరి ముసుగు తియ్యమనలేక పోయావూ?

రఘు:—వాళ్ళంతట వాళ్ళే తీశారు.

శ్యామ:—మరి? నువ్వు సిగ్గుపడి చూడ్డం మానేశావా?

రఘు:—ముసుగు తీసినా పెళ్ళికూతురు ముఖం మాత్రం నాకు కనపడలేదు.

శ్యామ:—అయితే నీకు కొంచెం చత్వారం ముదిరి వుండాలి.

రఘు:—అది కాదురా! తల నేలమీదికి దించేసింది. ఆవిడ శరీరం అంగుళమైనా ఖాళీ వుంచకుండా బంగారంతో మూసేశారు.

శ్యామ:—ఓహెూ! అదా కథ? యీ సారి నీ యిబ్బంది నాకు బోధపడిందిలే! మన ఆడవాళ్ళని చూస్తే నాకు వళ్ళు మండుతుంది. మెడనిండా బంగారమే—తలనిండా బంగారమే. చెవులకు బంగారం, ముక్కుకు కూడా బంగారమే! భుజాలకి, చేతులకి, వేళ్ళకి, నడుముకి అంతా బంగారమే.

రఘు:—అందుకే కాబోలు! మన ముసలాళ్ళు 'పిల్ల బంగారపు బొమ్మ''లా వుంది అంటారు.

శ్యామ:—యిక ఇంగ్లీషు వాళ్ళని చూస్తే ముచ్చటేసుకొస్తుంది. ఆ దొరసాన్లు—అబ్బ—వాళ్ళ వొళ్ళే ఒక బంగారం! హాలీవుడ్ తారలను చూడు! కళ్ళు చెదిరిపోతాయి.

రఘు:—మనం పెళ్ళికూతుర్ని ఈ నడిరోడ్డుమీదే చూద్దామంటావా?

శ్యామ:—అంతే! అంతే! యిక్కడయితేనే బాగా చూడొచ్చు.

రఘు:—పిల్ల బాగావుంటే సరేసరి. లేకపోతే యీ రాత్రికే బండి యెక్కేద్దాం.

శ్యామ:—ఈ వ్యవహారంలో నువ్వు తొందర పడడానికి వీల్లేదు. అందంకోసం చూడకు.

రఘు:—యేడిచినట్టే వుంది నీ సలహా!

శ్యామ:—అందం చందం అంటూ యీ విశిష్టమైన సంబంధాన్ని చెడగొట్టుకోకు. ఈ పెళ్లికూతురు పేరున యాభై వేల రూపాయల ఆస్తి వుంది.

రఘు:—(కోపంతో) యీ వెధవ డబ్బుకోసం—కోతిలా వున్నా సరే—ఆ పిల్లను పెళ్లాడేయమంటావా?

శ్యామ:—తొందరపడకు. డబ్బును నీచంగా చూడకు. ఈ ప్రపంచంలో డబ్బున్నవాడే అందగాడు. అతనే సంస్కారవంతుడు. అతడే పండితుడు. సంగీత సాహిత్యాది సమస్త విషయాల గురించి క్షుణ్ణంగా మాట్లాడగల ధైర్యం, తెలివి—కేవలం డబ్బున్న వాడికే వుంటాయి. యావత్తు ప్రపంచం డబ్బున్నవాడి వెనకే చేతులు కట్టుకొని నడుస్తుంది. సుందరాంగనలు మంగళ గీతాలు పాడతారు. మెడలో పూలహారాలు వేస్తారు.

రఘు:—(చుర చురా చూస్తూ) అంతేనా? యింకా నువ్వు చెప్ప వలసిందేమైనా వుందా?

శ్యామ:—యింకా కొంచెం వుంది. ధనవంతుణ్ణి కవులు కవి అని, చిత్రకారులు చిత్రకారుడని, రాజకీయ నాయకులు రాజ్యాంగవేత్త అని, నర్తకులు నాట్య శాస్త్ర పారంగతుడని—వివిధ నామధేయాలతో పిలుస్తారు. ఈసారి డబ్బు మహిమ బోధపడిందా?

రఘు:—ఓ! పూర్తిగా బోధపడింది. ఆరు నూరైనా, నూరు ఆరైనా పిల్ల అందంగా వుంటేనే నేను ఈ సంబంధానికి ఒప్పుకుంటాను. అందంగా లేకపోతే నిలువెత్తు డబ్బు కుమ్మరించినా పెళ్ళి చేసుకోను.

శ్యామ:—హా! చచ్చాంరా భగవంతుడా! యింతసేపూ నేను చేసినదంతా అరణ్య రోదనమేనా?

రత్త:—(యిద్దరి మధ్యకూ వచ్చి) పిల్లేంటి? పెళ్లేంటి? అసలు కథేంటి?

శ్యామ:—తోలు బొమ్మలాటలో గంధోళిగాడిలా మధ్యని నువ్వేమిటోయ్ మాకు?

రత్త:—బలే! బలే! బాగా గేటకం పేశారు. యియ్యేళ రాత్రి పాటిమీద తోలుబొమ్మలాటుంది.

రఘు:—(ముందుకు చూస్తూ) ఈ వూరును చూసేకొద్దీ చూడ ముచ్చటేస్తోంది.

శ్యామ:—మన పట్నంలో ఓడలూ, మేడలూ వుంటే యిక్కడ గుళ్ళూ, గోపురాలూ వున్నాయి.

రఘు:—(కుడివైపు చూపిస్తూ), చూడూ! ఆ చెట్లనిండా పళ్ళు యెలా వున్నాయో!

శ్యామ:—మన పట్నంలో పళ్ళు మార్కెట్లోనే కానీ, చెట్ల మీద కనిపించవు.

రఘు:—చిగురుటాకులు, కోకిలలు, చిలకలగుంపులు, రంగు రంగుల పువ్వులు, పువ్వులపై ఎగిరేతుమ్మెదలూ—కవితా సామగ్రి అంతా యీ పల్లెటూళ్లో కనిపిస్తోంది.

శ్యామ:—కాబట్టి యీ అమ్మాయిని పెళ్లి చేసుకొని యిక్కడే కులాసాగా కాలక్షేపం చెయ్యి. అప్పుడప్పుడువచ్చి, నేను చూస్తూ వుంటాన్లే. నీకు కాబోయే మామగారు యీ పల్లెటూరికి కిరీటంలేని చక్రవర్తి. నీ మాటకి తిరుగుండదు.

రత్త:—అబ్బాయిగారూ! మీరు లచ్చన్నరైతు గారింటికి రాలేదుకందా?

శ్యామ:—సరిగ్గా అక్కడికే వచ్చాం.

రత్త:—వచ్చాం!!

రఘు:—ఎందుకోయ్ అంత భయపడుతున్నావ్?

రత్త:—మీరు పెళ్ళి సంబంధాని కొచ్చేరా?

శ్యామ:—అవును. లచ్చన్నగారి అమ్మాయిని మా స్నేహితుడు రఘుపతికి యిచ్చి పెళ్ళి చెయ్యబోతున్నారు.

రఘు:—కాదోయ్! పెళ్ళి చెయ్యబోవడంలేదు. పెళ్లి చూపుల కొచ్చాం. యింతకీ పిల్ల యెలాంటిది?

రత్త:—పిల్లంటే పిల్లా! అగ్గినిప్పు!—కొండయ్యగాడు ఈ పిల్లని పెళ్లిసేసుకుంటానని తెగమిడిసి పడుతున్నాడు. ఆడి పొగరణగాలంటే—బాబ్బాబు, మీరా పిల్లని పెళ్లాడేద్దురూ—సాలు. ఆ దెబ్బతో ఆడు కుక్కిన పేనులా సచ్చినట్టు పడుంటాడు.

శ్యామ:—ఓహో! ఈ కథలో విలన్ కూడా ఒకడున్నాడే?

రఘు:—మధ్యని కొండయ్యగాడెవడోయ్?

రత్త:—కొండయ్య లచ్చన్నగారి మేనల్లుడు.

శ్యామ:—అయితే?

రత్త:—ఆడు రౌడీ!—అంటే నాలాంటి మెత్తనోళ్ళ దగ్గరే రౌడీ!—లచ్చన్నరైతు 'ఊం' అంటే సాలు. ఆడు యే కొంపయినా పీకేస్తాడు.

రఘు:—అయితే శ్యాం! యింటిలో సంబంధం ఒకటి వుండగా ఈ లచ్చన్న మనకోసం యెందుకు తిరుగుతున్నాడు?

శ్యామ:—బాగుంది నువ్వు చెప్పేది! మన సంబంధంలాంటి సంబంధం చస్తే దొరుకుతుందా?

రఘు:—(కుడి వైపు చూస్తూ) యింకా రాకుండా వుందేమిటి? యింట్లో చెప్పకుండా వచ్చాం. పిల్లని చూడకముందే వాళ్ళు వచ్చి మనల్ని సగౌరవంగా లాక్కుపోగలరు.

శ్యామ:—తొందరపడకు. ఈ ప్రకృతిశోభను తిలకించు. పరవశత్వంతో ఒక పాట పాడు. నాట్యం చెయ్యి.

రత్త:—అబ్బాయిగారూ! యిందాక మీరు పాడినపాట నాక్కొంచెం నేర్పుదురూ!

శ్యామ:—ఓహో! బాగుందే! నేనేం సంగీతం మేష్టార్ననుకున్నావా?

రత్త:—ఆ పాట యింకా నా సెవుల్లో గింగురుమంటానే వుంది. ఆ పాట మీరు నాకు నేర్పితే నే నీ వూరి కుర్రోళ్ళందరి మీదా సవాల్‌చేసి పాడతాను.

శ్యామ:—యిప్పుడు వీల్లేదు పోవోయ్.

రత్త:—బాబ్బాబు! నా మాట తీసెయ్యకండి. మీకు తాటి ముంజలు కావాలో—యీత పళ్ళో కావాలో—బంగిని పల్లి మామిడి కాయలు కావాలో—యేం తెమ్మంటే అది తెస్తాను. యేం యిమ్మంటే అది యిస్తాను. నాకా పాట నేర్పేద్దురూ!

శ్యామ:—నీకు పాట నేర్చుకోవాలనివుంటే ఒక పని చెయ్యి.

రత్త:—మీరేం సెయ్యమంటే అది సేస్తాను. నా కా రోంపాట సెప్పాలి.

శ్యామ:—నువ్వు రాత్రికి లచ్చన్నగారి ఇంటికి రా. అప్పుడు తీరికగా.......వెన్నెలలో........

రత్త:—(మధ్యలో అందుకొని) ఆ కొండయ్యగాడు నా బుర్ర యెగరేస్తాడు.

శ్యామ:—నీకేం భయంలేదు. నువ్వు మా అతిథి హోదాలో వుండగా నిన్నెవ్వరూ యేమీ అనరు.

రత్త:—బాబ్బాబు, యిక్కడే సెప్పేద్దురూ!

రఘు:—యిదేం గొడవరా శ్యాం? యితనిని వేగం వదిలించు.

శ్యామ:—యిలాంటి కాలక్షేపం నీకు చస్తే దొరుకుతుందా? (రత్తయ్యతో) యిక మేం యీ వూరు వదిలిపెట్టి పోయేవరకూ నువ్వు మాతోనే వుండిపో.

రత్త:—మరి ఆ పాట నేర్పితేనే వుంటాను.

శ్యామ:—అది నీకు చస్తే నోరు తిరగదు. నీ పల్లెటూరి ఆహారానికి సరిపోయే పాట ఒకటి పాడమంటావా?

రత్త:—సాలా బాగుండాలి.

శ్యామ:—(పాట పాడుతూవుంటాడు. రత్తయ్యపాటలో లీనమై అడుగు వేస్తూ వుంటాడు.)

తెల రాళ్ళ కమ్మం జోడూ
నీ కివ్వను పోరా
తెల రాళ్ళ కమ్మల జోడూ
తొలి చూపులలో
తలి రాకులలో
విరి తీగెలలో
చిరు నవ్వులతో
వలపుల వల విసరకురా
నీ కివ్వనుపోరా
తెల రాళ్ళ కమ్మల జోడూ!

రత్త:—(ఆనందంతో) వారేవా! వారేవా!

(రత్తయ్య పరవశత్వంతో యీలవేసి చిందులు తొక్కుతూ వుంటాడు. చివరి చరణం పాడుతూవుండగా యింటి తలుపులు తెరుచుకొని వీరయ్య వస్తాడు.)

వీరయ్య:—(కోపంతో రత్తయ్య దగ్గరకు వెళ్ళి వీపుమీద ఒక్కటేస్తాడు.)

రత్త:—బాబోయ్ (వెనక్కి తిరిగిచూసి భయంతో) అయ్యో!

వీర:—నీకేం సెప్పేనూ? నువ్వేం సేస్తున్నావ్? అసలు నువ్విక్కడికెందు కొచ్చావ్? (కొట్టబోతాడు.)

రత్త:—(తప్పించుకుంటూ) ఒరే! ఒరే! అయ్యో! కొట్టొయ్యకురా! నేను రాలేదురా! ఆళ్ళీడుసు కొచ్చార్రా అయ్యో!

వీర:—యేషా లేస్తున్నావంట్రా! పద! (కొడుతూ రత్తయ్యని యీడ్చుకొని ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

రఘు:—(వాళ్ళు పోతున్న వైపు చూస్తూ) నాగరికతలేని పటి దద్దమ్మలు!

శ్యామ:—(కుడివైపు చూపిస్తూ) అదుగో! అదుగో! వస్తోంది.

రఘు:—(వెంటనే అటు తిరిగి) ఆ పిల్లేనా? కొంపతీసి మరొక అమ్మాయి కాదుకదా?

శ్యామ:—కాదు. ఆమె నడక చూడు. అచ్చంగా హంస నడుస్తున్నట్టు లేదూ?

రఘు:—హంసను నే నెప్పుడూ చూళ్ళేదుగా!

శ్యామ:—ఊహించుకో! నీలోని కవిహృదయం నిద్రపోతోందా? చూడు—ఆమె వాల్జడ!

రఘు:—నల్లత్రాచులా వుందంటావా? ఒప్పుకుంటాను. ఆమె కట్టూ, బొట్టూ, నడక—ప్రబంధ సుందరిలా వుంది.

శ్యామ:—(సంతోషంతో) అద్గదీ!

రఘు:—ముఖం మాత్రమే సరిగా కనిపించడంలేదు.

శ్యామ:—ఉష్! మాట్లాడకు. దగ్గర కొస్తోంది.

రఘు:—(నెమ్మదిగా) పలకరించి చూస్తేనో?

శ్యామ:—కాలేజీ అమ్మాయి అనుకున్నావా పలకరించడానికి? పల్లెటూరిపిల్ల! పలకరిస్తే వళ్ళు హూనం చేసేస్తారు. జాగర్త!

(గౌరి పూల సజ్జతో కుడివైపునుంచి ప్రవేశిస్తుంది. రఘుపతి, శ్యామసుందరం—పక్కకు తప్పుకొని—ఆమెకేసి రెప్ప వెయ్యకుండా చూస్తూవుంటారు. గౌరి వాళ్ళకేసి చూడకుండా సరాసరి యింటి ద్వారం దగ్గరికి వెళుతుంది.)

గౌరి:—(గుమ్మం దగ్గర నిలబడి) ఓ! నారాయణ మామా!

(బిగ్గరగా పిలుస్తుంది. జవాబురాదు. గౌరి తలుపు తెరుచుకొని లోపలికి వెళ్ళి పోతుంది.)

శ్యామ:—(యింకా అటే చూస్తూ వున్న రఘుపతితో) ఎలా వుందోయ్ పిల్ల?

రఘు:—సినిమాస్టార్‌లా వుంది.

శ్యామ:—నీకు నచ్చిందా?

రఘు:—నచ్చిందా అని మెల్లిగా అడుగుతున్నావా? యిలాంటి అమ్మాయి మనకు పట్నంలో కనిపిస్తుందటోయ్?

శ్యామ:—ఈ సంబంధం రైట్ చేసెయ్యమంటావా?

రఘు:—రైటో! రైటో (క్షణం ఆగి) కానీ రెండు సందేహాలు వున్నాయ్.

శ్యామ:—యింకా సందేహమేమిష్టా? ఆమె పిలుపు కొమ్మల్లోంచి కోకిల పిలిచినట్టు లేదూ?

రఘు:—వుందోయ్ వుంది. కాని నా సందేహం యేమిటంటే ఆమెకు మనసంబంధం యిష్టమేనా అని!

శ్యామ:—ఆ వ్యవహారం నాకు విడిచిపెట్టు.

రఘు:—యిక రెండవ సందేహం యేమిటంటే—ఆ పిల్ల యీ యింటిలోకి ఎందుకు వెళ్ళింది? యీ యిల్లు ఎవరిది?

శ్యామ:—అలాంటి పాడు సందేహం యేమీ పెట్టుకోకు. కొమ్మ కొమ్మకూ తిరిగే కోకిలల లాగ—యీ పల్లెటూరి పిల్లలు వూళ్లోవున్న యింటింటికీ తిరుగుతూ వుంటారు. యిలా వస్తారు. అలా పిచ్చుకలలా ఎగిరిపోతూ వుంటారు. అడవి లేళ్ళలా అమాయకంగా తిరిగేస్తారు.

రఘు:—(యింటి గుమ్మం సమీపించి) కొంచెం తలుపు తెరిచి చూడనా?

శ్యామ:—వద్దు. వద్దు. అలాంటి పని చేస్తే ప్రమాదిస్తుంది.

రఘు:—(అసహనంతో) మరేం చెయ్యమంటావ్?

శ్యామ:—నీ కంతగా చూడాలని వుంటే—మాట్లాడకుండా నా వెనకాల నిలబడు. (గుమ్మం దగ్గరకు వెళతాడు.)

రఘు:—వెనకాల నిలబడను. ముందే నిలబడతాను.

శ్యామ:—అయితే నీ కర్మ, అలాగే నిలబడు.

(ద్వారానికి తిన్నగా ముందు రఘుపతి వెనక శ్యామసుందరం జడుస్తూ నిలబడతారు.)

రఘు:—(ముందుకు చూస్తూ—నెమ్మదిగా) కనబడ్డంలేదు.

శ్యామ:—(గుమ్మంలోకి చూస్తూ బిగ్గరగా) ఏమండోయ్.

రఘు:—(ఒక్కసారి ఉలికిపడి—భయంతో శ్యామసుందరానికి వెనక వచ్చి నిలబడి) చంపావు. ఎందుకురా పిలుస్తావు?

శ్యామ:—ఉష్! మాట్లాడకు!—(తిరిగి పిలుస్తాడు) యేమండోయ్!

నారాయణ:—(లోపలినుంచి బిగ్గరగా) ఎవరదీ?

శ్యామ:—కొంచెం మంచినీళ్ళు కావాలండీ?

రఘు:—(నెమ్మదిగా) హమ్మయ్య. బతికించావు.

నారా:—(బిగ్గరగా నవ్వుతూ) బాగా జ్ఞాపకం చేశావు. నా సొమ్మంతా మంచి నీళ్ళలా ధారపోశాను. యిక మిగిలింది పట్టె బూడిద.

(ఎడమవైపునుంచి—పంచెతో ముఖం కప్పుకొని—బెదురు చూపులు చూస్తూ పుల్లయ్య ప్రవేశిస్తాడు.)

పుల్లయ్య:—(ఆత్రుతతో) ఏమండోయ్ అబ్బాయిగారూ!

రఘు, శ్యామ:—(ఒక్కసారి వెనక్కి తిరిగి) ఎవరు?

పుల్ల:—కొంప తీసేశారు. అక్కడుండకండి. రాండి. బేగా రండి.

(ఇద్దరూ అతనిని సమీపిస్తారు)

శ్యామ:—ఏమోయ్, ఏమిటి సంగతి?

రఘు:—కొంప మునిగిపోయినట్టు పిలిచావే?

పుల్ల:—బాబూ, తెలిసున్న వాడెవడూ ఆ యింటి దరిదాపులికి యెళ్ళడు.

శ్యామ:—ఏం? ఎందుకని?

పుల్ల:—ఆ యింట్లో ఒక పిచ్చోడూ ఒక మొండోడూవున్నారు.

రఘు:—అయితే శ్యాం! మనతో మాట్లాడినవాడు నిస్సందేహంగా పిచ్చాడే!

పుల్ల:—రాండి బాబూ! రాండి. మీ కోసం లచ్చన్నబాబుగా రెతుక్కుంటున్నారు.

రఘు:—వస్తాం కానీ—లచ్చన్నగారి అమ్మాయి యీ యింట్లోకి ఎందుకు వెళ్ళినట్టు?

పుల్ల:—ఆళ్ళకీ ఆళ్ళకీ–చుట్టరికం—యిరోదం రెండూ వున్నాయి. ఆయన్నీ తరవాత సెప్తాను. రాండి పోదాం. ఆ మారుతిగా డివతం కొచ్చేడంటే......

(ముందు పుల్లయ్య వెనక రఘుపతి, శ్యామసుందరం ఎడమవైపు వెళ్ళిపోతారు.—యింటి తలుపులు నిశ్శబ్దంగా తెరుచుకుంటాయి. మారుతి అడుగులో అడుగు వేసుకుంటూ చప్పుడు కాకుండా యివతలికి వస్తాడు. అరుగుమీదవున్న గడ్డిపైని పడుకుంటాడు. లోపలినుంచి గౌరి తొందరగా వస్తుంది. పళ్ళనిండా పువ్వులు వున్నాయి.)

గౌరి:—(చుట్టూ ఆత్రుతతో వెతికి చూసి) నారాయణ మావా!

నారాయణ:—(ప్రవేశించి) నువ్వటే పిల్లా? ఇంకా ఎవరో అనుకున్నాను. (లోపలికి వెళ్ళిపోబోతాడు.)

గౌరి:—మామా! చిన్నిమాట.

నారా:—(ఆగి) చిన్నిమాట! (బిగ్గరగా నవ్వుతాడు.) మాటా మాటా పెరిగితే పేటలు పేటలే తగులడతాయి.

గౌరి:—బావ యెటు పోయాడో నువ్వు చూశావా?

నారా:—నేను చూసినప్పటికీ చూడనివాళ్ళల్లోనే లెక్క! బతికి వున్నప్పటికీ చచ్చినవాళ్ళలోనే జమ!

గౌరి:—అబ్బబ్బా! నే నడిగేది ఒకటీ—నువ్వు చెప్పేది మరొకటీ—నేను పువ్వులుకోసుకొని వచ్చేసరికి బావ పారిపోయాడు. ఎటు పోయాడో నువ్వు చూశ్శేదా?

నారా:—చూశాను.

గౌరి:—ఎటు వెళ్ళాడు?

నారా:—వాడికి అనుకూలంగావున్నవైపే వెళ్ళాడు.

గౌరి:—(నిస్పృహతో) పోనీలే నువ్వు చెప్పకపోతే!

నారా:—చెట్టులకీ, పుట్టలకీ, పైనుండి ఎగిరిపోయే పిట్టలకీ—వాడి జాడ తెలుసు. వాడి మనసు తెలుసు. వాడు నర

ప్రపోదు. యీ వెర్రిలోకాన్నిచూసి వెక్కిరిస్తాడు. మై మరచి నిద్రపోతాడు. (గడ్డిపై పడుకున్నమారుతిని వేలితో చూపించి) నిద్రలో కలలు కంటాడు. దివ్య లోకాలలో విహరిస్తాడు. మనుష్యుల్నిచూస్తే మండిపడతాడు.—ఏయ్! పిల్లా! అగ్ని ఎర్రటి కాంతితో చూడ్డానికి అందంగా వుంటుంది. దూరాన్నుంచి చూసి సంతోషించు. ముట్టుకున్నావో కాలిపోతుంది. ఆ తరువాత నీ కర్మ! (లోపలికి వెళ్ళిపోయి తలుపు మూసుకుంటాడు)

గౌరి:—(సంతోషంతో) దొరికావులే! యీ సారి ఎక్కడికిపోతావు? (పూల పజ్జలోంచి చేతినిండా పువ్వులు తీసి) ఆగు! ఆగు! ఇది నిజమైన నిద్రో—దొంగ నిద్రో యిప్పుడే తెలుస్తుంది. (పువ్వులు అతనిమీదికి విసురుతుంది.)

మారుతి:—(ఆకస్మికంగా లేచి కూర్చుని కోపంతో) గౌరీ!

గౌరి:—( హేళనగా—నిర్లక్ష్యంగా) యేం? దొరగారికి అంత కోపం వచ్చింది!

మారు:—(కళ్ళు నులుముకుంటూ) నా ఊహల్ని చెరిపేశావు. తీయటి కలల్ని తుడిచేశావు. (లేచి) యిదే మరోకళ్ళైతే....

గౌరి:—(కొంటెగా) మరొకరైతే యేం చేస్తావ్?

మారు:—(కోపంతో) ఏం చేస్తానా? రెండు చేతులూ విరిచి కడతాను. చెట్టుకు తల క్రిందులుగా వేలాడ తీస్తాను.

గౌరి:—(సంతోషాన్ని అభినయిస్తూ)నువ్వు నా మీద ఆ మాత్రం అభిమానం చూపించినందుకు—నాకు చాలా సంతోషంగా వుంది.

మారు:—(నిర్లక్ష్యంగా) అభిమానమా? నీ మీదా? నాకా?

గౌరి:—యిప్పుడేగా చెప్పావు. నన్ను కవక విడిచి పెట్టేశావని!

మారు:—అమ్మాయీ! అపార్థాలు తియ్యకు. అది అభిమానం కాదు. ఆడదానివని కనికరించి.....

గౌరి:—పోనీలే! నామీద కనికరం వుందికదా! అదే చాలు!

మారు:—కాదు. కాదు. అది కనికరం కూడా కాదు.

గౌరి:—మరి యేమంటావ్?

మారు:—(కోపంతో) మారు మాటాడకుండా—నీ దారిని నిన్ను వెళ్ళమంటాను.

గౌరి:—చేతనైతే మాటకిమాట జవాబు చెప్పు. ఎందు కలా విరుచుకు పడతావ్?

మారు:—అసలు నువ్వు యిక్కడికి ఎందుకు వచ్చావు?

గౌరి:—నీ ముఖం చూడ్డానికి రా లేదులే! పువ్వులకోసంవచ్చాను.

మారు:—(పూలసజ్జకేసి చూసి) నీ పని అయిపోయిందిగా! యిక దయచెయ్!

గౌరి:—యేం? వెళ్ళకపోతే పుట్టి కట్టుకొని మీ యింట్లో వెళ్ళాడతా ననుకున్నావా?

మారు:—(ఆమెకేసి చుర చురా చూస్తూ), నీ వాలకం చూస్తూ వుంటే—నువ్వేదో పథకం వేసుకొని—పేచీకి వచ్చినట్టే కనిపిస్తోంది. మంచిది. నీ తండ్రి లచ్చన్న నాకు పగవాడు.

గౌరి:—నువ్వు పొరపాటు పడుతున్నావు.

మారు:—పొరబాటా? ప్రత్యక్షంగా నిదర్శనం కనిపించడం లేదూ? కళ్ళు తెరిచిచూడు. అదుగో! మా నాన్న! ఎందుకు అలా మారిపోయాడు?—మా యింటిలోని డబ్బూ, ధాన్యం, సిరి, సంపద సమస్తం మీ యింటిలోకి ప్రవహించుకు పోలేదా? అవన్నీ ఎలా పోయినై? న్యాయంగానే పోయాయా?—యిప్పుడు మేం అనుభవిస్తున్న దరిద్రం దేవుడు సృష్టించిందా? మనిషి సృష్టించిందా?—యేం? మాట్లాడవేం?

గౌరి:—నాకు తెలియదు.

మారు:—(ఆలోచిస్తూ), నీకు తెలియదు. నిజమే—(కర్కశంగా) నువ్వు వెళ్ళిపో. నాకు కనిపించకు.

గౌరి:—ఏం కనిపిస్తే? నీ మనసు యేమైనా కొంచెం చెదురుతోందా?

మారు:—అధిక ప్రసంగం చెయ్యకు. నువ్వు నన్ను రోజూ ఎందుకు వెంటాడుతున్నావో నాకు అర్థం కావడంలేదు. (సందేహంతో) ఒకవేళ మీ నాన్న—యీ పేచీలో-నిన్ను శిఖండిలా ఉపయోగించుకోవడంలేదు కదా?

గౌరి:—నేనేం కీలుబొమ్మ ననుకున్నావా?

మారు:—మీ కుటుంబం అంతా యేకమై, నామీద రాళ్ళు విసురుతున్నారు. నువ్వు పువ్వులు విసురుతున్నావు. దీనిలో వున్న అంతరార్థం......

గౌరి:—నాకు పగలేదు. కోపంలేదు. అదే కారణం. అంతకంటే వేరే కారణంలేదు. చూడు బావా! మీ అమ్మ బతికి వున్నంతకాలం మన కుటుంబాలు రెండూ కలసి మెలసి వుండేవి.

మారు:—(బాధగా) గౌరీ! మా అమ్మను జ్ఞాపకం చెయ్యకు. (ఆలోచనగా) ఆమె ఆకస్మికంగా ప్రాణం విడిచిపెట్ట డానికి ఎవరు కారణం?—అవన్నీ తలచుకుంటే నాకు వెర్రెత్తుతోంది.

గౌరి:—మీ అమ్మ బతికివుంటే నువ్విలా తప్పుదారులలో నడవడానికి వీలుండేదా?—ఆవిడ కన్ను మూయగానే నువ్వు చదువు మానేశావు. పరశురాముడిలా పగబట్టి అడ్డొచ్చిన వాళ్ళందర్నీ చితగ్గొడుతున్నావు. ఎవరికీ అందకుండా గాలిగోపురంలోకి పోయి కూర్చుంటున్నావు. యిలా ఎంతకాలం సాగుతుంది బావా?

మారు:—ఎంతకాలం సాగుతుందా? (కోపంతో) నీ తండ్రి వున్నంతకాలం సాగుతుంది.

గౌరి:—తప్పు బావా! పగతో నువ్వేమీ సాధించలేవు—దాని మూలాన్ని అందరం చెడిపోతాం.

మారు:—యీ సారి నీ స్వార్థం నాకు తెలిసింది.

గౌరి:—ఏమిటది?

మారు:—నువ్వు నీ తండ్రిని రక్షించుకునేందుకు నన్ను వెంటాడుతున్నావు.

గౌరి:—మా నాన్నను రక్షించుకోవలసిన అవసరం నాకు లేదు. ఆయన బలంలేనివాడు కాదు. చేతినిండా డబ్బావుంది. మనుష్యులూ వున్నారు.

మారు:—చుట్టూ పగవాళ్ళు కూడా వున్నారు. ఏం? కాదంటావా?

గౌరి:—ఎదురుగా నువ్వు కనిపిస్తూవుంటే యెలా కాదంటాను?

మారు:—కాబట్టి మీ నాన్నను బతికిన నాలుగు రోజులూ మంచిదారిని నడవమని చెప్పు. అమాయకులకు డబ్బు ఎర చూపించి వాళ్ళ సంసారాలను నాశనం చెయ్యొద్దని చెప్పు. బలవంతపు చావును కోరుకోవద్దని చెప్పు.

గౌరి:—(కోపంతో) బావా!

మారు:—ఏం? వినలేకపోతున్నావా?—మరేమీ భయంలేదు. నేను చెప్పిన ప్రతి మాటా మీ నాన్నతో చెప్పు. నిన్నేమైనా అంటే నే నున్నానుగా!

గౌరి:—నేనేం రాయబారాని కొచ్చాననుకొన్నావా?

మారు:—మరెందుకు వచ్చావు? రోజూ ఎందుకు వస్తున్నావు? ఎవ్వరూ రాలేని గాలిగోపురంలోకి కూడా నువ్వు వస్తున్నావు. అక్కడ కూడా నన్ను హాయిగా, ప్రశాంతంగా కూర్చోనివ్వడంలేదు.

గౌరి:—నేను దగ్గరవుంటే నీకు హాయిగా వుండదా?

మారు:—నిజం చెప్పమంటావా?

గౌరి:—చెప్పు. నీ మనసులోవున్న విషయం దాచకుండా చెప్పు.

మారు:—(ఒక్కసారిగా) నిన్ను చూస్తూవుంటే ఆవేశంతో కోపంతో వెర్రెత్తుతోంది. తెలిసిందా?

గౌరి:—ఓహో! అలాగేం? (పూల సజ్జలోంచి అరటిపండు తీసి) కొంచెం ఆవేశం తగ్గించుకో! యిదిగో ప్రసాదం.

మారు:—(ఆమె చేతిలోని అరటిపండు కోపంతో తీసుకొని అరుగుమీద కూర్చుని తింటూ వుంటాడు.)

గౌరి:—(అతని ప్రక్కని కూర్చుని) నా మీద నీ కెందుకంత కోపం బావా? నేనేం తప్పు చేశాను?

మారు:—అచ్చన్నకు కూతురునై పుట్టడమే నీ అపరాధం.

గౌరి:—(మరొక అరటిపండు తీసియిస్తూ) జరిగిపోయిన రోజుల్ని మరిచిపోలేవా?

మారు:—(అమాంతంగా లేచి నిలబడి) నువ్వు మర్యాదగా వెళ్ళిపోవాలి.

గౌరి:—నే నెలాగూ వెళ్ళిపోతున్నాను. యిక నీకు యీ మాత్రం సలహా యిచ్చేవాళ్ళు కూడా వుండరు. నామాట విను. పగతో నువ్వేమీ సాధించలేవు.

మారు:—మరి దేనితో సాధించమంటావు?

గౌరి:—మంచితనంతో, అభిమానంతో, ప్రేమతో....

మారు:—(హేళనగా) ప్రేమ! ఎవరిమీద చూపించమంటావు? నీ మీదా?

గౌరి:—మంచి మాటలు నీకు అర్థంకావా?

మారు:—ఎంతమాత్రం కావు. మంచితనం నా సమీపానికి రాలేదు. నేను చెడ్డకు బలై పోయాను. చెడుతోనే బతుకుతున్నాను. యిక ముందు కూడా చెడునే ప్రాణస్నేహితుడిలా కౌగలించుకుంటాను. నా హృదయంలో ప్రేమకీ, అనురాగానికీ సూది మొనంతయినా చోటు లేదు. యిక నా జోలికి రాకు. నీతి బోధ చేయకు. వెళ్ళిపో!

గౌరి:—(తీవ్రంగా) నేను వెళ్ళను.

మారు:—ఓహో! కొత్తగావుందే! యీ మొండితనం ఎక్కడ నేర్చుకున్నావు?

గౌరి:—నీ దగ్గరే!

మారు:—నన్ను విసిగించకు. (పైకి చూస్తూ) అదుగో! నా పావురం. ఎగిరిపోతోంది. అది లేకుండా ఒక క్షణమైనా నే నుండలేను. (గౌరిని చెయ్యి పట్టుకొని లాగుతూ) నాతో రా! నిన్ను మీ యింటిదగ్గర విడిచిపెట్టి నేను పావురంకోసం పోవాలి. (బలవంతంగా లాగుతూ) ఊం! రావేం?

గౌరి:—(విడిపించుకుంటూ), నేను రాను. విడిచిపెట్టు.

మారు:—మాట్లాడకు. (లాక్కు వెళుతూ వుంటాడు.)

గౌరి:—వద్దు బావా! నా మాట విను! నువ్వు మా యింటికి వస్తే నిన్ను మా నాన్న చంపేస్తాడు.

మారు:—(బిగ్గరగా నవ్వి) నన్నా? మీ నాన్నా?—(తీవ్రంగా) అంతకంటే నాకు కావలిసిందేముంది. (బలవంతంగా ఎడమ వైపు యీడ్చుకు వెళుతూ వుంటాడు.)

గౌరి:—(విడిపించుకుంటూ) వద్దు బావా! వద్దు—నారాయణ మావా!

(పెనుగులాడుతుంది.—చంద్రయ్య అకస్మికంగా కుడి చివర కనిపిస్తాడు. వయస్సు 45 సంవత్సరాలు. తల పాగా, పంచెకట్టు. చేతిలో కర్ర)

చంద్రయ్య:—(బిగ్గరగా) మారుతీ! (మారుతి ఎడమ చివర ఆగిపోతాడు) ఆమెను విడిచిపెట్టు. (గౌరి చెయ్యి విడిచి పెడతాడు) నీ కోపం నీ ప్రతాపం ఆడపిల్లమీదా చూపిస్తావు? (మారుతిని సమీపించి) నీకింకా బుద్ధి రాలేదంరా?

మారు:—యిది ఆడపిల్ల కాదు.........

చంద్ర:—యేం? కళ్ళు నెత్తికొచ్చాయా?

మారు:—.........పులిపిల్ల!

చంద్ర:—తండ్రిమీదవున్న కోపం అమాయకురాలైన కూతురు మీదటా చూపిస్తావు?

మారు:—మావా! నువ్విందులో కలగచేసుకోకు.

చంద్ర:—నేను కాకపోతే యింకెవళ్ళురా కలగచేసుకుంటారు? నీ తండ్రి బలం, ఓపికా పోగొట్టుకొని—మతిలేక—

మూలకు చేరాడు. తల్లా లేదు. నీ కిక అదుపూ ఆజ్ఞ లేదు. నువ్వు ఆడింది ఆటా! పాడింది పాటా! సూర్యుడు ఉదయిస్తే భయం. యిక నువ్వు తీసుకువచ్చే తగాయిదాలకు అంతూ దరీ వుండదు. రోజూ ఎవరినో కొట్టడం. గాలిగోపురంలోకి పారిపోవడం. నువ్వు తెచ్చే పేచీలు వినలేక చచ్చిపోతున్నాను—అబ్బబ్బా! ప్రాణం విసిగిపోతోంది. (గౌరిని చూపిస్తూ) ఆ పిల్లను చూస్తే నీకు జాలి వెయ్యడం లేదట్రా? నీ తల్లి బతికివున్న రోజుల్లో—మన సంసారం పచ్చగావున్న రోజుల్లో ఆ పిల్లను నీ కిచ్చి పెళ్ళి చెయ్యాలనుకునే వారు. ఒక్కసారిగా వ్యవహారాలన్నీ తలక్రిందులై పోయాయి. దరిద్రంతోపాటు—దుర్గుణాలన్నీ వచ్చాయి నీకు. నీకు యిక పిల్లనిచ్చి పెళ్ళిచేసే వెర్రి వాడెవడూ ఈ ప్రపంచంలో వుండడు. యిప్పటికైనా కళ్ళు తెరిచి వళ్ళు వంచి పొలం దున్నుకొని బతుకు. లేదా ఎవరిజోలికీ పోకుండా ఒక మూల కూర్చో!

మారు:—(తీవ్రంగా) మావా! నీ ధర్మబోధ వినేరోజులు యింకా రాలేదు. వచ్చినప్పుడు వింటాను.

నేపథ్యంలో:—(బిగ్గరగా) పట్టుకో! పట్టుకో!

మారు:—(కుడివైపు చూస్తూ కోపంతో) నా పావురం జోలికి పోతున్న వాడెవడూ? ఆగు! (కుడివైపు తొందరగా వెళ్ళి పోతాడు.)

చంద్ర:—(నిస్పృహతో) లాభంలేదు. యిక వాణ్ణి మంచి దారిలో పెట్టడం మానవ మాత్రుడి తరం కాదు. (కుడివైపు ఆత్రుతతో చూస్తూవున్న గౌరితో) యిక వెళ్ళిపో అమ్మా! వాడు చెడ్డవాడని తెలిసి కూడా వాడితో ఎందుకమ్మా మాట్లాడతావు?

గౌరి:—ఊహుఁ! బావ చెడ్డవాడు కాదు.

చంద్ర:—ఇంత కాలానికి ఆ మాట నువ్వు ఒక్కతెవు అన్నావు.

కొండయ్య:—(నేపథ్యంలో) వెధవకి—రోజు రోజుకీ పొగరెక్కువై పోతంది.

చంద్ర:—(ఎడమవైపు చూస్తూ) మీ వాళ్లెవరో వస్తున్నా రమ్మా! వెళ్ళిపో! యిక్కడ నువ్వు వుంటే బాగా వుండదు.

(గౌరి ఒక అడుగు ముందుకు వేస్తుంది. ఎడమవైపు నుంచి మాట్లాడుకుంటూ అచ్చన్న ఆమెకు ఎదురు వస్తాడు. గ్లాస్కోపంచె, సిల్కు లాల్చీ, సేలం కండువా, వేళ్ళకు ఉంగరాలు, బొద్దుమీసం—బాగా డబ్బున్నవాడిలా కనిపిస్తాడు. వయస్సు 40 సంవత్సరాలు. అతని వెనక కొండయ్య, పుల్లయ్య వస్తారు.)

అచ్చన్న:—(వస్తూనే) ఎక్కడున్నాడ్రా వాడు? (గౌరినిచూసి ఆకస్మికంగా) యిదేమిటమ్మా నువ్విక్కడున్నావు?

గౌరి:—గుడికి వెళ్ళొస్తున్నాను నాన్నా!

కొండయ్య:—(వ్యంగ్యంగా) గుళ్ళోకా? పూలతోటలోకా?

గౌరి:—(కొండయ్యకేసి చుర చురా చూస్తూ) కోతిలా మొహం నువ్వూనూ!

పుల్ల:—ఇహిహి! (నవ్వుతాడు)

కొండ:—(పుల్లయ్యను వీపుమీద ఒక్కటివేసి—నెమ్మదిగా) నోర్ముయ్!

అచ్చ:—(ఇదేమీ గమనించకుండా గౌరితో) యింటిలో పెళ్ళివారున్నప్పుడు నువ్విలా తిరక్కూడదు. వెళ్ళు. (గౌరి వెళ్ళిపోతుంది.) చంద్రయ్యా! నీ బాకీ మాట యేం చెప్పావు?

చంద్ర:—ఏం చెప్పడానికేముంది? యింకా పంట రాలేదుగా!

అచ్చ:—పంట వచ్చేవరకూ నన్ను కూర్చోమంటావా?

చంద్ర:—యింకెంత? రెండు నెలలు పోతే పంటవస్తుంది. అప్పుడు నేనే స్వయంగా నీ దగ్గరకు వచ్చి....

అచ్చ:—అదేం పనికిరాదు. నేను దయతలచినకొద్దీ మీరు నెత్తికెక్కుతున్నారు.

చంద్ర:—అచ్చన్న తమ్ముడూ! పుట్టి పుణ్యానికి నా మీద కోప పడుతున్నావు. నీ మనసులో యేమైనా వుంటే చెప్పు.

అచ్చ:—మీరు డబ్బు యివ్వడంలేదు. సరికదా! పై వాళ్ళను కూడా అప్పు తీర్చకుండా చేస్తున్నారు.

చంద్ర:—పొరపాటు పడుతున్నావు.

అచ్చ:—నేనా పొరబాటు పడుతున్నది?—నా దగ్గర వంద రూపాయలు అప్పు పుచ్చుకొని పరారీ అయిపోయిన వీరయ్యని మీ యింట్లో దాచలేదూ?

చంద్ర:—నేను యిప్పుడే పొలంనుంచి వస్తున్నాను. నా కదేమీ తెలియదు.

అచ్చ:—పైగా నా మనుష్యులు వెతకడానికివస్తే వాళ్ళని పట్టుకొని కొడతాడా?

చంద్ర:—ఎవరు కొట్టారు?

అచ్చ:—యింకెవరు? నీ మేనల్లుడు!—మేం దయతలచి పూరుకునేకొద్దీ వాడు చెలరేగుతున్నాడు. (కొండయ్య, పుల్లయ్యల కేసి తిరిగి తీక్ష్ణంగా) ఇంకా చూస్తారేం? వాణ్ణి యింట్లోంచి యివతలకీడ్చి తన్నండి.

(ముగ్గురూ ఆవేశంతో—గుమ్మంవైపు నడుస్తారు.)

చంద్ర:—(అడ్డువచ్చి) ఆగండి. తొందరపడకండి. వాడులేడు యింట్లో? యిప్పుడే పైకి పోయాడు.

అచ్చ:—వాడు లేకపోతే వీరయ్య వుంటాడు. వెళ్ళండ్రా! లోపలికి వెళ్ళండి. యిల్లంతా వెతికి—వాణ్ణి జుట్టు పట్టుకొని యీడ్చుకు రండి.

(కొండయ్య, పుల్లయ్య తలుపులు తెరుచుకొని ఇంట్లోకి వెళ్ళిపోతారు.)

చంద్ర:—(బాధగా) యిదేమైనా మర్యాదయిన పనేనా? అచ్చన్నా!

అచ్చ:—మర్యాద! నా మర్యాద మీరు నిలబెట్టనప్పుడు మీ మర్యాద కోసం నే నెందుకు ఆలోచించాలి?

(నారాయణ యింట్లోంచి ఆకస్మికంగా యువతలకు దూకుతాడు.)

నారాయణ—:(బిగ్గరగా) కుక్కలు! యింట్లో కుక్కలు చొరబడిపోయాయిరాచంద్రయ్యా! (అచ్చన్నను చూసి) ఓహో కుక్కల యజమాని కూడా వచ్చాడే! వాటి కంత రోషం ఎలా వచ్చిందా? అనుకుంటున్నాను. అదా సంగతి! ఒరే అచ్చన్నా! పేదరైతుల కూడుతో నీ కుక్కల్ని మేపేస్తున్నావురా! మేస్తేస్తున్నావు! వాటికి పొగరెక్కి పోయిందిరా!

అచ్చ:—(కోపంతో – ఒక అడుగు ముందుకువేసి) నోర్ముయ్!

నారా:—(బిగ్గరగా నవ్వుతూ) హహ్హహ్హా! యేమిరా నీ అహంకారం!! (యింట్లోకి వెళ్ళిపోతాడు.)

అచ్చ:—మతి స్థిరంలేదు కదా అని ఆలోచిస్తూ వుంటే.....

(కొండయ్య, పుల్లయ్య - యింట్లోంచి యువతలికి వస్తారు)

అచ్చ:—ఏడిరా వాడు?

కొండ:—పైకి దాటించేశారు. యింకెక్కడున్నాడు?

పుల్లి:—ఆ ఈరయ్యగాడు జిత్తులమారి యెదవండి.

అచ్చ:—మంచిగా ఆలోచిస్తూ వుంటే ఒక్కొక్కరికీ కొమ్ములు మొలుస్తున్నాయ్! (చంద్రయ్యకేసి తిరిగి) చంద్రయ్యా! చూశావా? మీ మూలాన్ని యివేళ నాకు రావలసిన సొమ్ము రాకుండాపోయింది. మీరా యివ్వరు. యిచ్చేవాళ్ళనీ యివ్వనివ్వరు. యిక కనికరిస్తే లాభంలేదు. చంద్రయ్యా! మారు మాట్లాడకుండా నువ్వు యివ్వవలసిన డబ్బంతా యిక్కడ పెట్టు.

చంద్ర:—కోపం వచ్చినంత తేలిగ్గా డబ్బు వస్తుందా చేతికి?

అచ్చ:—అదేమీ పనికిరాదు.

పుల్లి:—బాబుగారికి కోపమొస్తే అంతే!

కొండ:—పోనీ కొంతైనా చెల్లు పెట్టవయ్యా!

చంద్ర:—నా దగ్గర డబ్బువుంటే మిమ్మల్ని ఇంతసేపు మాట్లాడనిచ్చేవాడినా? డబ్బేవుంటే మీరు నా యింట్లో చొరబడి నా పరువు తీసేస్తూవుంటే చూస్తూ వూరుకొనే వాణ్ణా?

కొండ:—పోనీ వడ్డీ డబ్బులైనా కట్టెయ్. అసలు మాట తరవాత చూసుకుందాం.

చంద్ర:—వడ్డీ ఎంత?

పుల్లి:—యిరవై రూపాయలని గుమాస్తాగారు సెప్పేరండి.

చంద్ర:—(నిస్పృహతో) ఇరవై రూపాయలా? నా దగ్గర యిరవై పైసలు కూడా లేవు.

అచ్చ:—(కోపంతో) అలా మర్యాదగా అడిగితే యిస్తాడా? చూస్తారేం? యింటిలో యేం వుంటే అది పట్టుకురండి. (కొండయ్య, పుల్లయ్య వెంటనే యింటిలో చొరబడతారు. లోపలి బిందెలు, గిన్నెలు విసురుతున్న చప్పుడు వినిపిస్తుంది. చంద్రయ్య నిశ్చేష్టుడై నిలబడతాడు. పుల్లయ్య నెత్తిమీద ఒక క్రరపెట్టెతో లోపలినుంచి వస్తాడు. కొండయ్య ఒక బిందె పట్టుకొని వస్తాడు.)

అచ్చ:—(ఇద్దరు అనుచరులతో) పదండ్రా పదండి! (చంద్రయ్యకేసి తిరిగి) చంద్రయ్యా! ఏ వస్తువులకేం భయం లేదు. మా యింట్లో భద్రంగా వుంటాయి. నువ్వు డబ్బు కట్టి తీసుకుపోవచ్చు.

(ముందు పుల్లయ్య అతని వెనక కొండయ్య, అచ్చన్న ఎడమవైపు నడుస్తూ వుంటారు. ఆకస్మికంగా యింట్లో నుంచి నారాయణ ప్రవేశిస్తాడు. ఒకచేత్తో కుండ, ఒక చేత్తో క్రర పట్టుకొని ముందుకు వస్తాడు.)

నారా:—(బిగ్గరగా) అచ్చన్నా!

అచ్చన్న:—(ఆగి వెనక్కి తిరిగి చూస్తాడు.)

నారా:—(పరుగెత్తి అచ్చన్నను సమీపించి)యిదిగో కుండ! యిదిగో క్రర! యీ రెండూ కూడా పట్టుకు పో. చివరికాలంలో యివే నీకు పనికివస్తాయి—ఊం! పుచ్చుకో! పట్టుకుపో!

అచ్చ:—(ఆవేశంతో నారాయణ చేతిలోని క్రర లాక్కొని బలం కొద్దీ పైకెత్తి కొడతాడు. నారాయణ కుండ అడ్డు పెడతాడు. దెబ్బకు కుండ ముక్కలై పోతుంది. చంద్రయ్య ఆత్రుతతో మధ్యకు వస్తాడు.) నాతోనా నీకు సరసం! జాగర్త! నడవండిరా నడవండి.

(ముగ్గురూ ఎడమవైపు నిష్క్రమిస్తారు.)

నారా:—(కోపంతో) తొందర పడకురా అచ్చన్నా! ఏనాటికైనా నీకు యీ రెండూ తప్పవురా!

చంద్ర:—(నిస్పృహతో) హారి భగవంతుడా!

నారా:—(బిగ్గరగా) మారుతీ! మారుతీ! (గడ్డిలో వెతికిచూసి) అయ్యోయ్యో! ఎక్కడికి పోయావురా? ఏమై పోయావురా!

చంద్ర:—(చిరాగ్గా) వాడు యేమీ అయిపోలేదు. కులాసాగా, రాయిలా వున్నాడు. పావురం వెనక పరుగెత్తుకుపోయాడు. నువ్వు యిక లోపలికి......

నారా:—ఎందుకు పోనిచ్చావు? వాణ్ణి దొంగలు ఎత్తుకుపోతే నువ్వేం చెయ్యగలవు? (బిగ్గరగా) మారుతీ!

నేపథ్యంలో:—(దూరాన్నుంచి) హో.........హోయ్......

నారా:—ఆడుగో! (కుడివైపు నడుస్తూ వుంటాడు.)

చంద్ర:—వద్దు. వద్దు. నువ్వు పైకి వెళ్ళకు.

(వినిపించుకోకుండా నారాయణ కుడివైపు పారిపోతాడు)

మారుతి:—(నేపథ్యంలో) వదిలెయ్ నాన్నా! నన్నొదిలెయ్! వాణ్ణే పట్టుకోవాలి.

నారా:—(నేపథ్యంలో) గుడ్లగూబనా పట్టుకుంటావు? వద్దు. వద్దు. అందమైన గువ్వపిట్టను పట్టుకో!

(చంద్రయ్య కుడివైపు చూస్తూ, ఒక నిట్టూర్పు విడిచి యింట్లోకి వెళ్ళిపోతాడు. నారాయణ తన రెండు

చేతులతోను మారుతిని కౌగలించుకొని—బలవంతంగా ఈడ్చుకు వస్తాడు)

నారా:—(గడ్డిమీద కూర్చోబెట్టి) హాయిగా పడుకో! (మారుతి పడుకుంటాడు). కదలకు. లేవకు. లేచి పైకి వెళ్ళకు. నిన్ను చూస్తే లోకం కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుంది. (గడ్డితో మారుతిని కప్పుతాడు.) యీ సారి నువ్వు ఎవరికీ కనిపించవు. అలాగే పడుకో!

(నారాయణ యింట్లోకి వెళ్ళిపోతూ వుంటాడు. కుడి వైపునుంచి బసవయ్య కేకలు వేస్తూ ప్రవేశిస్తాడు. చొక్కా, మోకాళ్ళవరకూ పంచెకట్టు, తలపాగా—వయస్సు రమారమి 50 సంవత్సరాలు. చేతిలో బుట్ట వుంది.)

బసవయ్య:—(ప్రవేశిస్తూ బిగ్గరగా) యిదేమన్నా అడివా? వూరా?—నారాయణా!

నారా:—(అమాంతంగా వెనక్కి తిరిగి) ఎవ్రడా అది?

బస:—ఏడీ? మీ మారుతి యేడీ?

నారా:—కనిపించడు. వాడు యిక యీ పాడు ప్రపంచానికి—చస్తే కనిపించడు. (లోపలికి వెళ్ళిపోబోతాడు.)

బస:—ఏమి టేమిటీ? కనపడ్డూ? ఎందుకు కనపడ్డు నేను చూస్తాను—యిది మీ కేమన్నా న్యాయంగా వుందటయ్యా!

నారా:—(ఆగి) ఇంకా న్యాయం ఎక్కడుందిరా వెర్రినాయనా? న్యాయాన్ని పట్టుకొని, కాళ్ళూ చేతులూ విరిచికట్టి మురాల పారేశారు.

(లోపలికి అడుగు వేస్తాడు)

బస:—(కోపంతో) నారాయణా!

నారా:—(ఆగి) యమ కింకరుడి లా పట్టు కున్నావురా!

బస:—నీ కొడుకుని నువ్వు జాగర్త పెట్టుకుంటావా సరేసరి.....

నారా:—జాగర్త పెట్టుకున్నాం. యిక వెళ్ళు.

బస:—(కోపంతో రెచ్చిపోతూ) ఏం జాగర్త పెట్టేవయ్యా! నువ్వు?—రాత్రి మా కుర్రాడి చెయ్యి విరగ్గొట్టేశాడు. పైగా........

నారా:—(బిగ్గరగా నవ్వి) మహ మంచి పని చేశాడు! (లోపలికి వెళ్ళి పోతాడు.)

బస:—మంచి పని చేశాడా? ఏమి టేమిటీ? (చంద్రయ్య లోపలి నుంచి వస్తాడు) చూశావటయ్యా! చంద్రయ్యా! యిదేమైనా బాగుందా మీకు?

చంద్రయ్య:—ఏం జరిగింది?

బస:—మీ మారుతి మా కుర్రాడి చెయ్యి విరగ్గొట్టి పారిపోయాడు. రాత్రి తెల్లవార్లూ మాకు నిద్రా నిప్పులూ లేవు. ఒకటే గోల! మేం యిక యీ వూరు వదిలి పెట్టయినా పోవాలి. లేదా మీవాడి అంతైనా తేల్చెయ్యాలి.

చంద్ర:—(ప్రాధేయ పూర్వకంగా) తొందరపడకు బసవయ్యా!

బస:—నీ ముఖంచూసి మేం ఆలోచిస్తున్నాం. యింక లాభం లేదు. అచ్చన్నరైతు మీ వాణ్ణి యీవూరినుంచి తరిమెయ్యాలంటున్నాడు. నేను యిన్నాళ్ళనుంచీ ఆయనకి నచ్చ చెబుతున్నాను. ఇప్పుడు నా కొంపకే యెసరు పెట్టేడు. ఇంక నే నెలాగ వూరుకుంటాను?

చంద్ర:—వాణ్ణి యేం చెయ్యాలో నాకు తోచడంలేదు.

బస:—ఆ సంగతేదో మాకు వదిలెయ్యవయ్యా! మూర్ఖోజుల్లో వంచేస్తాం. నువ్వు మీ యింట్లోంచి యివతలకు గెంటెయ్! మిగిలిన పని మేం చూసుకుంటాం.

చంద్ర:—(నిస్పృహతో) ఇక నేను వాణ్ణేమీ చెయ్యలేను. నాలో ఓపికా, సహనం పోయాయి. ఇక మీ యిష్టం! మీరేం చేసుకున్నాసరే! (లోపలికి వెళ్ళిపోతాడు.)

బస:—(కోపంతో) నువ్వేం చెయ్యలేవూ?—అంతా తోడుదొంగలు!) (మారుతి నెమ్మదిగా లేచి బసవయ్య వెనక్కి వస్తాడు. బసవయ్య చూడడు) గూడు పుఠాణీ! తొందరపడకోయ్ చంద్రయ్యా! మేనల్లుణ్ణి పందెం కోడిపుంజులా మేపి వూరిమీద వదిలేద్దామనుకుంటున్నావా? ఈ దెబ్బతో ఆ మారుతిగాడిపని..........

(వెనక్కి తిరిగి మారుతిని చూసి భయంతో ఆగిపోతాడు)

మారు:—(సమీపిస్తూ) ఏం బసవయ్యా! రంకెలేస్తున్నావ్?

బస:—నేను రంకె లేస్తున్నానా? నువ్వు చేసిన పనేమన్నా బాగుందా? మా కుర్రాణ్ణి కొట్టేస్తావా? అడు నీన్నేం చేసేడని?

మారు:—(నిర్లక్ష్యంగా) అది ఆటల్లో అరటిపండు. దాని మాటకేంలే! నీ బుట్టలో యేమైనావుంటే యివతల పారెయ్! ఆకలేస్తోంది.

బస:—ఓహో! యవ్వారం ముదురుతోందే! (వెనక్కి అడుగు వేస్తాడు.)

మారు:—(ముందుకు అడుగువేసి) ఏది? యిలా అందుకో?

బస:—నీ కేమన్నా మతుందా లేదా? యిదిచ్చెయ్ మంటావేమిటి? అచ్చన్న గారింటికి.......

మారు:—ఓహో! యిది అచ్చన్న కోసమా! అయితే యింకా మంచిది. అచ్చన్న యింటిలోవున్న ప్రతివస్తువుమీదా మనకు హక్కు వుంది.

బస:—నీకు హక్కుందా?

మారు:—అవును. ఎందుకంటావా?—వాడు తినే తిండీ—కట్టే బట్టా— అంతా మన సొత్తేగా! యేది! మొహమాట పడకు! అందుకో! నేను తీసుకున్నానని చెప్పు.

బస:—(వెనక్కి జరుగుతూ) అరెరే! దూరంగా వుండు. యీ మిఠాయి పెళ్ళివారి కోసం!

మారు:—మిఠాయా? యింకా చెప్పావుకాదేం?

(అమాంతంగా అతని చేతిలోని బుట్ట లాక్కుంటాడు.)

బస:—(సమీపిస్తూ) బాబ్బాబు! నా మాట విను. యిది నీకూ మంచిదికాదు. నాకూ మంచిది కాదు.

మారు:—మరేం ఫరవాలేదు. భయపడకు. (మిఠాయివుండ తింటూ) చాలా బాగుంది. నువ్వు కూడా ఒకటి తిను. (యివ్వబోతాడు.)

బస:—యింక బుట్ట యిచ్చెయ్‌రా బాబూ!—ఆ ఒక్క ఉండ కోసం నేనేదో సర్ది చెప్పుకుంటాను.

మారు:—(దూరంగా జరిగి) ఉష్! ఆగు!

(ఎడమ వైపునుంచి అమాంతంగా రత్తయ్య ప్రవేశిస్తాడు.)

రత్తయ్య:—(వస్తూనే) ఒరేయ్! ఒరేయ్! నాకు పెట్టకుండా తినేస్తున్నావంట్రా? (మారుతి చేతిలోని మిఠాయి తీసుకుంటాడు. మారుతి బుట్టలోంచి మరొకటి తీస్తాడు.)

బస:—ఒరే! ఒరే! మీ యిల్లు బంగారంగాను. గుడ్డెద్దు చేలో పడ్డట్టు అలా తినేస్తున్నారేమిట్రా! (బిగ్గరగా) ఓ చంద్రయ్యా! రావయ్యా! కొంపలు మునిగిపోతున్నై.

చంద్రయ్య:—(ఆకస్మికంగా ప్రవేశించి) మారుతీ! (మారుతి, రత్తయ్య తినడం మాని అటు చూస్తారు) మీరు మనుషులా? పశువులా? (వాళ్ళ చేతుల్లోంచి బుట్ట లాక్కొని బసవయ్యకు యిచ్చి మారుతికేసి తిరిగి) పరాయివాళ్ళ సొత్తును ఆశించకూడదు. దాన్ని విషంలా చూడాలి.

మారు:—(తక్కువ స్థాయిలో బాధగా) నిజమే! పరాయివాళ్ళ సొత్తు మనం విషంలా చూస్తున్నాం. కానీ పరాయి వాడు మాత్రం మన సొత్తును అమృతంలా వాడుకుంటు న్నాడు.

బస:—(బుట్టలోకి చూసి) చూశావా! చూశావా! చంద్రయ్యా! ఎన్ని తినేశారో! పెళ్ళివాళ్ళకోసమని లచ్చన్నరైతు ఈ మిఠాయి తయారు చేయించాడు.—మాకుర్రోడి చెయ్యా విరగొట్టేశాడు. ఇప్పుడు లచ్చన్న రైతుతో తగాదా తెచ్చాడు.

(ఎడమవైపు వెళ్ళిపోతాడు.)

రత్త:—(భయంతో) ఓరి బాబోయ్! యిది లచ్చన్నగారి మిఠాయా?

(గొంతు పట్టుకుంటాడు.)

చంద్ర:—రోజు రోజుకూ నా ప్రాణం విసిగిపోతోంది. యిక నేను భరించలేను. యింటిచుట్టూ అప్పులవాళ్ళు. నువ్వు తెచ్చే పేచీలకు అంతూ పొంతూ లేదు. నీకు వయస్సుతో పాటు దరిద్ర దేవత కూడా యింట్లోకి వచ్చింది. యిల్లంతా గుల్ల అయిపోయింది. (లోపలికి అడుగువేసి దోసిలితో ఆకులు తీసుకువచ్చి మారుతిముందు వేసి) ఈ ఆకులతో విస్తరి కుట్టుకో! యిక ఈ రోజునుంచీ నీకు భోజనం చెయ్యడానికి గిన్నె కూడా లేదు.

మారు:—(కోపంతో) ఏం? ఏమయ్యింది?

చంద్ర:—ఇంకేమౌతుంది? అప్పులవాళ్ళు పట్టుకుపోయారు. యింటిలోని ప్రతి వస్తువు నా కళ్ళముందే ఖాళీ అయి పోయింది. ఒకా నొకప్పుడు యీ వూరికి నీవే డబ్బు కల వాడివి. నీ ఐశ్వర్యం నిలువునా కరిగిపోయింది. నీ కింకా కళ్ళు మూతలు పడేవున్నాయి.—నీకు భార్య కావలసిన పిల్ల (దూరాన్నుంచి సన్నాయివినిపించి ఆగిపోతుంది) మరొక అదృష్టవంతుడికి యిల్లాలు కాబోతోంది. నీ యింటిలో పెద్దమ్మ తాండవం చేస్తోంది. నీ చుట్టూ అశాంతి, ఏడుపులు, పెడబొబ్బలు—లచ్చన్నమీద పగతో నువ్వు చేస్తున్న ఘాతుకాలు యిన్నీ అన్నీ కావు. కానీ లచ్చన్నను అదృష్టదేవత వరించింది. వాణ్ణి నువ్వు ఏమీ చెయ్యలేవు. వాడి యింట్లో అన్నీ మంగళకార్యాలే...

మారు:—(ఆవేశంతో) కాదు. కాదు. లచ్చన్న యింట్లో శుభం జరగడానికి వీల్లేదు. జరగనివ్వను. (చూరులోంచి కర్ర తీసి) ఎలా జరుగుతుందో నేను చూస్తాను.

(ఎడమవైపు చరచరా వెళ్ళిపోతాడు. అతని వెనక రత్తయ్య వెళ్ళిపోతాడు.)

చంద్ర:—(బిగ్గరగా) మారుతీ!

(ఎడమ చివర వరకూ వెళ్ళి విస్తుపోతూ ఆగిపోతాడు.)

[తెర]

(సశేషం)

# ఆధునికచరిత్ర కావ్యములు: ఒక పరామర్శ

శ్రీ వి. రామకృష్ణారావు

ఆధునికభావపరామృష్టములైన కావ్యములలో చారిత్రక కావ్యము లొక వర్గమునకు చెందినవి. అధునిక యుగమున వెలువడిన బృహచ్చారిత్రకకావ్యములలో శ్రీ రాజశేఖర శతావధానిగారి రాణా ప్రతాపసింహ చరిత్ర మొట్టమొదటిది. ఈయన చండప్రచరిత్ర దీనికి పూర్వము వ్రాసినట్లు పీఠికలో చెప్పుకొన్నారు. అమరసింహ రాణా చరిత్రము కూడ ఈయన రచించినారు. శివ భారతము, ఆంధ్రపురాణము, ఝాన్సీరాణి, ఆంధ్ర ప్రశస్తి, హంపీక్షేత్రము, షాజీ, విశ్వనాథనాయుడు, అశోక చరిత్ర మొదలైన చారిత్రక కావ్యములు అధునిక యుగమున వెలసినవి. ఇంకను లఘు కావ్యములు కొన్ని వచ్చియుండుట సంభావ్యమే.

## రాణా ప్రతాపసింహ చరిత్ర

ఈ కావ్యము 1933 వ సంవత్సరాంతమునకు ప్రథమ ముద్రణ నందినది. కావ్య వస్తువు చారిత్రకమగుట స్పష్టమే. నాయకుడు రాణా ప్రతాపసింహుడని కృతినామమువల్లనే స్పష్టపడుచున్నది. నాయకున కుండవలెనని ఆలంకారికులు వర్ణించిన లక్షణములన్నియు ఈయనయందు మూర్తీభవించియున్నవని చెప్పవచ్చును. నాయక లక్షణములు సాహిత్య దర్పణమున నిట్లు చెప్పబడెను.

శ్లో. త్యాగీ కృతీ కులీనః సుశ్రీకో రూపయౌవనోత్సాహీ
దక్షో ఽనురక్తలోక స్తేజో వైదగ్ధ్య శీలవాన్నేతా
(సా. ద. 3.68)

రాణాప్రతాపసింహుడు సూర్యవంశీయుడు. ఇక కులీనత వేరుగా చెప్పనేల? అతని కార్యసంపాదనసమర్థత దక్షుడనుటకు సరిపడుచున్నది. ఆయన ఎంత అనురక్తలోకుడో ఆయన రాజగుట కేర్పడిన పరిస్థితులవల్లనే తెల్లమగుచున్నది. ప్రజలు "మేమ్మై కోరిన యాతనిన్ విడుచుచున్ మేలంచు నీ వల్ల సుత్రాముం దెచ్చిన శౌరి దెచ్చిన సమాధానంబు మాకుండదు" అనియు, "ఈ ప్రతాపుడే, తప్పక రాజు కావలయు దప్పదు తప్పదు" అనియు పల్కుటచే ఆయన రాజయ్యెను. లేనిచో జగమల్లడను వాడు రాజు కావలసి వచ్చెడిది. ప్రతాపుడు నాయకులలో ధీరోదాత్త భేదమునకు చెందినవాడు.

శ్లో. అవికత్థనః క్షమావా నతిగంభీరో మహాసత్త్వః
స్థేయాన్ని గూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః
కథితః (సా. ద. 3.69)

ఇవి ధీరోదాత్త లక్షణములు. ఈ లక్షణము లన్నియు ప్రతాపునియెడ సార్థకత్వమును భజించుచున్నవనుటకు గ్రంథమంతయు సాక్ష్యము.

ఈ కావ్యమున అంగిరసము వీరము. వీర రస లక్షణ మిదిః

"ఉత్తమ ప్రకృతి ర్వీర ఉత్సాహస్థాయిభావకః
మహేంద్ర దైవతో హేమ వర్ణోయం సముదాహృతః
ప్రతినేతృ తదుత్కర్షాలంబనోద్దీప నాన్వితః
చాతుర్యామంత్రణ స్థైర్య ప్రసాదాద్యనుభావభూః
క్రోధాభిమాన హాస ప్రముఖ వ్యభిచారిభిః పుష్టః
సచ దానధర్మయుద్ధైర్దయయా చ సమన్విత
శ్చతుర్ధాస్యాత్ (సా. ద. 3.263)

వీరరసమునకు స్థాయిభావ ముత్సాహము. ఉత్సాహమనగా, పరుల పరాక్రమ దానాదులను స్మరించుటవలన పుట్టు ఔన్నత్యమను చిత్త వృత్తి విశేషము. "పర పరాక్రమ దానాది స్మృతి జన్మా ఔన్నత్యాఖ్య చిత్తవృత్తి విశేష ఉత్సాహః" అని రసగంగాధరము. ఈ కావ్యమున ప్రతినాయకుడగు అక్బరు చక్రవర్తి ఆలంబన విభావము. ఇతని యుత్కర్ష యుద్దీపన విభావము. చాతుర్యామంత్రణ స్థైర్య ప్రసాదాదు లనుభావములు. ఆమంత్రణమనగా స్నేహితులు మొదలైనవారితో ఆలోచించుట. ప్రతాపసింహుడు సలుంబ్రా కృష్ణసింహుడు మొదలైన వారితో చేసిన మంత్రాంగ మందు కుదాహరణము. క్రోధాభిమాన హాస ప్రముఖములు వ్యభిచారి భావములు. క్రోధమనగా శత్రుకృతాపచారముచే మనస్సు ప్రజ్వలించుట. "శత్రు కృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః" అని ప్రతాపరుద్రీయము. "విభావాను భావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" అను భరత సూత్రానుసారముగా పై చెప్పిన విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగమువలన స్థాయిభావమగు ఉత్సాహము వీరరసమగుచున్నది.

దానధర్మయుద్ధ దయాభేదములచే వీరము నాలుగు విధములు. వీని సంఖ్యను కొందరు పెంచినారు. కాని అంగి రస నిబంధనమునకు ఈ నాలుగే యోగ్యములని చెప్పవచ్చును. ప్రతాపసింహ చరిత్రమున ధర్మవీరమంగిరసము. "కాన విజయంబు ముఖ్యంబుగాదు మనకు, ధర్మ నిర్వహణంబు కర్తవ్య మిపుడు" అని ప్రతాపుడు పలికెను. ఆయన చేసిన పాతికేండ్ల యుద్ధము ధర్మముకొరకు చేయబడినది. ప్రతాపుడు ధర్మవీరుడని "వీయంతటి పరమోత్తమ ధర్మవీరవరుడుండెడునే" అని భామసాహిచే కంఠోక్తముగా చెప్పింపబడినది.

ప్రతాపునిపై దండెత్తుట తన కొలువులోని రాజపుత్రులకు కోపకారణము కావచ్చునని అక్బరు ఖేదోపాయము పన్నినాడు. ఆయన మానసింహునితో ఇట్లనినాడు:

చ. నను గడు బేర్మిమై గనుచు నా ప్రభుతన్ మదిమెచ్చి కన్యనిచ్చిన మిమువంటివారి వెలివేసి ప్రతాపనృపుండు పంక్తి భోజనములకైన నింపుకయు స్పైపక తేలిక చేసి చూచె మీ ఘనతకు హాని వచ్చినను గల్గవె వాకు విషద వేదనల్

అక్బరు రాజనీతికి ఇది యొక మచ్చుతునక. ఇంకను ఈ రాజనీతి యెట్టిదో ప్రతాపసింహ మానసింహులసంధి గూర్చిన చర్చలో తేలును. మానసింహుడు అక్బరు సద్గుణములను ప్రతాపునితో వర్ణించి చెప్పును. ప్రతాపుని వీర ధర్మమువలన లోకమునకు కలుగు కడగండ్లను తెలుపును. ప్రతాపసింహుడు అక్బరు రాజనీతిని వివరించును. అక్బరు హిందువులతో సంబంధము లేర్పరచుకొనుటలోని విగూఢాశయ మిట్లు చెప్పబడినది.

గీ. అల్లుడై బావయై మామయైన తన్ను
వెలితిగన నీక శ్రీ మహావిష్ణువట్లు,
భారతీయులు గొలుతురన్ భావ మెఱిగి
యక్బరిటు చేసె హేతు వన్యంబు గలదె?

అక్బరు చేసిన కొన్ని అకార్యములు ప్రతాపునిచే పేర్కొనబడినవి. "అతఁడమానుష సద్గుణాఢ్యుఁడనుగాని, యవన భూపతుల యోగ్యతముఁడండు" అని అక్బరును గురించి ప్రతాపునిచే సరిగా వెల కట్టించబడినది.

మానసింహుని మాటలు చూచినచో ప్రతాపుడు సంధి చేసికొని, అక్బరునకు సామంతుడగుటయే ధర్మమేమో అనిపించునట్లున్నవి.

"నీ కన్నియల బాదుషా కిచ్చుటయు లేక, జట్టు పన్నేవాడు గట్టుకుండ.......సమత దైవాలు నీకునే సంధిఁ గూర్తు"

"ఉదయపురి నేలుకొనుము చిత్తూరుపురము
బాగుపఱుపంగఁ బట్టు ద్రవ్యంబుఁ దెత్తుఁ
గొదువయునిపించినను మాళ్వ ఘూర్జరములు
తీసికొన వాఞ్ఛ నెత్తిపై మోసి తెత్తు"

"ఈ యేలేటు పాఱఁజొచ్చె నెదురీద నెవండు సమర్థుఁడా"

ఇత్యాదిగా మానసింహుడనును.

ఇందుకు సమాధానముగా ప్రతాపుడు తన వంశమర్యాద, స్వాతంత్ర్యము నిలబెట్టుకొనుకర్తవ్యము గూర్చి వివరించును. అక్బరు తనరాజ్యతృష్ణతో ఇతరుల స్వాతంత్ర్యమును కబళించుట అన్యాయమని ఉద్ఘాటించును. ఈ సందర్భమున ప్రతాపసింహునిచే చిన్న కథ చెప్పించబడినది. పంజరబద్ధమై స్వాతంత్ర్యము పోగొట్టుకొన్న చిలుక అడవిచిలుకకు సమాధానముగా "గాలిలో నెట్లులు తేలుచుంటి, క్రిందబడవె, యేమి తిందు, నీ యడవి నెవ్వరు పోకెదరు, శత్రుభయము లేదె,పంజరమున బోటి త్తు నా పజ్జనుండు" ఇత్యాదిగా అన్నట్లు వ్రాసినారు. ఇది ప్రకృత సందర్భమున కెంతో అమరియున్నది. భారతములో చెప్పినట్లు, "ధర్మువు లట్ల యుండి బో, ధమ లరయంగ వచ్చిన నధర్మములై చెడు గొన్ని ధర్మవర్తనములుగాక లోఁచి తుది ధర్మములై చను గొన్నిఁ కర్మముల్." ధర్మ మెంత సూక్ష్మమయినదో ఈ ప్రతాపసింహ మానసింహులు చేసిన సంధి చర్చలో మనకు తెలియగలదు.

ఈ కావ్యమున సూర్యోదయ సూర్యాస్తమయములు వసంతాది ఋతువులు పరిమితముగా వర్ణింపబడియున్నవి. "మనుపార మెఱుఁగు దీరిన గుజ్జు లేమావి, చిగురాకు బాకుల చికిలి చేసి........పరువపు వసంతుఁడను దొడ్డ తురకరేఁడు.....దళముకొని చిల్కపిండులతో దండు వెడలె" అను వసంత ఋతువర్ణన అక్బరు దండయాత్రను సూచించుచున్నది.

అంతయో యింతయో పూర్వ కవుల ప్రభావముఁ ప్రతి కవిపైనుండుట సహజము. కొన్ని యనుసృతుల నిక్కడ చూపుదును.

1. 'అభ్యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీతలల్ (సభా)
అభ్యుదయాస్తాచలమధ్యగంబయిన సర్వోర్వీతలంబున్ (రాణా ప్ర 1—388)
2. 'మందార ద్రుమ మంజరీ మధు ఝరీ మాధుర్య మాధుర్యావృందర్భా' (శృ. నై.)
'మందార ద్రుమ మంజరీ మధుఝరీ మాధుర్య సంపాదివాక్పందోహంబులరన్.......(రాణా ప్ర. 1—334)
3. 'శిరీష పుష్ప మవధాన పరత్వమునన్ మధువ్రతం, బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా (హర)
'మృదు శిరీష పుష్పమ్ము తుమ్మెదయె వ్రాల నోర్చదు ఖగేశ్వరుఁడు త్రొక్క నోర్వగలదె (2.230)
4. జాదులు వేతురే మంగలంబువన్ (శృ. శా.)
జాదులు వేతురె మంగలంబువన్ (5.368)
5. వరణా ద్వీపవతీ తటాంచలమునన్ (మను)
అమర ద్వీపవతీ తటాంతరమునన్ (2.207)
6. చేదు ప్రింగెదవంచు (మను)
చేదేమి మేసిరి (2.222)
7. అవని నభోంతరం బాప్య రంధ్రముగాఁగ
ఘన పంక్తి మోముపైఁ గప్పుగాఁగ (వసు)
కాంచన శృంగ భాగము కిరీటముగాఁగ
గాశ్మీర మాస్య పంకజముగాఁగ (1—2)
8. యుద్ధమును వివాహముతో పోల్చుచు వ్రాయబడిన రెండు పద్యములు (2.158, 4.25) నరసభూపాలీయములోని

"బలధూత ధూళిచేఁ బందిళ్ళు నమకట్టి" అను పద్యమున కనుస్మృతులు కానగును.

ప్రతాపసింహుడు సైన్యాధిపతులను యుద్ధమునకు ప్రోత్సహించిన సందర్భములో ఇట్లు వ్రాసినారు. "మూటలను గట్టి యాయువు బుఱ్ఱకెత్తి, శాశ్వత బ్రహ్మ కల్పమీ జగతి నుందుమో" "కొండలో మనలోన నందలో మడిసిన, మనతావుచే కొండ్రడు మన తనయులు" ఇత్యాది వాక్యములు 'విక్రమోక్తులు' అని కవిగారు తెల్పిరి. కాని యవి వేదాంతోక్తులు. వీరరసమునకు భయానక శాంతములు విరుద్ధ రసములు. ఇచ్చటి ప్రతాపుని వాక్యములు శాంతరస విభావములుగానే యుండుటచే ప్రతికూల విభావాది గ్రహణమను రసదోష మేర్పడినట్లు చెప్పవలసి యున్నది. చిత్తూరు పాడువడగా విహంగ ధ్వను లిట్లున్నవట.

> గీ. మహిత చిత్తూరు నగర సామ్రాజ్య భవ్య
> వాట కాళ్యంతరమున నీ నాఁటి కకట!
> కట్టకడ తెరవ్రాల మంగళము పాడె
> ననగ ధ్వనిలేవుచుండు విహంగతతులు.

చిత్తూరు సామ్రాజ్యము నాశనమైనందు కొకవంక "అకట" అని సంతాపించుచునే విహంగధ్వనులు మంగళము పాడె ననగ ఉన్నవనుటలో ఔచిత్యములేదు.

"ఇట్టి భస్మమరుఁ డట్టి యుగ్ర విట లాక్షని చెంగట విల్వ నేర్చునే" అన్నారు. భస్మమరుడు ఈశ్వరుడు యుద్ధ మెక్కడ చేసెరో తెలియదు. హల్దీఘాటు యుద్ధమును దక్ష యజ్ఞముతో పోల్చుచు వ్రాయబడిన పద్య మొకటి యిదే సందర్భమున ఉన్నది. "అతుల ప్రతాప బాహా వీర్యభర యశోధనుఁడు తోడర మల్ల దక్షవాహిని" అని చెప్పుటచే ఆ సవనము దక్షునిదే అన్న అభిప్రాయము కవిగారికి కలదు. "ప్రతాప ప్రభుండు ప్రళయ భైరవ విగ్రహ ప్రాభవమున, పరిచమూతతిఁ జొచ్చి చక్కాడెనపుడు" అని ప్రతాపుని భైరవుడన్నారు. దక్షయజ్ఞమును ధ్వంసము చేసినవాడు వీరభద్రుడుగాని భైరవుడు కాదు. ఈ వైరుధ్యము లేర్పడుట వింత.

"శ్రద్ధాభక్తులంగొల్చి భూ,జను లీ భూవవతంసుఁ గొల్వఁడు" కొల్చి, కొల్వఁడు అని రెండుసార్లు ప్రయుక్తము. మనసింహుడు "హిమవత్కుధరశీర్ష మెవరెక్కపైనుండి దూఁకెద" అని అన్నట్లు కలదు. భామాసాహి "పెక్కువేల్ మైళ్ళపైనున్న వింధు నెపుడు" అని అనినట్లు కలదు. ఎవరెష్టు, మైళ్ళ అన్న పదములు ఆ నాటి పాత్రలనోట అనిపించుట ఔచితీదూరము.

ప్రతాపసింహుడు తన అనుచరులతో కర్తవ్యమును ఆలోచించు సందర్భమున అంతవరకు జరిగిన చరిత్ర సంగ్రహముగ అతనిచే చెప్పింపబడినది. కవిగారు అంతటితో తృప్తి చెందక ఆ చరిత్రనంతయు సుమారు 260 పద్యములలో కావ్య ప్రారంభమున విపులముగా వ్రాసినారు. ప్రతాపునితోనే కావ్యారంభముచేసి, అతనికిముందు జరిగిన చరిత్రాంశములను పై సంగ్రహ చరిత్రలోనే గతార్థము చేసియున్నచో బాగుండెడిదని తోచుచున్నది.

## శివభారతము

శివభారతమును రచించినవారు శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారు. ఈ కావ్యము 1943 లో ప్రథమ ముద్రణము నందినది. అనగా రాణాప్రతాపసింహ చరిత్రము తరువాత పదేండ్లకు శివభారతము వచ్చిన దన్నమాట.

శివభారతమునందలి యితివృత్తము శివాజీ చరిత్రము. నాయకుడు శివాజీ. ధర్మవీర మంగిరసము. ప్రతాపసింహ చరిత్ర విమర్శనమున చేయబడిన రసచర్చ మున్నగునవి శివభారతమునకును అన్వయించుకొనవగును. ప్రతినాయకులు బిజాపురమువారు, మొగలులు. వీ రాలంబన విభావము. వీరి యుత్కర్ష యుద్దీపన విభావము. కడమ సమానమే. అంగరసములలో యుద్ధ వీరమును కరుణమును ప్రముఖములుగా నున్నవి.

శివాజీ పన్హాళా గడమునుండి తప్పించుకొని రాంగణా గడము చేరులోపల బిజాపుర సేనలు వెన్నాడిరాగా బాజీ ప్రభువు బిజాపూరు సేన నెదిర్చి శివాజీ రాంగణాగడము చేరుట కవకాశమిచ్చి, తుదకు వీరస్వర్గము నలంకరించును. ఈ బాజీప్రభుని యుద్ధము యుద్ధ వీరమునకు మంచి యుదాహృతి.

"రండు రండోయి యవన శూరవరులార, చెదరి చూచెద రేమి? బాజీ ప్రభుండు, చిక్కినాఁడు గదోయి మీ చేతులందుఁ? దెంపుఁ జూపించి యిపుడ బంధింపరాదె?" ఇత్యాదిగా యవన వీరుల నెదిర్చి వీరాలాపములాడి 'వెడలిరండు మహారాష్ట్ర వీరులార" అని స్వపక్షవీరులను హెచ్చరించిన బాజీ ప్రభువును తలచుకొన్నచో ఉత్సాహము పొంగి పొరలును.

> గీ. పడిన మనవారి ఈ కళేబరము లొకటి
> యొకటి నిచ్చెన మెట్లుగా నూఁది ప్రభువు
> నడుచుచున్నాఁడు రాంగణా గడమునెక్కఁ
> జివరి సోపానమైన వీరవుట తగదొ?
> వెడలి రండు మహారాష్ట్ర వీరులార!
> చేత కరవాలుపట్టి బాజీ ప్రభుండు
> ముందుగా దూకుచున్నాఁడు మునుము వెట్టి
> నఱుకుచున్నాఁడు రిపుకంఠనాళతతులు
> ఇదిగొ యొక్కటి రెండు మూఁడొరిపోయె
> నరుల కంఠము లింకనైఁ దాఱు గడవ
> శివ మహారాజుకోటలోఁ జేరు వార్త
> వచ్చుఁ దడవులే దరిసేన వ్రచ్చుడిపుడ

ఇట్లు సైనికులను ప్రోత్సహించుచు, "నుతిమించిన సొమ్మకు పోలి తెంపు పెంపున మెయికొంచు" బాజీప్రభువు యుద్ధ మొనర్చుచుండగా శివాజీ రాంగణాగడము చేరిన వార్త ఫిరంగి మ్రోతలవలన ఎరుకపడును. అప్పుడు కంఠగత ప్రాణముతో బాజీ ప్రభు విట్లనుచున్నాడు.

> "మన ప్రభుఁడు భారతీయ ధర్మప్రభుండు
> శ్రీ శివ ప్రభుఁడదె కోటఁ జేరినాఁడు"

"వాలు నరాతి మస్తముల వాలునఁ బువ్వుల బంతులాడు నీ
యాలము కోటఁ జేరె నిరపాయగతిన్ మన నాథుఁడింతియే
వాలు.........."

"పతిన యొనర్చినట్టులె శి
వ ప్రభు నెమ్మదిఁ గోటఁజేర్చినా
బ్రతుకు కృతార్థమయ్యె......"

ఈ విధముగా పలికి శివాజీకి సందేశ మిట్లు పంపినాడు.

సీ. తమ యాజ్ఞఁ బుచ్చి దామముహోలె దలఁదాల్చి
యరుల ఖంజించి వేఁటాడె ననుఁడు
కడదాఁక రిపుల నొక్కండైన గనుమలో
నడుగేయ నెడమీయఁ డయ్యెననుఁడు
ప్రణితాంగ కంబులవచ్చి మీ కీ వార్త
యర్పింపఁగా వేఁచడయ్యె ననుఁడు
తమ సేవ చేయు భాగ్యములేమిదప్ప నే
కొరలేక తుదిఁ గన్ను గూర్కెననుఁడు

గీ. స్వామిసేవాకృతార్థ మీ చంద్రహాస
మపయశః కళ్మషముగాని దయ్యెననుఁడు
పూలదండలోఁ దిరుగు పిపీలికయును
శివుని పదమంటె ననుచు హర్షించె ననుఁడు

ఈ పద్యముతో రసపోషణ పరమావధి చెందినది.

లుకజీ హత్యకు షాజీ జీజియాల పరితాపము; షాజీ బాజీ ప్రభు తానాజీల మరణములకు శివాజీ పొందిన విషాదము కరుణ రస ఘట్టములు. ఇష్టులయినవారి నాశనమువలనను అనిష్టము ప్రాప్తించుటవల్లను కరుణరసము జనించును. శోచ్యులగు ఇష్ట జను లాలంబన విభావము. వారి దాహాదికావస్థ లుద్దీపన విభావము. దైవ నిందాదు లనుభావములు. ఈ విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగము వలన స్థాయి భావమగు శోకము కరుణ రసమగును. (సా. ద. 3—252—255 శ్లో). రాణా ప్రతాప సింహ చరిత్రమున సైనికులను ప్రోత్సహించిన ఘట్టము ప్రతాపసింహు డనుచరుల మరణమునకు చింతించిన ఘట్టము వీర కరుణ రసములను పండించునట్లు లేవు. ఈ రెండు విష యములలో శివభారతము ముందంజ వేసినట్లు చెప్పదగి యున్నది.

శివాజీ ధర్మవీరుడుగను, యుద్ధ వీరుడుగను, పితృభక్తి తత్పరుడుగను, రాజనీతివేత్తగను, పరస్త్రీ పరాఙ్ముఖుడుగను కన్పట్టును. జీజియా వీరపత్నిగను అంతకంటె విశేషించి వీర మాతగను గోచరించును. "వీరపత్నినై నెరపిన విందుకంటె, వీరమాత నై హృదయంబు విలుచు కొంటివి" అని ఈ విషయమే షాజీచే చెప్పింపబడినది.

"కాయకయి కొమ్మకు దప్పునె తోలరువ్వుటల్; ఎలికలు వచ్చినే నెగిరియేగుము కూల్చెదవే కులాయమున్; గెలుపోటము లేతము ద్రొక్కుచె లగెన్; వివేక విక్రుతులకున్ క్షణికమ్ములు మోహ మూర్ఛనల్ మొదలైనవి ధ్వన్యుపస్కారకములుగా ఉన్నవి.

లుకజీ హత్యనుగూర్చి విన్న తరువాత జీజియా ఆతనిని హత్య చేసిన నిజామువారిపై భర్తను ప్రోత్సహించి పంపిన ఘట్టము ద్రౌపది అశ్వత్థామపై అర్జునుని ప్రోత్సహించి పంపిన ఘట్టమున కనుసరణమై యున్నది. తానాజీ యుద్ధ మున మరణించినందుకు శోకించుచు సూర్యాజీతో పలికిన వాక్య ములు తిక్కన రచన కనుసృతులు. శివాజీ యిట్లనినాడు.

శా. అన్నా! యున్నను గాచి నీ వయిన దోడై యుండలే వైతివే
కన్నుల్ విచ్చిన కాలరుద్రుఁ బోదువంగా నేర్చిరే వైరులా
పన్నుండై వినుఁజేరెనో నను దలంపన్ బోడా యుట్లేలగున్
మిన్నుల్ గూలిననైన దానొరులనేమీ హాయ మర్థించునే?

ఈ పద్యము సరిగా అభిమన్యుని మరణమును గూర్చి ధర్మజాని అర్జును డడిగిన సందర్భమును పోలియున్నది.

చ. పలువురు నుట్టుముట్టికొని బాణ కృపాణ ముఖాస్త్ర శస్త్రసం
కృతిఁ గడునొంపఁగా దనకుఁ దోడ్పడువారలులేక నన్మదిం
దలఁపడ యుత్తలీక్ రిపువధంబునకెయ్యది తండ్రిమేను కొం
దలమునఁ బొందకుండనని తాణులుమాలును జీరకుండునే?

క. అక్కట! తప్పఁ దలంచితి
నక్కాలఁడుల వాడె కృష్ణు నల్లుఁడు పోరన్
ద్రుక్కునె బాహాగర్వము
దక్కునె నా కొడుకు మిన్ను దలపైఁ బడినన్

"ఆహవ మొక్కఁడే నడిపెనా? కదియుంబడి వెంట మా వశా వ్యూహములేదె?" ఇత్యాది పద్యము "పావని సేరియుండ డాకా" ఇత్యాది పద్యమును బోలియున్నది. మరికొన్ని అను సృతులు చూపెదను.

1. 'ఇప్పుడ కాలుద్రొలికే, గింపెద జక్కనై నిలుము' (ఆది)
జముని చెంగటి కంపెదనిప్డె చక్కనై నిలుము (శివభా)
2. 'ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ' (మను)
ప్రత్యూష పవనముల్ పారాడ (శివభా)
3. 'పిల్లకాకి యెఱుంగునే వింట దెబ్బ' (గిరతము)
పిల్లకాకి మెరుంగునే వింట దెబ్బ (శివభా)
4. 'ఇదె సంవేద్యము (భీమ)
ఇది రాజగడము........ (శివభా)

ఈ కావ్యమున, ఆకుతోభయము—అదవీయసము—అంబేద—కన్నుకొట్టు—కర్కోటకుడు మొదలైన పదములు వాడబడినవి. ఇవి కవిగారి సంస్కృతాంధ్ర పద ప్రయోగ కుశల తకు నిదర్శనములు. కర్కోటకు డనగా కఠినుడని లోక వ్యవ హారము. ఈ యర్థములో రామరాజభూషణుడు మొదట

ఈ పదమును హరిశ్చంద్ర నలోపాఖ్యానమున వాడెను (4—68.) మరల శివ భారత కర్తలు వాడిరి.

హైందవమతాభిమానులగు తురకలను దృష్టాంత ముగాచూపి, పాఠకులకు తురకలపై ద్వేషము కలుగకుండ సందర్భ పరచుట ప్రశంసనీయముగా నున్నది. (6—257, 258.) శివాజీ పట్టాభిషేకమును గూర్చిన శాస్త్ర చర్చ కవి గారి ధర్మశాస్త్ర పరిశీలనకు తార్కాణము.

“ధవళయువతిక సినిమాఁ ప్రదర్శనమున దాండవింపవె వివిధ చిత్రముల వరుస” “వాడున్ సినిమా ప్రదర్శనములై కన్పట్టె నవ్వారికిన్” అని రెండుచోట్ల సినిమాల ప్రసంగము చేయబడినది. ఇవి కావ్యపు ఉదాత్తతను చెడగొట్టుచున్నవి. పురాణ కథా సామ్యములు కొన్ని పని పెట్టుకొని తెచ్చినట్లనిపించుచున్నవి. కొన్ని పోలికలు వెగటుగా నున్నవి. జయసింగు తాను నవాబు పక్షముననే యుండుట ధర్మమని చెప్పుటకు గురు భీష్ములు కౌరవ పక్షమున నుండుట నుదాహరణముగా చూపును. ఇది హృద్యముగానే యున్నది. కాని “అనువు గలదంచు స్వామి కార్యమున కెడము నడువఁ జాల నాధర్మంబు విడువఁజాల” అని అనుట వల్ల గురు భీష్ములు తమ ధర్మమును అనువు గలదని విడిచి పెట్టినట్లు అర్థమగుచున్నది. ఇట్లు పలికిన జయసింగే “వినుము శివరాజ నామాట వెలితిగానియట్లు నీ మేలు కొఱవోని యట్లు నడుతు” అని కూడ అన్నట్లు వ్రాసినారు. “అనువు కలదని స్వామి కార్యమున కెడము నడువజాల నా ధర్మంబు విడువఁజాల” అని చెప్పిన తగు మనిసి “నా మాట వెలితిగానియట్లు నీ మేలు కొఱవోని యట్లు నడుతు” అని యనుట పూర్వోత్తర విరుద్ధ ముగా నున్నది. చారిత్రకాంశములు విడువక పొందుపర్చుచు వ్రాయవలసి యుండుటచే కొన్ని భాగములు నీరసములుగా నుండుట అనివార్యమయినదని చెప్పనగును. రసవద్భాగములను బట్టి నీరస భాగములకు కావ్యత్వము సమ్మతించుట అలం కారిక మార్గమే కాన క్షతి లేదు. “సనుతర్హి ప్రబంధాంతర్వర్తి నాం కేంషాంచి న్నీరసానాం పద్యానాం కావ్యత్వం నస్యాదితి చేన్న. రసవత్పద్యాంతరత నీరసపదానామివ పద్య రసేన ప్రబంధరసే నైవ తేషాం రసవత్తాంగీకారాత్” అని సాహిత్యదర్పణము.

## ఆంధ్ర పురాణము

ఈ కావ్యము శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారిచే రచింపబడినది. ప్రథమ భాగము 1954 లో ముద్రితము. అనగా శివభారతము వెలువడిన రెండు దశాబ్దములకు ఆంధ్రపురాణము వెలువడినది. ద్వితీయ భాగ మింకను ప్రకటింపబడలేదు.

మన పూర్వుల దృష్టిలో పురాణము పంచలక్షణలక్షితము. “సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంతరాణిచ, వంశాను చరితం చేతి పురాణం పంచ లక్షణమ్” అని చెప్పబడెను. వంశాను చరిత్రమే మన ఆధునిక దేశచరిత్ర కాబట్టి పూర్వుల దృష్టిని ఆంధ్ర పురాణములో పురాణ లక్షణ మేకదేశముగ మాత్రమే యున్నది. అయినచో ఆంధ్రపురాణ మనవచ్చునా? అన్నచో అనవచ్చుననియే సమాధానము. పాల్కురికి సోమనాథుని బసవ పురాణములో పురాణ లక్షణము లనబడిన సర్గ ప్రతిసర్గాదు లేవియులేవు. ఆంధ్ర పురాణములో ఏక దేశముగ నయినను పురాణ లక్షణ మున్నది. బసవ పురాణమున అదియును లేదు. కాన 'ఆంధ్ర పురాణము' అను రీతి నామకరణము సంప్రదాయసిద్ధమయినదే అనదగును.

అంశభూతములయిన వర్ణనాదిక సంబంధమైన ప్రతిభ ప్రకటించుటకు మాత్రమే ఈ కావ్యములో అవకాశమున్నది. సమృద్ధిమైన కవితాశక్తి ఉన్ననే ఈ పని సాధ్యపడును. శ్రీ మధునాపంతులవారి ఊహాశక్తి ఈ వైచిత్ర్యము నాశ్ర యించి నవనవోన్మేషముగా నున్నది. తెలుగు పలుకుబడి సౌకుమా ర్యములకు పెక్కు ఉదాహరణములు కనవచ్చును. అప్రయత్న ముగా వచ్చిపడినట్లుండు శబ్దాలంకార స్ఫూర్తి పద్యములు సొగ సుగా నుండుటకు తోడ్పడుచున్నది. ఇత్యాది విషయములు పీఠికలో శ్రీ విశ్వనాథవారు సోదాహరణముగా వివరించియున్నారు.

ఈ ప్రథమభాగములో ఉదయ సాతవాహన చాళుక్య కాకతీయ పర్వములు గలవు. ఉదయ పర్వమునందలి హరిశ్చం ద్రుని నరమేధ వృత్తాంతము ఐతరేయ బ్రాహ్మణములోనిది. ఆంధ్రోదయమునకు ఐతరేయ బ్రాహ్మణములోని కథకు సంబం ధముకలదనుట విశ్వసనీయముకాదు. “బలిసుతుం డాంధ్రు డేలుట వలన దీని, కాంధ్ర దేశమనంగ విఖ్యాతి వెలసె” అను రెండవ పక్షము సరియైనదని చెప్పదగును.

శ్రీ మధునాపంతులవారి రచనలో కానవగు ఒక విశేషము సాభిప్రాయ పదప్రయోగ కుశలత. రుద్రాంబనుగూర్చి, “సింహ పీఠమునఁ గాలిడగా గజయాన కెన్ని గుండెలు గలవో” అని మండ లేశ్వరు లనుకొందరు. సింహపీఠ మనుటచే గజయాన అని వాడ బడినది. “భీమ సింహా నెవ్వఁడీ దొలఁగించివైచి జయపద్మినిఁ బట్టగఁబోదుము” అని అల్లాయుద్దీను పలుకును. జయపద్మిని అనుటలో జయలక్ష్మిని అనియేకాక, భీమరాజు భార్యయగు పద్మినిని పట్టవలెనను అతని కాంక్ష వ్యక్తమగుచున్నది. ఈ చారి త్రక సత్యమును “జయ పద్మిని” అని వ్యజ్యమాన మొనర్చుట ప్రశంసనీయము. “అలము విషాద నీరదము నాపగలేమి కలంగు తెల్గులై, తులకవి దుర్దినంబులుగ దోచె” ఇట దుర్దినమనగా చెడ్డదినము అనియేకాక మేఘచ్ఛన్న దినమను అర్థమును సూచి తము. 'విషాదనీరము' అనుట యీ దృష్టితోనే. “మేఘచ్ఛన్నేహ్ని దుర్దినమ్” అమరము.

పాదుషా కొడుకు ప్రతాపునిపై దండెత్తి వచ్చినపుడు “పఱతెంచెను దోడనే తోఁకచుక్క” అని వ్రాసిరి. తోకచుక్క వచ్చి నప్పుడు మహానాయకుడెవరో మరణించునన్నది జనశ్రుతిలో ఉన్నది. ఈ తోకచుక్క ప్రతాపుని మరణమును సూచించు చున్నది.

“పడుకకేని చెప్పక—వాచవికైత—అంతలు నింతలు— బాహులు మూఁడు—మొకమున ప్రేలు—నిలువెల్ల కన్నుగా—మొద లైన పలుకుబడులు సందర్భోచితముగా పొందుపరుపబడినవి.

శ్లో. మనీషితాః సంతి గృహేషు దేవతా
స్తపః క్వవత్సే క్వచ తావకం వపుః
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీష పుష్పం న పునః పతత్రిణః

ఈ కుమార సంభవమునందలి శ్లోక భావమును వ్యాకరణా భ్యాస సమయమున ఈ క్రింది రీతిని శ్రీ మధునాపంతుల వారు సందర్భ పరచిరి.

చ. మృదు మృదువైన క్రొందళుకు రేకుల పువ్వునఁ జివ్వరెక్కలం
గదవెడి తేఁటి వ్రాలవలెఁగాని జగా మగమోటు పుల్గు బె
ట్టిదముగ నర్గి కాలిడి నటింపఁగ వచ్చునె? మెత్తనౌ కళా
హృదయముమీఁది వ్యాకృతి మహీధర భారము మోపనేర్చునే?

ఈ పద్యమున కళా హృదయపు మృదుత్వమును వ్యాకర ణముయొక్క మహీధర భారమును ద్యోతకముచేయు పదజాల ముపయోగింపబడినది.

ఎట్టి పరిస్థితిలోనున్న పాత్ర కెట్టి యూహలు వచ్చునో యోజించి చెప్పగల శక్తి పరాశ్రయ కవికి కావలెను. భారతాంధ్రీ కరణమున విమగ్నుడయిన నన్నయభట్టునకు గోదావరి నదిని చూడగా "వ్యాస భారత మహిత గాథా పవిత్రపూర శోరణి తలంపు నకు" వచ్చునట. "ఒక వెలివు వాక్కు యానంద ముదయ మందఁ బొడవుగా నన్నివిబుధుఁ డూర్పులను విడుచు"నట.

గుణాఢ్యుడు కావ్యహోమము చేయునప్పుడు ప్రకృతి పైన భూతి చూపినట్లు వ్రాయుట బాగున్నది. "తన చండ శాస నత్వము తగ్గఁదలఁబట్టి, వేవెల్గ పడమటివీథిఁబట్టె" ఇత్యాది పద్యము ప్రతాపరుద్రుఁడు తురకలకు పట్టుపడు సందర్భమునకు తగియున్నది.

యాదవరాజును నరకాసురునితోను తన్ను ధరాదేవితోను రుద్రాంబ పోల్చుకొన్నట్లున్న పద్యములోని పురాణ కథాసామ్యము పట్టుపట్టి తెచ్చి నట్లున్నదేగాని సహజముగాలేదు. నారాయణ భట్టు రాజరాజుతో 'సకలము విన్నాఁడ దనివి వస' అని అన్నట్లు వ్రాయబడినది. నన్నయ భారతములో తచ్ఛబ్దవికారలోపము చేసిన ప్రయోగములు లేవు. 'విన్నవాఁడ' అనుటయే అనాటి భాషా పద్ధతి. అందులో వక్త భారతరచనకు "పాయకపాక శాస నికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు" తోడ్ప డిన నారాయణభట్టు. కాబట్టి 'విన్నాఁడ' అని అతనిచే అనిపింప కుండుట శిల్ప దృష్టికి రమ్యముగా నుండునని తోచుచున్నది. "సకలంబును వింటి" అని అనిపించదగును. "విమలమతిన్ పురా ణములు వింటి" అని రాజరాజు భారతావతారికలో నన్నయతో అన్నట్లున్నది.

ప్రతాపరుద్రుని మరణముతో ప్రథమ భాగము సమాప్త మయినది. మంగళాంతము కాకపోవుట దృష్టిలో పెట్టుకొని కవి గారిట్లు వ్రాసినారు.

ఆ. కాకతీయ భాను గంభీర తేజము
బొదువు కొన్నరెడ్డి భూపవహ్ని
వెలుగుఁరేక విరిసి తెలుఁగు చీకటి యుంకి
శుభ సుఖాంతమగుటఁ జూతు మింక.

ఈ పద్యమువలన మంగళము స్ఫురించుటతోపాటు రాబోవునది రెడ్డి పర్వమని కూడ సూచితమగుట ప్రశంసార్హము.

## ఇ త ర కా వ్య ము లు

శ్రీ రాజశేఖర శతావధానిగారి అమర సింహచరి త్రము ప్రతాపసింహ చరిత్ర మార్గములోనే నడిచిన వీర రసప్రధానకావ్యము. అమరసింహుడు రాణా ప్రతాప సింహుని కుమారుడు. అక్బరు కుమారుడగు జహంగీరు తన తర ములో మేవాడ సాధింపవలెనని ప్రయత్నింపగా అమరసింహుడు కూడ తన స్వాతంత్ర్యమును నిలబెట్టుకొనుట యందలి యితి వృత్తము. అమరసింహ చరిత్రమును వీరికి పూర్వము శ్రీ బాల కవి వేంకట సుబ్బారెడ్డి శ్రీధర తిరుపతి శాస్త్రిగార్లచే రచింప బడినదట. రాజశేఖర శతావధానిగారిదే మేలుగా నున్నదట. ఏమయి నను ప్రతాపసింహ చరిత్రమునకు వచ్చిన ప్రశస్తి దీనికి వచ్చి నట్లు కనబడదు. అశోక చరిత్ర మను గ్రంథ మొకటి వచ్చినది గాని పద్యములు ధారావాహిగా ఉండుటయే దీని సుగుణమని ఒక 'రివ్యూ' వలన తెలియుచున్నది. శ్రీ పి. నారాయణరెడ్డిగారి విశ్వనాథనాయుడు గేయచ్ఛందోబద్ధమగు లఘుచారిత్రక కావ్యము. 'హంపీ క్షేత్రము'లో ఈ కథ రాజ్య ప్రదానము శీర్షికతో వ్రాయబడియున్నది. 'షాజీ' అనునది శ్రీ పుట్టపర్తి నారాయణా చార్యులుగారి కృతి. శివాజీ తండ్రి షాజీ. ఇతని చరిత్ర శివ భార తములో కూడ వచ్చును. ఆంధ్రప్రశస్తి, ఝాన్సీరాణి అను నవి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు రచించినవి. ఆంధ్ర ప్రశస్తిలో "మహా ప్రబంధ రచనాసౌందర్యమున్ వానవల్" గుబాళించు చున్నవి. భావనాపటిమ భాషాప్రభుత్వము కన్నులకు కొట్టి వచ్చినట్లుండు రచన ఆంధ్రప్రశస్తి. ఆంగ్లేయులు వర్తకము నకు వచ్చుట, వారి రాజ్యసంపాదన విధానము, వారి దౌర్జన్య బుద్ధి, సందర్భవశమున చెప్పుచున్నట్లు సంఘటన పరచుచు, ఆంగ్లేయులకుగల కాలానుకూలత, ఝాన్సీరాణి ప్రయత్న వైఫ ల్యము, కవితాశిల్పము సాక్షాత్కరించునట్లు వ్రాయబడిన లఘు చారిత్రక కావ్యము ఝాన్సీరాణి.

ఆధునిక యుగమున వెలువడిన చారిత్రకకావ్యము లన్నింటిని ఒకే వ్యాసమున సమీక్షింపబోవుట వ్యాస విస్తరమునకు హేతువు కాక తీరదు. రాణా ప్రతాపసింహ చరిత్ర శివభారతము ఆంధ్ర పురాణము అనునవి ఆధునిక బృహచ్చారిత్ర కావ్యములలో పేరెన్నిక గన్నవి. వీటిని గురించి కొంత విపులముగా సమీక్షించుట యైనది. తక్కిన కొన్ని చారిత్రక కావ్యములను గూర్చి సూచిం చుట మాత్రమే జరిగినది. సహృదయతతో నిష్పాక్షికముగా వ్రాయుటకు ప్రయత్నించిన ఈ సమీక్షలోని గుణలేశములను విజ్ఞులు గ్రహింతురు గాక !

# తమసోమా జ్యోతిర్గమయ

శ్రీమతి ఇవటూరి రమలత

సమకాలీన సమాజపు నాగరికతని
రమణీయంగా నిర్వచించాలనే మహ
దాశయంతో, విలువలు తెలియని బతుకుల
వెలలన్నీ కట్టేద్దామనుకున్నాడో మానవుడు

శ్రీకారం చుట్టబోయి నాగరికత కాదేమోనని
మానేశాడు; అయితే పాపం ఎటుచూసినా
సమస్యల లతలు, నివృత్తికాని సందేహాలు
అడుగడుక్కీ అల్లుకుంటున్నాయి

ఆరంభ శూరత్వంతో ఆ వలయాల్ని ఛేదిద్దా
మనుకొనేటంతలో, ఆలోచనలు జిజ్ఞాసలు
అతని పురోగమనాన్ని అటకాయించాయి;
వినవచ్చే వాక్కులు వింటున్నాడు మానవుడు.

నిరంతరం నిత్యసంగ్రామంలో ఓటమి
సంగీకరించే నీకు ఎందుకోయీ గొడవంతా ?
చేతనైతే జీవితాన్ని అనుభవించు
లేదా విధిని తిట్టుకుంటూ గోళ్ళుగిల్లుకో

బతుకుల విలువలు, మండేగుండెలు, జ్ఞాపకాల రొదలు
ఇవన్నీ పాతనినాదాలు; బూజుపట్టాయప్పుడే;
సామర్థ్యమనే సాధనంతో వదలగొట్టా
జ్యేష్టాదేవి వలువలు

మధ్యతరగతి జీవితాన్నే మహాప్రసాదంగా స్వీకరించే మానవుడా
నాగరికతని నిర్వచించే తాహతెక్కడిదోయ్ నీకు ?
తెచ్చిపెట్టుకొన్న గాంభీర్యంతో అజ్ఞానాన్ని దాచుకో ప్రయత్నించకు
ముందర నీసంగతి సరిచూసు తరువాత లోకుల
జీవితపు విలువల వెలలు కట్టుదుగాని

కాలపురుషుని కార్యాలయంలో
నీ శాఖని సమర్థంగా నిర్వహించు
అర్థంకాని విషయాలజోలికిపోతూ
అర్థంలేని వ్యథలని అనుభవించకు

వస్తాడో యుగపురుషుడు
ఇస్తాడో నిర్వచనం నాగరికతకి
తీరుస్తాడు నీ ధర్మసందేహాలన్నీ
మారుస్తా డీ నైతిక బాహ్య సమాజాన్ని

అందుకనే ఓయీ మానవుడా సుబ్బారావూ
రామారావూ మీరీలోకాన్ని గూర్చి మథనపడకండి
విధాత విధించటంలో నమ్మకం లేకపోతే
స్వధర్మంమాటే తలపెట్టకండి

జగన్నాటకంలో మనపాత్ర మనం పోషిద్దాం
నాటకవిజయం నలుగురిమీదా ఆధారం
నలుగురూ మనలాగే భావిస్తే
అదే భువనైక సౌందర్యం

కలల కొలనుల్లో విహరించటానికి ఆశల సౌధాల నిర్మాణానికి
ఇంకా ఇంకా ఇష్ట కామ్యార్థ సిద్ధికి అంగబలం అర్థబలం వీటినిమించిన
ఆత్మబలం అవసరమని తెలుసుకొనుట యెంతైనా అవసరం
జీవనగతిని జీవితరీతిని తీవ్రంగా మథించటం నాగరికతా? కాలాన్ని
పరిస్థితుల్ని ద్వేషించటం నాగరికతా!

పరిస్థితుల్ని ప్రపంచాన్ని కాలగతిని
అన్నిటినీ మనసునుంచి జీవితాన్ని
చేతనయినంత మేరకు అనుభవించటమే
నాగరికత నిర్వచనం

విన్నాడు మానవుడీ ఘోషంతా
మానుకొన్నాడు కాలాని కెదురీత ఈదటం
జీవితాన్ని అనుభవించటంలోనే
ఆనందం ఉందని తెలుసుకొన్నాడు.

# ఆర్. చక్రారావు

## శ్రీ వాకాటి పాండురంగరావు

"ఒరేయ్ అబ్బాయ్!.... ఈ ఆదర్శాలనేవి చదువుకోవడానికీ, రాసుకోవడానికీ మా బాగా ఉంటాయి.... ఏం, ఉంటాయి కదా అని ఆచరించబోతే చాలా చేదుగా ఉంటాయి. పట్టుకుంటే గట్టిగా పాషాణంలా ఉంటాయి. గనకా, పిచ్చి పిచ్చి నమ్మకాలు పెట్టుకుని జీవితాన్ని పాడుచేసుకోకు. నామాట విను. పెద్దవాళ్లు పెట్టిన కొన్ని సంప్రదాయాలలో ఎంతో ఉపయోగకరమయిన అర్థం ఉంటుందని తర్వాత తెలిసి వస్తుంది. అంచేత శుభ్రంగా కట్నం తెచ్చే పిల్లనే పెళ్లాడు. కాదని యీ టీచరు కూతురిని చేసుకున్నావా .... ఆనక నన్నేమీ అడగకు. నీ ఖర్మ! ...." అని అన్నారు నాన్న తొమ్మిదేళ్ల కింద ఒక రోజున—

ఆ నాడు నాన్నను, కాదన్నాడు చక్రారావు.

ఇరవై మూడో యేట, ఇంకా పెళ్లికాకముందు, ఇంటి పెద్ద ఇంకొకరుగా ఉన్నప్పుడు—ఎవరికయినా జీవితం అంటే ఓ పొడుగాటి తారు రోడ్డులా ఉంటుంది. ఆదర్శాల కారెక్కితే చాలు అతిసునాయాసంగా ఈల వేసుకుంటూ ఆ తారురోడ్డు దాటేయ వచ్చుననిపిస్తుంది. అంతేకాదు. పెద్దవాళ్లు వేసే రూపాయల కూడికలూ, ఆశయాల తీసివేతలూ చూస్తుంటే ఆశ్చర్యమూ, అసహ్యమూ కలుగుతాయి. చక్రారావుకూ అంతే అయింది.

నాన్నను కాదన్నాడు. సీతను తనదానిని చేసుకున్నాడు. పెళ్లికి కూడా రానన్నారు నాన్న. ఆయన హృదయాన్ని అంతగా నొప్పించాడు! రెండేళ్లపాటు పట్టుదలలు పరిపాలించాయి. నాన్న ఉత్తర మయినా రాయలేదు. అమ్మ వస్తానంటే అడ్డుపడ్డారట. అని తమ్ముడు రాశాడు. వాడా పాటికి ఇంజనీరింగ్ నాలుగో సంవత్సరం చదువుతుండేవాడు. అప్పుడప్పుడు ఇంటి విషయాలతో ఉత్తరాలు రాస్తుండేవాడు.

సీత తల్లి అయింది. నాన్న పట్టుదల సడలింది. అయినా హృదయం అంటే గాజు కూజా కాదుగా విరిగిం తర్వాత అతకడానికీ—తను అలా ఎదిరించిన తరువాత నాన్నకు కాస్త కూస్త సంతృప్తీ, సుఖమూ ఇచ్చినవాడు తమ్ముడు. వాడు ఇంచక్కా నాన్న చూసిపెట్టిన అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. అయిదువేలు, అదిగాక సైకిలు, అవీ పుచ్చుకున్నాడు. ప్రస్తుతం, వాళ్ల మామగారి ధర్మమా అంటూ, ఆరేళ్ల సర్వీసులో అసిస్టెంటు ఇంజనీరయి కూర్చున్నాడు—

—(అని పై పేరా గ్రాఫులన్నీ అనుకుంటూ) నడుస్తున్నాడు చక్రారావు. అతగాడి మరదలు సంక్రాంతికని అక్కయ్య యింటికి తెనాలి నుండి వచ్చింది. ఓ రెణ్ణెల్లుండి ఆపూటే తెనాలి వెళ్లింది. అధికోత్సాహంతో ఆమె వెంట వెళ్లి రెండుగంటల ఎక్స్‌ప్రెస్‌లో ఆమెను ఎక్కించి పర్మిషన్ గడువు మీరకుండా ఆఫీసు కొచ్చేస్తున్నాడు చక్రారావు.

ఎలక్షనులో గెలిచిన నాయకుడిలా వెలిగిపోతున్నాడు సూర్యుడు; గుమాస్తా ముండావాడి దారిద్ర్యంలా మండిపోతూంది మధ్యాహ్నపు టెండ. ఒక్క నిముషం దారి ప్రక్కన చెట్టుక్రింద నిల్చున్నాడు చక్రారావు .... చెమటకు తడిసిన చొక్కాలోనుండి ఒళ్లు—నల్లటి సన్నటి ఒళ్లు కన్పిస్తూంది....మామూలుగా అయితే చొక్కాకూ, ఒంటికీ మధ్య 'బనియన్' అనే పదార్థం ఒకటి ఉండాలి. ఆ మధ్య ఎప్పుడో దాకా చక్రారావుకూ ఉండేది. మరీ ఈమధ్య ఆ మూడోవాడిని కన్నప్పటినుండీ సీత ఇలా చీటికీ మాటికీ అడ్డంపడుతుండెనా—అందువలన తన వందా పాతికా జీతంలో ("నెలలో మొదటి దినము మీ పొదుపు దినము", "మీరు సంపాదించేదంతా ఖర్చు చేయకండి!") వలకై అయిదు రూపాయలు అడ్వాన్సుల క్రింద వెళ్లిపోతూం దిటీవల .... అప్పటినుండీ .... విగత బనియనుడై ......

—నడిచాడు చక్రారావు చెట్టు నీడను వదిలి. (లేకపోతే, చక్రారావు వంటి వాళ్ల కోసమే వేపటి చెట్ల నీడలూ, చల్లగాలులూ .... ? ఇదేం అశోకుడి రాజ్యమా, ఏమన్నానా??") .... ఖర్చయి పోతున్న జీతంలా త్వర త్వరగా నడిచాడు చక్రారావు .... వెనకటికి ఏదో ఓ కథలో ఒక మహర్షి ఎవడో తన భార్యకు ఎండ తగలకుండా కొన్ని ఏర్పాట్లు చేసిపెట్టాడట.... ("గేదె మార్కు గొడుగు, మంచి టపేటా సిల్కుతో తయారు చేయబడును.") చక్రారావుకు కూడా ఆ ఋషి కథ తెలుసు.

ఇప్పుడు నడుస్తుంటే గుర్తు కొచ్చింది కూడాను. ఉపవాసం ఉన్నవాడికి ఆవకాయ అన్నంలాగున ....

మాడు చుర్రుమంది. .... రుమాలును తీసి నెత్తి మీదుగా వేసుకుని దాని నాలుగు కొసలలో రెండింటిని లాగి గడ్డంకింద ముడి పెట్టుకున్నాడు చక్రారావు .... అయిపో యింది. ఇంక ఆఫీ సెంతదూరం ? మూడు ఫర్లాంగు లుంటుంది. మూడు ఫర్లాంగు లనగా ఎంత—మహా అయితే ఓ మైలు కన్న తక్కువేగా. వడి హెచ్చిద్దా మనుకున్నాడు చక్రారావు. హెచ్చించాడు. కుడి పాదపు టైరు చెప్పు టప్పుమంది.. ఒంగిచూస్తే బొటనవ్రేలి దగ్గర తోలు రింగు తెగిపోయి ఝామ్మున విరగబడి నవ్వుతూంది!—అయినా, ఏమీ ఫరవా లేదు. చక్రారావు కుడి చెప్పు ఉపయోగం తగ్గలేదు. అది 'మోహరమున దా నెక్కిన బారని గుఱ్ఱము' కాలేదు.

ఆ యొక్క చెప్పుయొక్క సేవాతత్పరతను మెచ్చుకుని "ఆహా!" అన్నాడు చక్రారావు నోరు తెరచి .... గడ్డం కింద రుమాలు ముడి తెగింది.

ఎట్టకేలకు ఆఫీసు చేరాడు···నెత్తిమీద జుట్టంటూ పెట్టాడా సృష్టికర్త···నిజంగా దయామయుడు!—లేకపోతేనా!

···అది గ్రీష్మఋతువు!

ఆ తర్వాత ఉగాది వచ్చింది.

చక్రారావు మూడో అబ్బాయి చిరంజీవి చంద్రశేఖరు డికి రెండో యేడు నిండబోయింది.

"ఏమండీ! అబ్బాయికి ఎల్లుండి పుట్టిన దినం—" అని మహజ రందిచ్చింది సీత.

"అవునవును—"

"ఏం కొందామూ ?"

"ఏం పెట్టి ?" అన్నాడు చక్రారావు.

సీత కా మూ డక్షరాలు చాల పాతవి.

అక్కడికి ఆ ఫైలు మూత పడింది.

"నిజంగా మీరు ఎంతో బాగుండవలసిన వారండీ! నాతోబాటు మిమ్మల్ని క్రిందికి—ఈ దారిద్ర్యంలోకి లాగాను. పాపిష్ఠిదాన్ని—" సీత నోటిని మూశాడు చక్రారావు. ఆ చెయ్యే తుడిచింది వెచ్చటి కన్నీటిని. పదేళ్ల క్రిందయితే విడవడం అని 'చా .... క్క .... వి .... రా...జ...మార్గమూ' ఒక్కటుండేది చక్రారావుకు. అదిప్పుడు అలవాటు తప్పింది. (చూశారా మరి—'అభ్యాసము కూసువిద్యే!')

కాసేపు తర్వాత చక్రారావుకు నిద్ర వచ్చింది. కాని సీత మాత్రం క్రిమి సంహారం చేస్తూ కూర్చుంది. ఓ పావు గంట వ్యవధిలో ఓ పది నల్లులూ, ఆరు దోమలూ వైతరణి దాటేశాయి. కాసేపు వేట మాని చిరంజీవుల వైపు చూసింది సీత. మూడోవాడి వీపు ఎర్రటి దద్దులతో పనస తొలలా ఉంది.

'ఘండాలపు దోమలు! :.... పాపం వెధవాయి ఎలా నిద్రపోతున్నాడో—!" పోనీ వీడి పుట్టినరోజు కయినా ఒక చిన్న దోమతెర తెమ్మందా మనుకున్నా—కానీ—' అనుకుంది సీత. అనుకుని ఇటు తిరిగింది. చక్రారావు చెంపమీద పోటీపడి రసాస్వాదనలో కూచుని ఉన్నాయి రెండు గండు దోమలు—కాని ఆ రసనిలయుడు మాంఛి రసవత్తరమయిన నిద్రలో ఉన్నాడు.

సీత అనుకుంది—'దోమతెర ఎంతో అవసరం!' — అనే మేలుకున్న వేళల్లో పది లక్షల రెండుసార్లు అన్నాడు చక్రారావు కూడా—

—ఇంతలో వచ్చింది శ్రావణమాసం (రాకుండా ఎక్క డికి పోగలదు గనక ?)

ఇత్తడి మరచెంబుమీద వెల్లచాదు ముక్కూ, వెల్ల చాదు కళ్లతో వరలక్ష్మమ్మను తీర్చిదిద్ది నోము నోచుకుంది సీతమ్మ. సంతానం చాలనీ, సౌభాగ్యం కావాలనీ చెప్పుకుంది సీతమ్మ. తన్నేలినవాడికి మరో వంద ఎక్కువ జీతం వచ్చే ఉద్యోగ మిప్పించమని కోరుకున్నది సీతమ్మ. అమ్మవారు నవ్వింది—(నవ్వి ఊరుకుంది.)

ఆ మరురోజు పొద్దున్న తమ్ముడి దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది చక్రారావుకు.

అవీ, ఇవీ రాసి, ఆఖరికి— " .... అన్నయ్యా,

> మరేమో నేనో చిన్న ప్రమోషన్ మీద ఢిల్లీలో ఉద్యోగానికి వెళ్తున్నామా—టెలి గ్రాంమీద ఆర్డర్లు వచ్చాయి గనుక తక్ష ణమే వెళ్ళి, అక్కడ వాలాలి—అందుచేత, దారిలోనే ఉన్నప్పటికీ మీ వూళ్లో దిగ లేక పోతున్నామా—అందుకు క్షమించి మంగళవారం నాలుగింటికి జి. టి. కి నువ్వూ, ఒదినా స్టేషనుకు తప్పకుండా రావలసిందీ—ఈ మాటే లలిత కూడా రాయమన్నదీ...." అని రాశాడు తమ్ముడు.

వ్రతం చేసింది సీత : ఫలితం దక్కింది లలితకు.

(సీత చేసింది నిష్కామకర్మ యగునా ? లేక, పూర్వ జన్మలో లలిత ఏమి నోము నోచుకునెను ?)

ఎలాగయితే నేం—చక్రారావు డ్రిల్లు సూటులోనూ, సీతమ్మ కట్ పీసెస్ వాయిల్ లోనూ తయారయి, చిరంజీవులు ముగ్గుర్నీ పక్కింటి బామ్మ గారికి అప్పజెప్పి (బామ్మ మార్కు స్వచ్ఛంద సేవకులు వర్ధిల్లాలి!) స్టేషనుకు సరిగ్గా టైము కొచ్చారు. చక్రారావులాంటి గుమాస్తా వచ్చిన టైము సమస రించి తాను రావడ మేమిటని కించపడిన జి. టి. ఎక్స్‌ప్రెస్, క్లాస్—1 ఆఫీసరులా 320 నిముషాలు 'లేటు' గా వచ్చింది...

సరే—అది ఇంజన్ను నీళ్లు తాగేసే స్టేషనేమో—చక్రారావు సావకాశంగా మూడో తరగతి పెట్టె లన్నిటినీ తణిఖీ చేశాడు. చేసి నిస్పృహ చెందుతుండగా—

"అదిగోనండీ మరదిగారు!" అని గుర్తు పట్టింది సీత.

పదహారడుగుల నిడివి గల ఫ్రేము మధ్య తిరుపతి వేంకటేశ్వరుడిలా మొదటి తరగతి పెట్టె గుమ్మంలో నిల్చుని, చూస్తున్న తమ్ముడు అన్నయ్యనూ, ఒదిననూ గుర్తుపట్టి క్రిందకు దూకాడు.

అన్నయ్యా తమ్ముడూ కలుసుకున్నారు.

గుమాస్తా, ఇంజనీరూ మాట్లాడుకున్నారు.

సీతా, లలితా కలుసుకున్నారు.

బొంబాయి వాయిలూ, కంచి పట్టూ పలకరించుకున్నాయి.

రైలు కదిలింది.

బత్తాయి పండు తొనల్ని ఒలిచి మొగుడి ఎదుట పళ్లెంలోని బిస్కెట్ల పక్కగా పెడుతూ—"మీ అన్నయ్య నాన్నగారి మాట వినివుండవలసింది—" అన్నది లలిత. ఎక్కడో చురుక్కుమని తగిలినట్లయింది వాళ్లాయనకు. కానీ—మొదటి తరగతి పరువులూ, బత్తాయి పండ్లూ ఆ చురుకుదనాన్ని చల్లబరిచాయి.

సరిగ్గా ఆ సరికే—

స్టేషను నుండి తమ పేటకు వెళ్లే ఆఖరి సిటీ బస్సు వెళ్లిపోగా, అది ఎరిగిన జట్కావాడు రెండు రూపాయ లడగ్గా, వాడి తమ్ముడు రిక్షావాడు రూపాయిన్నర చెప్పాడు—(తగిలిన వేలికే తగులును—అనేది ఆర్యోక్తిట! చక్రారావు ఆర్యుడా?)

"ఎందుకండీ ఈ పాటి దానికి రూపాయీ, రెండ్రూపాయిలూనూ—" అంది సీత చిరునవ్వుతో.

"ఆ ....!! .... వూ ....??"

"నెమ్మదిగా నడిచేద్దాం పదండి ...."

నడకంటే చక్రారావుకి చెప్పాలేమిటి? జోరాసింగంత ఉత్సాహమూ, జటోపెక్కంత వేగమూను ....! ఎటొచ్చీ సీతకే కాస్త యిబ్బంది.

ఎలాగయితేనేం ఆ రాత్రి పదిన్నరకు పక్కింటి బామ్మ గారికి 'రిలీఫ్' వచ్చింది—

ఆ తర్వాత కొన్రోజులకు దీపావళి వచ్చింది.

"ఎంతయినా ప్రమిదల కున్న అందం .... ఆ బల్బులకు రాదు!" అంది సీత ఎదురింటి నియాన్ లైట్ల సోయగాలను చూస్తూ—(పొరుగింటి పుల్లకూర ఎల్లవేళలా రుచి కానేరదు.)

"సరే ....! అయినా సీతా! ఆ ముగ్గుమీద ఒక్కసారే ఆరు ప్రమిద లెందుకూ—రెండు చాలవూ?—" అన్నాడు చక్రారావు—ఆరు ప్రమిదలూ (ఇంటూ) రెండేసి పలాల నూనే (ఇంటూ) పదిహేనేసి పైసలూ (ఈక్వల్టూ) వగయిరా—

"అమ్మోయ్! .... నా కాకర పువ్వొత్తి ఎలా వెలుగుతోందో చూడవే—" అంది కూతురు లక్ష్మి.

"నీ మొహం! నా మతాబానే ఎంతో బాగుంది—" అన్నాడు పెద్దవాడు.

వాళ్ల మొహాల వెలుగుతో సీత హృదయం దీపావళి చేసుకుంది ....

అన్ని కష్టాలూ అడ్వాన్సు నోటీసు లేకుండానే వస్తాయి. ఆ విధంగానే ఆ రాత్రి రెండు గంటలకు సీతకు హఠాత్తుగా వచ్చింది విపరీతమయిన చలి జ్వరం. మూడో అంతస్తుమీద ఎగరేసిన జండాలా వణికిపోయింది సీత—నిద్రలో ఉన్న చక్రారావు ఆమె మూలుగువిని లేచి కూర్చున్నాడు.

ఆమెమీద మూడు దుప్పట్లు కప్పాడు. ఇంకో రెండు కప్పును గాని, లేవు. అయినా జ్వరం ఎగరేసిన జెండా విజృంభణ తగ్గలేదు.

పిల్లలు ముగ్గురూ నిద్రపోతున్నారు. ఆఖరివాడు ఏదో బొంగరం గురించి కలవరిస్తున్నాడు.

చన్నీటిలో తడిపి సీత నుదుటిమీద చక్రారావు వేస్తున్న గుడ్డలు క్షణంలో పొడి అయిపోతున్నాయి...

'మాంఛి రగ్గు ఒక్కటి వుంటే ఎంత బాగుండును—ఈ చలికి వెచ్చగా కప్పివుండవచ్చు' అనుకున్నాడు చక్రారావు—(మెరినో జాతి గొర్రెలు మంచి ఉన్ని నిచ్చును—')

—"సీతా! అసలే నీ ఆరోగ్యం అంతంతమాత్రం కదా! అంత పొద్దున్నే లేచి ఆ స్నానం చెయ్యడం, ఈ పిండి వంటలు—అదీ, ఇంత అలసట—వద్దంటే నా మాట విన్నావూ?' అన్నాడు చక్రారావు.

అసలా మాట వినే దశలో లేదు సీత. హఠాత్తుగా ఏదో అరిచింది. కళ్లు తెరచి ఏదోగా చూసింది——

చక్రారావు గుండెలో విష్ణుచక్రం తిరిగింది. పెద్ద వాడిని లేపి కూర్చోబెట్టి డాక్టర్ రాజేశ్వరమ్మ దగ్గరకు పరుగెత్తాడు—కాళ్లమీద.

ఆమె వెంటనే వచ్చి చూసి ఒక మందు రాసి యిచ్చింది. సీతకేమీ ఫరవాలే దంది. రెండు రూపాయ లివ్వ బోయిన చక్రారావుతో "అబ్బే నాకు తర్వాత ఇద్దురు గాని... ముందా మందు తెండి. పొద్దుటికి జ్వరం పోతుంది. నాల్గయిదు రోజుల దాక ఆవిడకు పళ్లూ అవీ యిప్పించండి—" (ఈ కలియుగంలో ధర్మదేవత పాదం అనడానికి ఆమాత్రం చోటయినా కల్పిస్తున్నదీ రాజేశ్వరమ్మలేనేమో!")—అని రిక్షాలో వెళ్లిపోయింది డాక్టరు. ఆ మంచితనంలో తడిసి ముద్దయి నిల్చున్న చక్రారావు మళ్లీ పరుగెత్తాడు; ఈసారి బజారువీధికి.

ఇరవై నాలుగు గంటలూ తెరిచివుండే ఒకానొక మందుల షాపును చేరుకున్నాడు చక్రారావు. నిద్రమత్తులో, చక్రారావిచ్చిన చీటీని చూచి, డబ్బులు పుచ్చుకుని మందిచ్చాడు షాపు వాడు. ఇంటికి పరుగెత్తసాగాడు చక్రారావు.

అప్పుంవాడిలా డబడబ చప్పుడు చేసింది ఆకాశం. వీధిదీపా లొక్కసారి ఆరి వెలిగాయి. పెద్ద గాలి వీచింది. ఆ చల్లదనానికి ఆకాశం మబ్బుల దుప్పటి తీసి మెరుపుల కళ్లతో చూసింది వడిగా, పొడిగా వెడుతున్న చక్రారావును.

"అమ్మ చక్రారావూ! నాతో పోటీయే!!" అనుకుంది మేఘమాల; టపటపమని నవ్వసాగింది.

నెత్తిమీద చెయ్యి పెట్టుకుని, జుత్తుమీద నుండి నూనెతో కలిసి కళ్లమీదుగా కారుతున్న వర్షం నీటిని తుడుచు కుంటూ, జేబులో ఉన్న మందు పొట్లం తడవకుండా చూచు కుంటూ—వడివడిగా, తడితడిగా నడిచి వెడుతున్న చక్రారావుని ఆప్యాయంగా ఆపి రెండు నిముషాలసేపు నిలువునా స్నానం చేయించింది వర్షం ......

'మార్చిలోనే అనుకున్నా గొడు గొకటి కొనాలని—' అనుకోబోయిన చక్రారావు చెంప చెళ్లు మనిపించే వాన జల్లుని తెచ్చిందొక హోరుగాలి—

'ఈ గాలిలో గొడుగేం ఆగుతుందీ—!' అనుకుంటూ చక్రారావు ఇంట్లోకి అడుగు పెట్టాడు.

—నాలుఘ్ఘంటల తరువాత—పొద్దున్న ఆరింటికి కళ్లు తెరిచి నవ్వింది సీత.

"ఎలా ఉంది సీతా?"

"బాగానే ఉంది .... కాస్త నీరసంగా ఉంది. అంతే!"

"రెండ్రోజులపాటు నువ్వు కదలకూడదు ...."

మళ్లీ నవ్వింది సీత— "అయినా నా కిన్ని దుప్పట్లు కప్పా రేమండీ—?"

"ఒక్క రగ్గు లేదు కనక!"

—అంతవరకూ జాగరణ చేసిన చక్రారావుకు అర గంట తర్వాత కునుకు పట్టేసింది ....

"ఓయ్ షాపువాడూ! ఆ జరీ చీరలూ, సూటింగూ వేరుగా ఉంచు. వాటితోబాటే, ఇదిగో చూడూ! ఓ అర డజను మాంఛి హైక్లాస్ రగ్గులూ, ఆ పాతిక రూపాయల దోమతెరలు అయిదూ, ఒకటోరకం రెయిన్ కోటొకటీ పడేయి—అన్నట్టు మరిచిపోయాను. ఓ గ్రోసు గొడుగులు— అవునయ్యా బాబూ! ఓ గ్రోసు గొడుగులు కూడా ఇచ్చేయి... ఏం? బిల్లు ఇస్తే అనక మా డ్రయివర్‌తో పంపుతా డబ్బు" అని ఎడాపెడా ఆర్డర్లిచ్చేస్తున్నాడు నిద్రలో ఉన్న బురు చక్రారావు!



# బాభ్రవ్య స్మరదర్శన వివరణము

శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రి

"సర్వమోంకార ఏవ" అను మాండూక్యశ్రుతి ప్రతిపాదితార్థమునే బాభ్రవ్యస్మరదర్శనము వ్యక్తీకరించుచున్నది. ధర్మ, అర్థ, కామ, మోక్షము లనెడి చతుర్విధ పురుషార్థములు తరముగా ప్రణవ పాదములగు అకార ఉకార మకార అర్ధమాత్ర లోనుగా తెలుసుకొనుటకు వీలున్నది. మోక్షమనునది ధర్మార్థకామము లనబడు మూడు పురుషార్థములందే యున్నది. ప్రత్యేకించి మోక్షమనబడు పురుషార్థమును తడవ పనిలేదని కామశాస్త్ర ప్రవక్తల నిర్ధారణ. అందులకనే వాత్స్యాయన కామశాస్త్ర వ్యాఖ్యాత "నమో ధర్మార్థ కామేభ్యః తత్కామేభ్యో నమోనమః" అని వ్యాఖ్యా ప్రారంభ మంగళాచరణమును గావించెను. ఇచట గమనార్హమగు విషయము విశేషించియుండెను. పురుషార్థ త్రయమా లేక చతుష్టయమా అను సంశయమురాగా పురుషార్థత్రయవాదివర్గము ఒండుగా పురుషార్థచతుష్టయవాది వర్గము వేరుగా రెండు పక్షముల విభాగింపబడినట్లు మనకీ స్మరదర్శనాదులవలనఁ దెలియుచున్నది. ధర్మమోక్షములు రెండును ఒక ప్రక్కగా, అర్థకామములు రెండును ఒక ప్రక్కగా స్మార్తుల దృష్టికి గోచరించుచున్నవి. ఈ ధర్మాది పురుషార్థ చతుష్టయము కేవల భౌతికాభౌతిక ఫలానుభవశాలియగు మానవుని జీవిత సర్వస్వమునకు సంబంధించియున్నది. వీనిని తత్త్వచ్ఛాస్త్ర దృష్టమార్గములవలననే గురుముఖతః కొంతయు, శాస్త్రజాలములవలనఁగొంతయు లోకానుభవమునఁగొంతయు స్వానుభవమునఁగొంతయుఁ దెలిసికొని సాధించి ధన్యుడగు మానవుడు గొప్పవిన్నాణియని భారతమున పురుషార్థ ప్రశంస చక్కగా యొనర్పఁబడియున్నది. సోదరులడుగుటయు, ధర్మజుడు చెప్పుటయుగా చక్కని కథా కలితార్థయుక్తి మనకు పంచమవేదమగు భారతమువలన దెలియుచున్నది. ఇచ్చట పాంచాలుడగు బాభ్రవ్యుడు, తార్తీయపురుషార్థవేత్తలలో ప్రామాణికుడు, పైపెచ్చు మహర్షి యగుటచే కామశాస్త్రీయ ధర్మ మోక్షములను తత్ప్రమాణసరణిచే చక్కగ నిరూపించియున్నాడు.

బభ్రువనగా నకులము. భారతములో నకులు డున్నాడు. బభ్రువాహనుడు ఉన్నాడు. ఈ బభ్రుశబ్దము ఒకానొకప్పుడు భారతదేశమున మంచి ప్రశస్తిలో యున్నట్లు మనకీ నామములే దెలియజేయుచున్నవి. ఈనాడు మునిగిన కిట్టి గౌరవములేదు. బభ్రుని కొడుకు బాభ్రవ్యుడు. లేదా బభ్రుని గోత్రజుడుగానలయును. ఋషి ప్రవరకాండమువలన బభ్రువనబడునొక ఋషి యున్నట్లు దెలియుచున్నది. "బ్రహ్మతత్స్మర దర్శనం" అని మంగళాచరణశ్లోకములో బ్రహ్మస్మరణ ముండుటచే ఇతడు బ్రహ్మవేత్తలగు మహర్షుల శ్రేణికి జెందినవాడేగాని సామాన్యుడుగాడని నిర్ధారణగా జెప్పవచ్చును. కావ ఇతని కాలము ఋషి కాలమే. అనగా నవ్యచారిత్రకుల నిర్ధారణము మేరకు బుద్ధునికి ముందుగాగల మాత్ర కాలమున ఈతని జేర్పవచ్చును. వాత్స్యాయనుడే పాంచాలుడనుటవలన ఈతని దేశమేది యను చిక్కు వదలినను, పాంచాల శబ్దము కామ శాస్త్ర సాంప్రదాయమున ఉత్తమోత్తమ పురుషుని రక్షించు నట్టిదిగా యుండుటవలన గొంత సందేహింపవలసి వచ్చినది. అయినను ప్రకృత మీతనిని పాంచాల దేశీయునిగనే తలంచెదను.

ఇటీవల సుమారు 2000 సంవత్సరములుగా ఈ తృతీయ పురుషార్థ దర్శనము లేనో జనులచే అసభ్యత క్రింద జమకట్టబడి, వీనికి దగినట్టి రీతులలో నాటికి జరుగుచున్న పాత ప్రవచనముల పద్ధతి చెడి, నేటికి కేవలము పశు విధానముల క్రింద పరిణమించినన్నై, ఈ శాస్త్రమునకుగల సర్వోత్తమకళావిర్భావస్ఫూర్తియు, కామితశుభసంతతిని పొందగల నేర్పును, ఎన్నియో మహత్తర ప్రయోజనములును లోకము కోలుపోయినది. ఈ శాస్త్రమువలన అన్యశాస్త్రములకు కావలసి యుండు సహాయ సంపదయు నశించినది. నాగరకత వెఱ్ఱితలలు వేసినది. ఇందులకు కారణము అర్థ రహిత వేదాంత విడంబనమే య్యైయుండును. మరియు ప్రసిద్ధ బుద్ధాది ప్రవక్తల విరాగోచిత భాషణలు, జనుల అనాసక్తి, క్షణికావేశము, పశు ప్రవృత్తి, ఆలస్యము—ఈ మొదలగునవి కారణములు అని కూడా చెప్పుటకు వీలున్నది. కూచిమారాది తదితర స్మరదర్శనకర్తల గ్రంథములు నేడు లభింపవు.

"సర్వ శాస్త్రేషు యత్సారం" అని బాభ్రవ్యుడు సర్వ చైతన్యసమష్ట్యైకనందమగు బ్రహ్మ స్వరూపమును ఎత్తి చూపెను. ఈ విషయమునే తైత్తిరీయోపనిషత్తు "ఆకాశ శరీరం బ్రహ్మ, సత్యాత్మ ప్రాణారామం మన ఆనందం శాంతి సమృద్ధ మమృతం" అని భంగ్యంతరమున వ్యక్తము చేసినది. ఉత్పత్తి స్థానము బ్రహ్మయనియు; స్థితి, లేదా, సంకల్పము (లేదా స్వప్నము) ఈ స్థానము వైష్ణవమనియు; సుషుప్తిలయము ఇంద్రియైకాంతసుఖము విశ్రాంతి. స్వాత్మానందము సామాన్య

ముగా సమస్త ప్రాణికోటికిని సహజముగానుండు నీ మూటిని బ్రహ్మ విష్ణు శివాత్మక ప్రకృతిగా కొందరు వేత్తలు దలంచి యున్నారు.

మరియు "అన్నం బ్రహ్మ రసో విష్ణుః భోక్తా దేవో మహేశ్వరః ఏవంధ్యాత్వా" ఇత్యాది భావనాకృతులు మన ఆర్షవాఙ్మయమున వేనకు వేలు గలవు.

"త్రయీం తిస్రో వృత్తీః త్రిభువనమథో త్రీనపి సురాన్
అకారాద్యైర్వర్ణైః త్రిభిరభిదధత్ తీర్ణ వికృతిః
తురీయం తే ధామ"

అని పుష్పదంత గంధర్వుడును—

"దేవానాం త్రితయం త్రయీహుతభుజాం శక్తిత్రయం
త్రిస్వరాః త్రైలోక్యం త్రిపదీ త్రిపుష్కర
మథ త్రిబ్రహ్మ వర్ణాస్త్రయః
యత్కించిజ్జగతి త్రిధా నియమితం వస్తుః త్రివర్గాత్మకం
తత్సర్వం త్రిపురేతినామ భగవత్యన్వేతి తే తత్త్వతః"

అని లఘుస్తవమున కవికుల గురువు కాళిదాసును పేర్కొని యున్నారు. ఈ బాభ్రవ్యుడు

భోజనంతు తథావిష్ణోః
జ్ఞేయం పాలయితుః పదం
భోజనేన శరీరస్య
పాలనం జాయతేయతః

నిద్రాతః సర్వజగతో విష్ణ్వంతిస్తు లయాత్మికా! నిద్రాతో రౌద్రయిత్యుక్త బ్రహ్మ విష్ణు శివాత్మకం"—అని సృష్టి బ్రహ్మ స్వరూపమనియు; స్థితి, భోజనము విష్ణు స్వరూపమనియు; నిద్రా, సుషుప్తి మొదలగు వ్యాపారములన్నియు రౌద్రాత్మికములనియు; ఇది బ్రహ్మ విష్ణుశివాత్మకమగు ఉపస్తంభత్రయమనియు అగ్నివేశాది మహర్షులచే బోధింపబడిన సత్యమునే తాను చెప్పుచున్నానని చెప్పెను.

"యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు—
యుక్త స్వప్నావబోధస్య జాగ్రతో భవతిస్వహో—గీత—

జగము త్రివర్గాత్మకము. అందే పరము, మోక్షముఅంతర్భూతము—ఈ త్రివర్గ విజయ మందిన నరునకు మోక్షము కరబదరాయమాణ మనుట అనుభవజ్ఞుల యనుభవములలోకెల్ల సారమగు స్వానుభూతియని చెప్పవచ్చును.

"మైథునం మోక్షసాధనమ్" ఇత్యాద్యభియుక్తోక్తుల నితః డుదహరించినందున నవ్య నాగరికులు కొందరితనిని మోటువానిగా తలంచవచ్చును. కేవల గ్రామ్యధర్మపరముగా అర్థము చేసుకొని మన మీ సూక్తిని దురర్థముల క్రింద మార్చుకొనరాదు. 'ఆత్మా వై పుత్రనామాసి' 'అపుత్రస్యగతిర్నాస్తి' ప్రజయాహి మనుష్యః పూర్ణః" "ప్రజాతిరమృతమానంద ఇత్యుపస్థే" ఇత్యాది శ్రుతిస్మృతి వచనానుసారముగా ధార్మిక కామఫల మనంత సౌఖ్యప్రదమగుచున్నది

"నమాంస భక్షణే దోషో న మద్యే నచ మైథునే
ప్రవృత్తి రేషా భూతానాం నివృత్తిస్తు మహాఫలా"

అన్న సూక్తి నీ శాస్త్రకర్త గ్రహించి "నివృత్తిస్తు మహాఫలా" అన్న సూక్తి కెంతయో పూజ్యత్వమునిచ్చియున్నాడు.

"విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనాః"

ఇత్యాది భర్తృహరి సూక్తుల ప్రకారము స్వాభావతః స్త్రీ విషయక వ్యామోహమును, మాంసమద్యములపై లోకమునకు గల మక్కువయు, తెలియజేయబడియున్నది. నివృత్తి మార్గ ప్రవణుల కీ వస్తువులతో నేమిపని? అట్లని ప్రవృత్తి మార్గగాముల కీ వస్తువులు బొత్తిగా కూడ పనవచ్చునా? నాటి శాస్త్రములు నేటి చట్టములు ప్రజల తత్వమును గమనింపని సమయమున ఏమగుచున్నవియునూ మనము చూచుచునే యున్నాముగదా! అట్లని పశ్యేతరముగా ప్రవర్తించుటకు, ప్రవర్తించుచున్న జనులను చూచి యానందించుటకు మన సొప్పుకొనునా? అందుచేతనే మనువు "ప్రవృత్తి రేషా భూతానాం" అని జంతుస్వాభావిక ధర్మమును నిరూపించి నివృత్తి నుపదేశించెను. ఈ ప్రవృత్తి నివృత్తి రూప మార్గద్వయమును దక్షిణోత్తరాయణములుగా గీత యభివర్ణించినది. ధర్మమోక్షములు రెండు నివృత్తి ముఖముగనూ, అర్థకామములు రెండును ప్రవృత్తి ముఖములుగా యున్నవనుట నిర్వివాదము.

ఇక్కడ "సరసా నీరసా జీవాః" యని ప్రవృత్తి మార్గులను సరసులనియూ నివృత్తిమార్గులను నీరసులనియూ నితండభివర్ణించి సంసారులకు మోక్షము సులభము (కర్మవలన) "సహ ప్రగ భదర్శనాత్" ఈ 'సహాన గభదర్శనము "దశాస్యాంపుత్రా నాధేహి పతి మేకాదశం కృధి" అన్న శ్రుతి వాక్యము చెప్పున మానవుని జీవితమున ధర్మపత్నితో సంసార మొనర్చి పదు గురుపుత్రులను గనుటతో నరిపోవుచున్నది. "నీరసానాం పునస్తత్ర వేదాంతమతయాయినాం" "భావనారూప విజ్ఞానాదేవ మోక్షో భవేదితి" అని వేదాంతమతానువర్తులమతమును తడవి ఇట్లు పూర్వపక్ష మొనర్చుచున్నా డతడు. "కథం జంజన్యతే తా దృగ్భావన్యై తద్రసం వినా" యను మాటకును "కామిగాక మోక్షగామి కాడు" అన్న వేమన్న మాటకును సామీప్యము చక్కగా కుదురుచున్నది. "తద భావా న్నీరసానాం మోక్షో మరుమరీచికా" అని భావనా రహితులగు నీరస జీవులకు మోక్షము చవిటి పఱ్ఱల లోని యెండమావులందలి జల భ్రాంతి గాగలదని తేల్చి చెప్పెను.

"యది జన్మ జరామరణం నభవే ద్యది చేష్ట వియోగ భయం నభవే........దిహ జన్మని కస్యరతిర్న భవేత్" అన్న శ్రీమ దాచార్యునిమాట చెప్పున సంసారము నందెడతెరపి గానని ప్రకృతిమూఢుల కెక్కడి మోక్షమని వేదాంతులు నిజమును చక్కగా చూచి చెప్పియున్నారు.

మనము కామశాస్త్ర ప్రసక్త మాటలకు ప్రమాణ పదము నియ్యజాలము సామాన్యముగా. కాని ఏ శుక భీష్మాదులనో విడిచినచో మిగిలిన వారందరూ త్యాగ రాజన్నట్లు కామదాసులుగానే యున్నారు—కాని యట్లని ఈ శాస్త్ర సంప్రదాయమును తెలి

యక దీని నన్నిటివలె వ్యాఖ్యానింప జనదని ఇంతటితో ఈ విష యమును సంక్షేపించుచున్నాను. విషయము పరిజ్ఞులు గుర్తించె దరుగాక.

ఇచ్చట శ్వేతకేతు వృత్తాంత మిందు విశేషముగా చెప్ప బడియున్నది. శ్వేతకేతు శాసనము లేకున్నయపుడు స్వపరయోషి ద్భేదమే లేదని ఇందు చెప్పబడియున్నది. అందులకే జబాలభర ద్వాజాది మహర్షుల తల్లుల నింద్య చరిత్రలుగా నాడు గణింపంబడి నారని బాభ్రవ్యుని మతము. వారింపరాని స్త్రీ స్వాతంత్ర్య మును గూర్చియూ చక్కగా చెప్పియున్నాడు. "యతోఽతీవ పరా ప్రీతి దుర్లభేష్వేవ వస్తుషు, పరకీయ్యాపునస్సర్వానాయ కానుహిదుర్లభా" అను మానవుని నవ్యప్రీతిని గురించి తడవి యున్నాడు. నేటి కిది మిక్కిలి విడ్డూరముగా కనుపడ వచ్చును. నాటి ధర్మము నాటి మానవ సంఘ మర్యాద లిపుడు లేవు. ఈ నాటి ధర్మము లానాడు ప్రసక్తిలోనికిరావు. రాజా లవు. పుట్టనవానికి పూసలు గట్టు టెట్లు?

క. అతిథి విను గోరె నేనియు
మతి కింకిరిపడక యోలమానపడక నీ
పతికి ప్రియంబు పలుపుము
సతికిన్ పతి వనుపజేయు టుచితంబరయన్
(భారతము శాంతిపర్వము)

ఇట్టి యతిథి పూజా వ్రతపరాయణులను మనమిపుడు తడవి తద్గుణదోష విచారమును జేయబూనిన అర్థము లేదు. నా డట్టి నియమ నిరతి యుండినదని మనము తలంచుటకీ పై పద్యము పనికి వచ్చును. అట్లే బాభ్రవ్య మతమునగల కొన్ని విషయములు నాటికి ధర్మములై చెల్లినట్లు తెలియుచున్నది. నేటి కవ్వానిలో "ఆ శ్వేతకేతుకాలస్య ఆచారో భూన్నిరంకుశః" అని బాభ్రవ్యు డన్నట్లు శ్వేతకేతు శాసనమువరకూ ఇట్టిది నిరంకు శాచారమై యుండవోపును. కాని మొత్తము ఇట్టిది సంఘ మంతయూ స్వేచ్ఛాప్రవృత్తిగాయున్నదనుటకు ఎట్లువచ్చును? మరియు "ఋషిభిర్యదనుష్ఠితం కర్మ తన్నానుష్ఠేయం మను ష్యైః; యదుక్తం త త్కర్తవ్యం" అని విద్యారణ్యయోగు లన్నట్లు ఋషి శాసనముల కా నాడెక్కువ విలువయేగాని ఋషులు ప్రవర్తించినట్లు సామాన్య మానవులు ప్రవర్తించుట నాటికిని నేటికిని ఎట్టివారికైననూ సాధ్యము కానిపని. "ఇదానీంతన కాలీన దృశా జుగుప్సనింద్యతాం" అని బాభ్రవ్యుడే స్పష్టీకరించెను. వాడది యొక యాచారముగా సంఘములో కొందరిచే ఆచరింపబడుట కనుజ్ఞ యుండవచ్చునుగాని విధిగా నిర్దిష్ట ధర్మముగా యుండి నట్లు గానరాదు. మరియు తృతీయపాదము కడపట "యతస్సత్పు రుషస్త్రతగుణీ ప్రకృతి రంజితః" అని సత్పురుషుడైన వానిసాధు వాక్యమునకు గూడ ప్రామాణ్యమును చెప్పియున్నాడు.

ఇక చతుర్థ పాదమున నీ శాస్త్రపు ఫలశ్రుతిని వర్ణించి యున్నాడనవచ్చును. "కాంతాకుచాద్రి సంచార జంఘాలం పౌరుషం మనః తన్మందవాన పుష్పేషు మధుశీత్వా ముహు ర్ముహుః ...................తదిదం మానుషే లోకేఽమృతం దుష్కృతి దుర్లభం" అని ఇహలోక సుఖసారమును గూర్చి యుపన్యసించియున్నాడు.

మరియును "సచ్ఛాస్త్రమాగమం ప్రోక్తం శివేన శివ తాతయే, శివాయై పరహస్యం తత్ అధిగమ్యగురో కులాత్" ఇత్యాది తాంత్రిక నియములను నిరూపించుటచే నిది వైదిక విధియని బాభ్రవ్యుడే చెప్పియుండలే దనుట నిర్వివాదము. కాన నిది తాంత్రికోక్త ధర్మమే యనుట యధార్థము. అదియును "బుద్ధిమా ననువర్తేత సాసిధారావ్రతం కృతి" అని దీనిని కత్తి మీది సాముగా కూడ నిరూపించెను. అంతియేగాక, "నాస్తి త న్మాదకం లోకే స్త్రీసమున్సర్వవస్తుషు' అనికామశాస్త్రపరమసాధన మైన స్త్రీ యొక్క మత్తులోని విశేషమునుగూర్చి కంఠో క్తిగా అంతకన్న వేరు మత్తు పదార్థములోకమున నేదేమియు లేదని చాటెను. కాన పరమదయావీరతంత్రమైన బాభ్రవ్య ఋషి హృదయము సాకకులకీ యాఖరుమాటచే చక్కగా వ్యక్తమగుచున్నది. ఇంకనూ తదితరములైన జాగ్రతల నుపదేశించి "అతి సర్వత్ర వర్జయేత్" ని ముగించియున్నాడు. కాన నిది తంత్రమనుట యధార్థము అయిననూ ఇందువలన తృతీయ పురుషార్థమును గూర్చిన విశేషము లెన్నియో తెలియుచున్నవి. మరియును ఈ గ్రంథమును గూర్చి విపులముగా సమీక్ష చేయ వలసియున్నది. మొత్తము నాల్గు పాదముల చేతనే ముగింప బడుటచేత నిష్కర్షగా ఋషి సాంప్రదాయక బ్రహ్మ విద్యా విశేషమును కూడ నీ గ్రంథము వ్యక్తము చేయుచున్నది.

"ఆ వాత్స్యాయనతంత్ర మా శ్రుతిశ్శిర స్సిద్ధాంతముచ్ఛా వచే విద్యే" అని భట్టపాదులు నిర్వచించినట్లే తంత్రము నిస్సం దేహముగా అవరవిద్యాబోధకముగానూ తత్ప్రతిపాదకముగానూ యున్నది.

మరియును ఈతడు "ప్రజాతి రమృత మానంద ఇత్యు పస్థే" అను నుపనిషద్వాక్యమును పురస్కరించుకొని ఈపురుషార్థ మును ధర్మేతరముకాని రీతిగా సాధింప వలయు ననుటకై "యత స్సత్పురుష స్త్రత ద్గుణీ ప్రకృతి రంజితః" అను మాటతో వ్యక్తము చేసినట్లైనది.

ఇందు ప్రకృతి పాదములో స్త్రీని ప్రకృతి స్థానమున వర్ణించుచూ "ప్రకృతిః బ్రహ్మణః పార్శ్వం య దాలంకురు తే తదా, సుషుప్తి ర్జీవ వద్భావ్య స్వతో వైముఖ్య మంజసా, ప్రపంచ లీలామాతన్వన్ తత్తదావిశ్య సక్షయం, ప్రాప్నోతి పూర్ణవత్ బ్రహ్మ విచిత్ర పరిణామతః, యదాలంబాన్నిర్వికార మపీత్థమవభాసతే, సా స్వ తంత్రేతి కిం వాచ్యా స్వాధీన పతి కేతివా, సాభూత్ స్త్రీ జాతి సర్వస్య మతః స్త్రీణాం స్వతంత్రతా, ఆజన్మసిద్ధా తన్మూలం లోకే తాసాం వివేష్మితం, రతౌ సాద్రసా రాది శృంగార రస గర్భితం, తస్మాత్ రతిః ప్రాక్ ప్రవృత్తేః పితునా త్ర జాయతే, బహుపుంసేవనం చాతః ప్రాకృతం నహి దోష కృత్॥

ఇత్యాదులలోని స్త్రీ స్వాతంత్ర్య ప్రసక్తి బహుపుంసేవన లోని దోష భావత్వము ప్రాకృత ధర్మమన జెల్లునే కాని శాశ్వత ధర్మమనుటకు వీలులేదు. తంత్రమార్గులకును కామ శాస్త్ర పర లకును ఇది యొక ధర్మముగా తోచియుండవచ్చును. అంతియే గాని నిర్దుష్ట ధర్మముగా దలంపజెల్లదు.

భారతమున స్త్రీ స్వాతంత్ర్యమును పారదారికమును స్పష్టముగా నిషేధింపబడినవి.

“క్షి॥ పరదార గమన మెప్పుడు॥”-ఇత్యాదులలో పారదారికమును, “బాల్యమున తండ్రి యవ్వన ప్రాప్తిమగఁడు” ఇత్యాదుల స్త్రీ స్వాతంత్ర్యమును, నిష్కర్షగా పంచమవేదము నిషేధించినది. మరి యును పరదారలలో నీ క్రిందివారు పూర్తిగా నిషేధింపబడి యున్నారు.

“పర దారల యందును వశి
గురు వృద్ధ బాల కులబాంధవ బుధ వా
గరకుల సతులు” పూర్తిగా నిషేధింపబడి యున్నారు.

“శ్రోత్రియుని భార్య నృపు సతి
మిత్రునియొలవాగ మామమెల లాచార్య
క్షేత్రంబగు గురుపత్ని యు
పాత్రములరు తమకు దాము వలచి వచ్చిన నైనన్
(జైమిని భారతం)

ఇట్లు కొంద రెక్కుడుగా భారతాదులయందు నిషేధింపబడి యున్నారు.

కామ శాస్త్రమున పారదారిక మొక యధికరణము. ధర్మ శాస్త్రమున కిది సంపూర్ణముగా విరుద్ధమని వేరుగాచెప్పఁ బనిలేదు. కావున ఇందు సమన్వయ దృష్టి కుదురుట కష్టమే యయి నను లోకశాసకులగు ధర్మశాస్త్రకర్తలు చక్కగ ధర్మ సేతు వును నిర్మించియున్నారు. దాని నిట వ్యాస విస్తృతి భీతిచే తడవ జాలను. మను చరిత్రలో అల్లసానిపెద్దన ప్రవరునిచే ఈ ప్రకార మనిపించియున్నాడు.

శా. ఈ పాండిత్యము నీకు దక్కమరి యొందేగంటిమే కామశా
స్త్రోపాధ్యాయుని నావచించెదవు మేలోహో త్రయీ ధర్మ
ముల్ పాపంబుల్ రతి పుణ్యమంచునికనే లాతర్కముల్ మోక్ష
లక్ష్మీసత్యాగమసూత్రపంక్తి కివెపో మీసాంప్రదాయార్థముల్

అని ధర్మ శాస్త్రీయ విరోధమును చూపియున్నాడు.

లోకము బహుమార్గగామి. అందు తంత్రమార్గమొకటి చిరకాలముగా పెక్కురు చనుచుండు దారి. ఆ కాలమున ఆ మార్గ మున నడచువారిని గూర్చి బాభ్రవ్యుడు చెప్పియుండవచ్చును. అంతియేగాని ఇట్టిది పరమధర్మముగా పూర్వము భరత వర్ష మున వెలసియుండినదని మన మూహించుటకు వీలులేదు.

ఇంకను గహనమగు ధర్మ సూక్ష్మములను సావధాన ముగా పరామర్శ చేయవలయునుగాని యథేచ్ఛగా ఇట్టివాని విష యమున వృథాభిమాన వ్యాఖ్యానములు చేయఁ జెల్లదుగదా!

అర్థకామ పరణులకును ధర్మమోక్ష పరణులకును గల పరస్పర భేదములు ఆలోచించుకొలదియు తత్త్వశాస్త్ర సంస్కా రములకొలదియు గోచరించుచుండును. “మాంససాంచాలి కాయాస్త యంత్రలోలే. నవంజరే స్నాయ్వస్థి గ్రంధి శాలిన్య స్త్రియః కిమితి శోభనం” అన్న వేదాంతుల మాటల కిందెంత వరకు ప్రవేశముండును? ఇది సంపూర్ణ నివృత్తిపరుల మాట.

“జాయా వా స్యా జ్జనిత్రీ వా
సంభవః స్త్రీ కృతో నృణాం,
హే కృతఘ్నాస్తయోర్నిందాం
కుర్వతాం వః కుతస్సుఖమ్”

అన్నవరాహమిహిరుని మాట స్త్రీ నిందాపరులకు చక్కని జవాబుగా యున్నది.

“జయే ధరిత్ర్యాః పురమేవ సారం
పురేగృహం సద్మని చైకదేశః
తత్రాపి శయ్యాశయనే వరా స్త్రీ
రత్నోజ్జ్వలా రాజ్యసుఖస్య సారః.
(బృహత్సంహిత)

ఇది ఇహఫలసారజ్ఞులమాట. ఇందు పరము సన్వేషించు తీరును మహనీయ్యులగు తాత్వికు లుపదేశించియే యున్నారు.

కాన సహృదయులగు పండితు లీ బాభ్రవ్యుని స్మర దర్శన సరణిని, అందు గల మూల ప్రకృతి స్వభావ ధర్మము లను ధర్మ సూక్ష్మములను గని యానందింతురుగాక. వ్యాస విస్తృతి భీతిచే పెక్కు ముఖ్య విషయములను వ్రాయ వలసి యుండియు సంక్షేపించ వలసినవాడ నైతిని. హంస కిరణావళి ప్రశంసా సందర్భమున వానిని గూర్చి విపులముగా వ్రాయ దలంచితిని.

త్రివర్గ సిద్ధాంతవాదులును చతుర్వర్గ సిద్ధాంత తత్త్వవేదులును ఇందును గూర్చి విచారింపవలసి యున్నది. ఇహపరసుఖముల సమ్మేళన సంపుటియే చతుర్వర్గ స్వరూ పము. ఈ చతుర్వర్గములలోని నాలవదానిని (మోక్ష మను దానిని) ముందున్న త్రివర్గములయందే యున్నదని త్రివర్గ వాదులు తలంచినారు. మోక్షము లేదనలేదు. “ఋణం కృత్వా ఘృతంపిబేత్”అను నాస్తికులు కారు. నాస్తిక దృక్పథమునఁ గల కామశాస్త్రము వేరు. దానికిని దీనికిని నిసుమాత్రమును సంబం ధము లేదు. కాన సారజ్ఞుఁడగు బాభ్రవ్యమహర్షి కామశాస్త్ర మూలరహస్యములను సశాస్త్రీయముగా ఇందు చర్చించి నిరూపించినాఁడని చెప్పి ఇంతటితో విరమించుచున్నాను.

# చాటువులు

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

వయసు చెల్లినదనుచు విద్వాంసుఁడెపుడు
చదువులను మానఁడది వాని సహజగుణము
దానిఫలితము వానిమూలాన లాఁతి
వారలకు దక్కుచుండు నివ్వసుధలోన

అందమగు భార్య, యింటిలో నతనికున్నఁ
బరుల యువతులకోసమే ప్రాఁకులాడు;
నూరఁజెరువున నిండిన నీరు విడిచి
కడవలో నీళ్ళ ముట్టును గాదె కాకి!

మొగము చూడఁగఁ దామరపువ్వు, నోటి
మాట చల్లఁదనాలకు మూట; కాని
హృదయమునమాత్ర మగ్గిపెల్లొదవి పొగలు
సెగలు గ్రక్కుచు బగ్గము చేసివిడుచు

పరమ మూర్ఖుఁడు—సర్వము నెఱుఁగువాఁడు
హాయిగా నుందురీలోకమందు; వారి
లోనఁజేరని వారికెన్నని చిక్కు-
లొదవి చీకాకు పఱచుచు నుండునయ్య

మబ్బులాగుబ్బుగాఁ బ్రబ్బిమఱునిమేష
మునకె విప్పారుచును విడిపోవునల్లె
ధన మదెక్కడనుండియో తరలివచ్చి
మొగము చూపించిపోవు టద్భుతముగాదె!

వస్తువొక్కటియే చూచువానిఁ బట్టి
భిన్నమార్గంబులోఁ గనిపింపవచ్చు;
కాని, ప్రేమించు యువతినిగాంచి యోగి
నీరసంబగు శవముగా నిర్ణయించు

కమికెఁ డన్నము పెట్టి వశ్యముగఁ జేసి
కానును మనుజుని లోకజ్ఞుఁ డనవరతము
ముగములో 'భోణమును' గొంతముందుఁ గొట్టి
పలుకు పలికించు మద్దెలవలన నరుఁడు

ఆస్తిపాస్తులు మన వెంట నంటిరావు
వానికోసము చూచెడివారు వేఱు;
పుణ్యపాపములే మనపొత్తు విడువ
నట్టి చుట్టాలుగాఁ గనుపట్టుచుండు

వినయ మెఱుఁగని చదువులా మనుజు నెపుడు
పైకి రానీయ వనుట నిబద్ధిసుమ్ము!
చదువు వినయము జంటగాఁ గుదిరియున్న
మనుజుఁడన్నిట ధన్యుఁడై వినుతికెక్కు

కష్టములువచ్చి దుఃఖమే కలుగనిమ్ము;
దానికై బెంగపడక నిదానముగను
మఱచిపోవుటె దానికి మంచిమందు
దాని గుర్తించువాఁడె యుత్తముఁడు భువిని

గ్రామకరణము—వెలయాలు—రాజు—దొంగ
యముఁడు—వహ్ని—పురోహితుఁ—డర్భకులును
బరుల దుఃఖము గుర్తించుటరుదు; వీరి
మన్ననలు పొందఁగలవాఁడు మహిని లేఁడు

లోభియగువాఁడు శవములలోన లెక్క
చచ్చి గీపెట్టినను జేత బిచ్చమైనఁ
బెట్టఁడతఁడు కండలు పెంచుకొంచుఁ
దుదకుఁ గాకులకింతగా ముదముగూర్చు

శునకమా! జంతువులలోన క్షుద్రమైన
దాన నని బెంగపడఁబోకు; నేను నిన్ను
మించువాఁడ నటంచు గర్వించు నొకఁడు
కలఁడు భువిని కృతఘ్నతా ఘనుఁడు నరుఁడు

ఓసిదారిద్ర్యమా! 'సిద్ధి' యొదవి నేను
నీదు మూలాన ధన్యుఁడ నేదునిఁక;
నాకు నందఱుఁగనిపింత్రు లోకమందు
నేను గనిపింప నెవనికిఁగాని నిజము

తన్నశరీరము చక్కనిదనుచుఁగులుకు
కొనఁగ మృత్యువుగాంచి నవ్వును గదన్న!
తనకుఁ బాలమున్నదని లోభమునమునుంగు
వాని భూదేవి నవ్వుల పాలుచేయు.

ఆలుమగలన్నదమ్ము లన్యోన్యముగను
గలహమునమున్గి భిన్నమార్గములఁ బోయి
తుదకుఁ గలియఁగవచ్చు; నీవిధములాఁతి
జనములోఁ జూడఁబోము కారణమదేమొ!

కొంపలో నుప్పు పప్పులు కూరనార
నిండుకొని యున్నవని దిగులుండెనేని
యెంత మేధావియైన రవ్వంతగాని
తెలివితేటలు చూపలేఁ డిలను నిజము

ఓసి దారిద్ర్యమా! మంచి యోర్పు నేర్పు
గలుగు గుణవంతునే పట్టఁగలవు నీవు
గుణము తలుగైనచోట నీ మనసు పోదు;
నీవు నెఱజాణవేసుమా! నిశ్చయముగ

ఆదరం బెంతయున్న నాహ్వానమున్నఁ
జీటిమాటికిఁ బోయి భజింపరాదు;
నాకమేలెడి దేవేంద్రుఁ డంతవాఁడె
యట్టిదశలోనఁ దేలికయగుట ధ్రువము

వాఁడు నీరోగియైన విద్వాంసుఁడైన
సజ్జన స్నేహము గడింపఁ జాలియున్నఁ
జాలు; నిఁక వేఱె భాగ్య భోగ్యాలు వేలు
లక్షలవియేల! ధన్యుఁడే యతఁడౌరాల

# నన్నయపదప్రయోగకోశము : సమగ్ర సమీక్ష

శ్రీ సూరి మల్లినాథం

నన్నయ పదప్రయోగకోశము ప్రచురించుట ఆంధ్ర సారస్వతములో నిజమైన కృషికిది మహాప్రారంభము. భాషాస్వరూప స్వభావములను విస్పష్టముగా నెఱుగుట కిట్టి కోశములు ఎంతేని యవసరము. ఆయా కవుల భాషా స్వరూప స్వభావములు, ఆయా యుగపు కవులలోనే భాషా విషయమున గల భేద సాదృశ్యములు తర్వాతి యుగములలో సంభవించిన పరిణామములు వీని నన్నింటిని సూక్ష్మముగా, కూలంకషముగా తెలిసికొనుటకు ఇట్టికోశము లున్నపుడు మాత్రమే సాధ్యపడును. ఒక వ్యాకరణాంశమునందు, ఒక పదముయొక్క అర్థము నందలి వైచిత్రి నెఱుంగుటకు గ్రంథము నామూలాగ్రమును వెదకి వెదకి వేసరవలసిన అవసర మిట్టి కోశములు లేకుండ చేయును. ఆ ప్రయోగము లన్నియు క్రమపద్ధతిలో కూర్చుటవల్ల పరిశోధకుల పని మరింత తొంబది వంతులు తేలికపడును.

మరి యీ పని నిర్వహింపవలెనన్న నే యొక రిద్దఱి కృషియో చాలదు. సాహిత్య ఎకాడమీ వంటి గొప్ప సంస్థలు పూనుకొన్నప్పుడు మాత్రమే యిట్టి పనులు సఫలమగును. ఈ కోశమును ప్రకటించుట సాహిత్యఎకాడమీ నిర్వహించిన కార్యము లన్నింట మిన్న యని చెప్పవచ్చును.

ఈ కోశమునకు సంపాదకులైన శ్రీ అబ్బూరి రామకృష్ణరావుగారు, డా. దివాకర్ల వేంకటావధాని M. P. Phd గారును సుప్రసిద్ధులు. అనుభవశాలులు. వారి సంపాదకత్వమున ఈ కోశము వెల్వడుట చాల గొప్పసంగతి. మరి శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి పాండిత్యము, శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తిగారి భాషావైదుష్యమును సమకూడుటవల్ల నీ మహా ప్రారంభమునకు సాధన సంపత్తి సంపూర్ణముగా నున్నట్లే మనము భావించవచ్చును. దీనికి తోడు పలువురు జిజ్ఞాసువులు పండితులు కూడ ఈ కోశ నిర్మాణమందు తోడ్పడినారు.

ఈ కోశమువల్ల ముఖ్యముగా నెఱవేరవలసిన ప్రయోజనములు మూడు.

1. వ్యాకరణ విషయకము, 2. భాషాశాస్త్ర విషయకము, 3. శబ్దార్థ విషయకము.

ఈ మూడు ప్రయోజనములను దృష్టిలో పెట్టుకొని ఆయా యారోపములను వాని క్రిందికి వచ్చు ప్రయోగములను కూర్చవలయును. ఈ విషయములనుగురించి అసందిగ్ధముగా నిర్ణయించుకొనుటకు వీలుగా నాయా ప్రయోగములను ఖండించి యీయవలెను. ఎంతయో శ్రద్ధ, ఓర్పు, ఆసక్తి, పాండితీ వివేకములు, అనుభవమున్న గాని యిట్టి కోశములను సమగ్రముగా, నిర్దుష్టముగా నిర్మించుటకు సాధ్యపడదు. ఇది త్వరత్వరగా చేయదగ్గ పని కాదు. నెమ్మదిగా మిక్కిలి శ్రమించి చేయదగ్గ పని. ఈ పైన చెప్పిన గుణము లన్నియు నున్నప్పటికి యీ పనియందు కొన్ని ప్రమాదములు తప్పవు. ఇది దేశమునకు సంబంధించిన విషయము, భాషకు సంబంధించినవిషయము కాబట్టి దీనిలో దొరలిన స్ఖాలిత్యములను ఎత్తిచూపుటయందు ప్రయోజన ముండును. ఈ కోశమునందున్న బహుగుణములను చెప్పవలసిన యవసరము లేదు. అసలీ కోశమును గ్రథనము చేయుటకు బూనుకొనుటయే యొక గొప్పగుణము. కోశకారులయొక్క శ్రద్ధాపాండిత్యాదిగుణములు, వారు పడ్డశ్రమ మిక్కిలి ప్రశంసనీయములు. కొన్ని యారోపములను వాని క్రింది ప్రయోగములను గూర్చిన పద్ధతి చాల ప్రశంసనీయముగా నున్నది. ఈ కోశము గుణబహుళమైనదే. కాని కొన్ని దోషము లిందులో దొరలినవి. ఈ కోశమును ఆద్యంతము శ్రద్ధగా పరిశీలించగా కొన్నిమార్పులు చేర్పులు చేయుట అవసరమని తోచినది. వాని నీ క్రింద వివరించుచున్నాను.

"అ"—ఈ ఆరోపమునందు ప్రయోగములన్నియు చేరలేదు.

---

ఉదాహరణకు :—

(1) గురుపత్ని నేడ యక్కుండలంబులు దొడ్గు దివసము

(2) అంత నయ్యర్జునుండు నన్నింటి సమీపంబునకువచ్చి.

(3) అయ్యుధిష్ఠిరు డంతన్.

(4) అయ్యక్షహృదయ సామర్థ్యంబున.

"అ—" ఈ ఆరోపమునందు కూడ ప్రయోగము లన్నియు చేరలేదు.

| | |
|---|---|
| ఉదా:—వరుణు నంతియ బలవంతుండు | 2.1.13 |
| అంతియ కడు దక్షుడు | 1.4.169 |
| యమరాజ సభ యంతియ | 2.1.71 |
| అంతియ జూదంబునందు | 3.2.63 |
| నాయొద్దన నుండుడు | 1.5.61 |

ఈ చివరి ప్రయోగమునం దేవార్థకము మీద ద్రుతము చూపబడ్డది.

**"అంటే"**—ఇచ్చిన ప్రయోగములనుబట్టి ఏది యుత్తమ పురుషయో, ఏది మధ్యమ పురుషయో తెలిసి కొనుటకు వీలులేదు. ఉత్తమ పురుష యైనపుడు హలవసానపరకత్వమున ద్రుతము జారి పోయిన సందర్భములు, మధ్యమ పురుష క్రియలతో కలిపి ఒక్కటే ఆరోపము కూర్చుటవల్ల వచ్చు చిక్కు యిది. ఉత్తమపురుష యని యెఱుంగుటకు తగినట్లుగా ప్రయోగములు ఖండించి యీయవలసినది.

**"అంద"** — సరస్వతీ సముదయములయంద స్నానముల ఫలములగున్ 3.2.283 మొదలగు ప్రయోగ ములు చేరలేదు.

"అన"—ఈ ఆరోపములో ఉత్ప్రేక్షావాచకములు వేఱుగను, అనంతర్యార్థకములు వేఱుగను చూపలేదు.

ఆహవనీయంబనవెల్గినట్లు—దంభోళిశల్యంబన—మొ॥గు ప్రయోగములందు "అన" ఉత్ప్రేక్షా వాచకము.

అనవిని ధృతరాష్ట్రుండు మొ॥గు అనంతర్యార్థక ప్రయోగములతో కలిపి వీని నిచ్చిరి.

"అని" లోకూడ అర్థభేదమునుబట్టి ప్రయోగములు కూర్చలేదు. "చెప్పి" అను నర్థమందున్న ప్రయోగములు, ఇత్యర్థక ప్రయోగములు వేఱుగా నీయవలసినది.

"అనియె"—సరిగాదనియే నగతున. ఇచ్చట "ఏను" అని పదవిచ్ఛేదము చేయుటకు వీలున్నది. ఇది ఏవార్థకమని భావించినపుడు 'ఏ' లోకూడ చేర్చవలసినది. అట్లుచేర్చలేదు. అనుచులోకూడ అర్థభేదము బట్టి ప్రయోగములీయలేదు.

"అపేక్షించి"—'సాగరసుత పరిక్షయం బపేక్షించి యుండునంత' 3-3-60 అనుప్రయోగ మీబడినది. "తత్స మయ సమాగమం బపేక్షించు యుండునంత" 1—2—188 అనుప్రయోగము" "అపేక్షించి యుండున్" అనునారోపము నందుచూపబడెను. దీనిని 'అపేక్షించి'లో చేర్చకపోవుటకును 3—3—60 ప్రయోగమును 'అపేక్షించియుండు' నన్న ఆరోపములో చేర్చకపోవుటకును కారణము మృగ్యము.

"అమర"—'అవిహితమగునట్లు సేయు మమర మునీంద్రా!, 3.3.27.

ఈ ప్రయోగమునం దమర శబ్దము తెలుగేయని కచ్చితముగా చెప్పుటకు వీలున్నదా?

"అయ్యె"—నామములకు, క్రియలకు పరమైన సందర్భములు వేఱు వేఱుగా చూపవలసినది.

'ఆడి'—పలికి, స్నానముచేసి, క్రీడించి—అను వర్థభేదములనుబట్టి విడి విడిగా ప్రయోగములు కూర్చలేదు.

"ఎగ్గులాడి"-1-8-138.

"జూదమాడి" 3-2.224.

"తీర్థంబాడి"—3.2.249—అన్నియు కలిపియే చూపబడినవి.

'ఆదిగా'—ఒకటే ప్రయోగ మీయబడినది. బహు ప్రయోగము లుండగా వాని నెందుకు వదలిరో.

ఆదిగ, ఆదిగాన్, ఆదిగన్ మొ.గు ప్రయోగములు నన్నయ భారతమున సమృద్ధిగా కలవు. వాని కారోపము లీయలేదు.

గాయకులును వాదిగా గలుగు—1.1.8.
ఆదిగాగల వేవురు—1.2.4.
ఆదిగాగల మహామునులు 1. 2. 211.
కౌరవేంద్రుడాది గాఁగల భూపతులెల్లన్ 1.7.189.
పృథుశ్రవసు డాదిగాఁగల వీరుల్ 1.8.198.
జంబూషండ వినిర్మాణంబాదిగ 1.1.46.
యాదవులాదిగ రాజసుతులు 1.5.192.
ఆదిగఁ గల వస్తువులు 1.4.151.
రాజసూయముఖ మాదిగ సధ్వరపంక్తి 1.8.5.

అగ్నేయాస్త్రంబాదిగా ననేక దివ్యబాణంబులు వడసి 1.5. 196. మొ॥ గు. ప్రయోగము లెన్నియోయున్నవి. వీనికి ఆదిగాఁ, ఆదిగ, ఆదిగఁ, ఆదిగన్, ఆదిగాన్ అను ఆరోపములుకూర్చవలసియుండగా నొక్క 'ఆదిగా' అని మాత్రమే ఆరోపమిచ్చి, దానిక్రింద నొకే యొక ప్రయోగమిచ్చినారు.

'ఎడ'—హృదయము, ఎడము, ప్రదేశము మొదలైన యర్థములలో ప్రయోగములు వేరు వేరుగా కూర్చలేదు. తక్కిన యర్థములందు భేదము ఛాయామాత్రమే యైనను హృదయార్థమున 'ఎడ' భిన్న శబ్దమే. ఎడ—ప్రదేశార్థమున, సమయార్థమున, ఎడల కు సంక్షిప్త రూపము. హృదయార్థమున ఎడదకు సంక్షిప్తరూపము. ఈ భేదమును పాటించకపోవుట దోషమనక తప్పదు. ఎడ కు సంబంధించిన ఆరోపము లన్నింటికి కూడ ఈ భేదము పాటింపబడలేదు గావున దీనిని ప్రామాదిక మనుటకు వీలులేదు. "అని" - విషయములో నర్థభేదమును బట్టి ఆరోపమిచ్చినవు డిచటఎందుకీయలేదో దురూహముగా నున్నది.

'ఎల్ల'—'పాములకెల్ల యల్గిరి నీవు' 1.1.184.
యాదవకళత్రముల నెల్ల దోడ్కొని 1.1.65

అచటి రాలెల్ల బెల్లనుగ్గయ్యె—1.6.284.

ఎల్లన్ ద్రుతాంతంబైన అవ్యయము. ఈ పై ప్రయోగములలో రెండింట ఎల్ల—కళగా చూపబడినది. మొదటి ప్రయోగమునందు ఎల్ల ద్రుత ప్రకృతికమైన పక్షమున యడాగమము రాదు. రెండవ ప్రయోగమునందు 'ఎల్ల' కళయైన పక్షములో సరళాదేశము అర్థానుస్వారము రావు. మూడవ ప్రయోగములో ఎల్లద్రుతప్రకృతికముకానిచో సరళాదేశము రాగూడదు. ద్రుతప్రకృతికమనుకొన్నచో అర్థానుస్వారాదులు కూడ రావలసి

యుండును. ఈ మూడు ప్రయోగములను ఎల్ల క్రింద నివ్వుట దోషము. మఱియు ఈ ఆరోపముక్రింద నిచ్చిన ప్రయోగములు సమాసగతమునకు వేఱుగా, వ్యస్తమునకు వేఱుగా కూర్చవలసినది.

"ఎల్లయందు" అని ప్రత్యేకారోపము చూపవలసినది. ఎఱిఁగె సకలశాస్త్రంబుల నెల్లయందు 1.2.123.

"ఎవ్వడు, ఎవ్వరు"—ఈ ఆరోపములకు వీనికి సంబంధించినవానికి ప్రశ్నార్థకములు, అన్యార్థకములు—విడివిడిగా చూపవలసినది.

"ఏ"—కరుణాకరులై రక్షించు పురుష కారాన్వితులే 3.1.137. ఇచ్చట ఏ—ఏవకారార్థకము. ప్రశ్నార్థకము, ఏవకారార్థకము విడిగా నీవలసినది.

'ఏది'—ప్రశ్నార్థక సర్వనామములు వేఱుగను, వ్యతిరేకార్థమునకు వేఱుగను ఆరోపములు కూర్చిరి. "ఈయుర్వినింక నేది ధర్మువు—నిగ్రహమేది" ఇది బాగుగనే యున్నదికాని "ఏటి" నది యన్న అర్థమందు, ఏమి యన్న అర్థమందు ఒకే ఆరోపము కూర్చుట ఏటి న్యాయము.

అనఘ ఇదియేటి తపము 1.2.143.

ఒక్క సెలయేటి కెలన 1.3.155

మొదటిది ఏమి యొక్క రూపాంతరము. రెండవది ఏఱు యొక్క షష్ఠీవిభక్తిక రూపము.

'ఏని'లో—ఇట్టి లతాలలితాంగి చూచియే నెఱిఁగ 1.7.74. అట్టిశబ్దమువిని మునీశ్వర ఏనెఱింగన్ 3.3.107.

ఈ రెండు ప్రయోగములలో ఏని—ఏను—అని పదచ్ఛేదము చేయవచ్చును. ఏని యన్నపదచ్ఛేదమునే కోశకారులభిమానించినట్లు కన్పడుచున్నది. ఈ రెండు ప్రయోగములు, 'ఏన్' వేఱ ఆరోపముకూర్చి యీ వలసినది.

ఏమధర్మపథంబున నున్నవాడ నేల తొలంగుదు—

దీనిని ఏని క్రింద నెందుకిచ్చినట్లు? ఏను క్రింద నీ ప్రయోగము నీయవలసినది. ఈయలేదు.

"ఏను"—ఎవ్వడేను శరముల నేయు నశ్రమమునన్ 1.7.166. ఇచ్చట ఏను శబ్దమునకు 'ఏని' యని యర్థము. దీనిని ఏని క్రింద విడిగానైనను లేక ప్రత్యేకారోపముగా నైనను ఈయ వలసినది. ఏనులో నిచ్చుట యుక్తముగాదు.

"నీకు నేనసే నమిత్రుండనైతిని—2.1.186. 'ఏల'ను కళగా భావించినచో ఈ ప్రయోగమును నేను క్రింద నీయవలసి యున్నది. అచట నీయలేదు. ఏను క్రింద నిచ్చినారు. మఱి ఏల అన్నది కళగానే ఆరోప మిచ్చినారు.

ఐతేన్:—అని వేఱ ఆరోపమిచ్చి దానిక్రింద "నీవేకవస్త్రనైతేనేమి, విగతవస్త్ర నైతేనేమి" అని ఒక్కటే పాఠాంతర ప్రయోగ మిచ్చిరి. ఈ ప్రయోగమును ఏని—క్రింద కూడ చూపించిరి. ఈ దృష్ట్య ఏన్— అను ఆరోపమును కూర్చి యుండుట అవసరము కదా.

"నీ వేకవస్త్ర నైతేమి" అన్న ప్రయోగమున కర్థము కుదురునట్లు కన్పించదు.

కౌటమ:—భువనములు వెలిగెను నీ పుద్ధవ మౌటమ— అని యీ బడ్డది. గణభంగము దుర్వారము.

కడగాలు—అని ఆరోపమిచ్చి కడగాళ్ళు—అని ప్రయోగ మీబడ్డది. ఆ రోపము కూడ బహువచనమందే చూపవలసినది.

'కల'—చేయుంగలవారము—ఈఁ గలవాడను—కావంగల వారము మొదలగు ప్రయోగములందు 'కల' భవిష్యదర్థము నందును ప్రయుక్తము. కీర్తి కల—శీలముగల మొదలగు ప్రయోగములదు 'కలిగిన' యను అర్థమునందు ప్రయుక్తము. వీనిని విడి విడిగా కూర్చియుండవలసినది.

'కాన్'—అగు ధాతువుయొక్క నుబ్యంతము
ఉండదుగా ధనమెట్టి వారికిన్—2.1.32.
వనువవుగా రాచకార్యభారము దాల్ప—2.1.41.
చోరుల రక్షింపరుగా వారలచే ధనముగొని—2.1.42.
సమయాతిక్రమముసేయ సమకట్టరుగా—3.1.97.

ఈ ప్రయోగములయందు 'కా' అగు ధాతువుయొక్క నుబ్యంతమగు 'కాన్' కాజాలదు. ఇది కాదా అనుదాని సంక్షిప్త స్వరూపము. వేరుగా చూపవలసినది.

కాఁడు—తాన చోరులకును దాపికాఁడై—ఇచ్చట కాఁడు వ్యతిరేకక్రియగాదు. తద్ధిత ప్రత్యయము. దీనిని వ్యతిరేక క్రియాస్వరూపము క్రింద నిచ్చిరి. దీనిని పరుల నోడించిన బలిమికాఁడు —2.1.136 తోబాటు చూపవలసినది. దీనికి వేఱే ఆరోపము కూర్చినారు. ఇంతేకాక 'కాఁడు'—అను ఆరోపమును (వ్యతిరేక క్రియాస్వరూపమున) రెండుగా కూర్చుటయు ఆందొక ఆరోపమును 'కాఁడ' కంటె ముందుగా నిచ్చుటయు ఎందులకో తెలియుటలేదు. "కాఁడ"—కంటె 'కాఁడు' ముందిచ్చుట అకారాదిక్రమ విరుద్ధము.

కాక:—నుగతి జనుగాక ఏల శోకింపంగన్—1.3.116.
ఇచ్చట 'కాక'కు కావుత అని యర్థము.
"నాచేత యుపదేశంబు గొన్నవారికి పనిచేయుగాక 1.3.132. ఇదియు నట్టిదే.
"అర్జునునకుగాక, యున్యులకు సేయ శక్యంబె"
"బ్రహ్మ చెయ్డు పరమార్థముగా కదియేల యొండగున్"
ఇచ్చట కాక వ్యతిరేక క్త్వర్థకము. రెంటిని కలగా పులగముగా ఇచ్చుట యుక్తముకాదు. ఇంకను దీనియందర్థ వైచిత్రికలదు.

"అన్నిరిలో గానంగాని శరీరముంగల మహోగ్ర గ్రాహముం"—1.5.258

"కానన్"—క్రింద నిచ్చిరి. కానన్ క్రింద నిచ్చిన రెండు ప్రయోగములలో నొకటి యరణ్యార్థకము. రెండవది దర్శనార్థకము. కానకు అర్థభిన్నత్వమునుబట్టి ఆరోపమును కూర్చి నప్పుడు దీనికెందుకు కూర్చియుండరాదు.

"కాని"—1. వ్యతిరేకార్థక విశేషణము. 2. వికల్పార్థకము. 3. తక్క—యను నర్థము.

"ఇమ్ముగాని యెడల"—1.6.222.
"మూడవభాగమొండె వందర్థ మొండెగాని—2.1.47.
"వానింజూచికాని కుడువ నొల్లను"—

ఈ యీ యర్థములందు విడివిడిగా ప్రయోగములు చూపబడక కలగాపులగముగా చూపబడ్డవి. క్రియా విశేషణములు, నామవిశేషణములు వేఱుగా చూపవలసినవి.

గజ్జిన:—కడుపు దడివికొనుచుఁ గజ్జినఁ బ్రేవిసవ్
3.2.345.

ఆరోపము 'గజ్జిన' అని యిచ్చుట దోషము. ఆ సందర్భమున నచ్చుట అర్ధానుస్వార ముండరాదు. కజ్జినయని ఆరోప మీయలేదు.

"చఱవ", "చఱవఁ" "చఱవన్" "చఱచి":—అన్న ఆరోపముల క్రింద 'వెఱ చఱవ' 'వెఱచఱచి' అను ప్రయోగములు చూపబడినవి. వెఱ + చఱవ—అని విడదీయుట కోశకారుల కిష్టమును కొనవలెను. అప్పు డర్థము కుదురదు. వెఱచి + అఱవ—అప్పుడు మాత్రమే ఈ ప్రయోగములన్నింట అర్థము కుదురును.

ఇట్టి పద విభాగ మిష్టము కానపుడు దీనిని చఱవ—చఱచి క్రిందచూపింపకుండ వెఱచఱవ అని ఏకపదముగనే చూపించి యూరకున్నచో బాగుండెడిది.

'చూరె':—మురలవరప్రసాదమునఁ జూచి సుపుత్రుల పాండురాజు భామరముగ గాంచె—1.5.150.

అని ప్రయోగ మొక్కటే యీయబడినది. దీనియందు చూరెకుబదులు చూచియని తప్పుగా బడ్డది. మఱి చూరె కున్న ప్రయోగ మిది యొక్కటియే. ప్రయోగాంతరాభావమునందు దీనిని గ్రహింపవలసిన యవసరము లేదు. తక్కిన ప్రతులయందు చూచె అని యున్నది. వావిళ్ల ప్రతిలో తిక్కనగారివి రెండు మూడు ప్రయోగములు చూపబడినవి.

"చేయున్", "చేయును":—'ఇట్లు చేయునై తినేని'—ఈ ప్రయోగమునందు 'చేయును'— క్రియ. వ్యతిరేకార్థకము. తుమున్నర్థకము కాదు. దానిని తుమున్నర్థకములతో కలిపి యిచ్చుట దోషము. 'చేయును' అని వేఱ ఆరోపము కూర్ప వలసినది.

"చేసితి":—ఉత్తమ పురుష రూపములలో ద్రుతము జారిపోయినవానిని మధ్యమపురుష రూపములను కలిపి యిచ్చుటవల్ల నేదేదో కొన్నిప్రయోగములలో దెలిసికొనుటకు గ్రంథాపేక్ష కల్గుచున్నది. వానికి వేఱువేఱుగ ఆరోపములు కూర్చుట యుక్తముగా నుండును.

'తోడ':—స్వతంత్ర ప్రయోగములు.

దనుజాధిరాజసుతయు తోడరాగ — 1.3.182.
మొ॥వి వేఱుగా చూపిన బాగుండెడివి.

సుప్రతీకంబు తోడన భగదత్తు చావును—1.1.47.
తోడన్ క్రింద నిచ్చుట దోషము. తోడన క్రింద నీవలసినది.

"తోడన":—తోడన పుట్టు నుత్తమ జ్ఞానము—1.1.158.
తోడనచని—1.3.187.

తోడి—కళింగ దేశంబు సొచ్చునంతఁ దోడి బ్రాహ్మణులు.

తోన—విజనాథు డరిగినఁ దోన జనియె.
ఈ ప్రయోగము లన్నియు తృతీయావిభక్త్యర్థములు కావు. సహార్థకమునందు స్వతంత్రములు. వీనిని విడిగా చూపవలసినది.

'నా'—ఇత్యర్థకము. ఉత్ప్రేక్షా వాచకము—నేను పదమునకు షష్ఠీ విభక్తి రూపము. ఈ మూడర్థములందును ఒక్కటే ఆరోపము కూర్చబడినది. మొదటి రెండర్థములందున్న ప్రయోగములు తొలుతను, మూడవ యర్థమందున్న ప్రయోగములు తర్వాతను నీబడినవి. కాని, మొదట నిచ్చిన ప్రయోగములు రెండర్థములందు విడి విడిగా నీయలేదు. ఉత్ప్రేక్షావాచకమును ఇత్యర్థకమును కలిపి యిచ్చుట యుక్తముకాదు. మరి షష్ఠీ విభక్తియందు కూడ కర్తృప్రథమకువచ్చిన షష్ఠి వేఱు, సంబంధ షష్ఠి వేఱుగా కూర్చి యుండవలసినది.

"ద్వితీయ కవకాద్రి యొకోయిదినా నిజాంగ మూర్తి తముగవెంచి, 3·3—343 అన్న ప్రయోగము ఉత్ప్రేక్షా వాచకములలో చేర్చవలసినది షష్ఠి తరగతిలో చేర్చినారు.

"నాఁడు":—నేఁడు పోవనినాఁడు—లో 'నాఁడు' శబ్దము దినార్థకముకాదు. దీనిని ఒక్కనాడు మొదలైన వానితో కలగాపులగముగా కూర్చినారు.

"నీరిలో":—గ్రంచఱనీరిలో ముంచుము—1.5.166.

ఇచ్చుట గ్రంచఱ అని సరళాదిగా చూపినపదము 'లో' అన్నఆరోపముక్రిందఱ "క్రంచ నీరిలో ముంచుము" అని పరుషాదిగా చూపబడినది. వావిళ్ళ ప్రతిలో ఈ పదము సరళాదిగనే ఈయబడినది. ఇతర ప్రతులలో పరుషాదిగా నీయబడినది. "ఉక్కు" అన్న ఆరోపము క్రింద సరళాదిగ నీయబడినది. "అడంగ" అన్న ఆరోపము క్రిందకూడ సరళాదిగనే యీయబడినది. కాని 'క్రంచఱ' అని ఆరోపము కూర్చి, దానిక్రింద నిదియే ప్రయోగము "ఉక్కడంగఁ గ్రంచఱ" అని అర్ధానుస్వార పూర్వకముగ నీయబడినది. గ్రంచర—అని ఆరోపము కూర్పలేదు. ఈ పదమును సంపాదకులు పరుషాదిగా తలచియున్నచో నా యీ ప్రయోగము అర్ధానుస్వారయుతమైన ఆ యీ ఆరోపముల

క్రింద చేయవలసి యున్నది. వరళాదియని భావించియున్నచో క్రించు అని ఆరోపము చేయక గ్రించు యనునారోపమిచ్చి యుండవలసినది. ఇది పెద్ద దోషమే.

"పడ":—కర్మార్థమునం దనుప్రయుక్తమైన ప్రయోగములు వేఱుగను, ప్రధానక్రియగానున్న ప్రయోగములు వేఱుగను చూపలేదు.

"పడి":—ఇచ్చట కూడ "పడు" క్రిందవిచ్చిన ప్రయోగములు వలెనే కర్మార్థకప్రయోగములు, కర్త్రర్థక ప్రయోగములు కలిపి యీబడినవి. "పదపడి" అన్న ప్రయోగమును కూడ పడి క్రిందనిచ్చినారు. 1.1.69, 1.7.117. 3.1.397 పదపడిలో పడి—పడు ధాతువుయొక్క క్త్వార్థకమని సంపాదకులు భావించి నట్లు కన్పించుచున్నది. వారి కట్లు భావించుట కవ కాశమున్నదో? అట్లు భావింపకున్నచో దీనిని ఈ ప్రయోగమును పడి క్రిందచేర్చి యుండవలసినది కాదు.

"పోవు", "పోయి", "పోయిన":—అను ప్రయుక్త క్రియలు వేఱు, ప్రధాన క్రియలు వేఱుగా ప్రయోగములు చూపిన బాగుండెడిది.

"మంచి":—ఈ ఆరోపముక్రింద రెండుప్రయోగము లీబడి నవి. మొదటిది "పూచిన మంచి యశోకములన్"; ఇచ్చట మంచియన్నది నామ విశేషణము. రెండవది: "ఏగెనుత్తరము మంచిధర్మనిత్యుడు ధర్మజుండు." ఇచ్చట 'మంచి' క్రియావిశేషణము. నామ విశే షణముగాదు. అర్థమునందును భేదమున్నది. రెంటికి నొకటే ఆరోపము కూర్చుట యట్లుంచి ఇచ్చట ఈ పాఠ మిట్లున్నచో ఛందోభంగమగునని కూడ కోశకారులు గమనింపలేదు. దీనిని గుఱించి చివరకు ముచ్చటింతును.

మ్రొగ్గతిల్లబడి:—ఎత్తగా నోపక మ్రొగ్గతిల్లబడి—ఈ ప్రయోగమును పడి లో చూపలేదు.

"రాలె":—రాలె కరకాలతు లొప్పెఁ దటిల్లతాళి—ఇది క్రియా రూపము. ద్రుతాంతము కావలెను. పరుష పర కత్వముచే ద్రుతమున కర్ధానుస్వారము పరుషము నకును సరళాదేశము రావలెను. దీనిని గుఱించి కూడ చివరకు ముచ్చటింతును.

"లో":—వానితో నొక్కటఁ దవంబు సేయుచుండన్—ఈ ప్రయోగమును 'తో' అన్న ఆరోపముక్రింద నిచ్చిరి. ఇది యీ యారోపముక్రింద నిచ్చుటలో సంపాద కుల పరిశీలనాలోపమును తెలియజేయుచున్నది.

"లోదహించుచు", "లోన నేమరకుండవలయుఁ", "మోహమునములోని సహజ వైరివర్గంబున్" ఇత్యాది ప్రయోగములలో "లో" షష్ఠీ ప్రత్యయముకాదు. ఆ యా ఆరోపములక్రింద వీనిని విడిగా చూపవలసి నది.

"వగచి", "వగచుచు":—"కుంతి వగచి వనరుచుండె 1.7.209. యతియకా వగచి యర్జునునకు నమస్క రించి1.8.180. మొదటిప్రయోగమునందు 'వగచి' యన 'దుఃఖించి' యనియు, రెండవ ప్రయోగమునందు 'వగచి'-'తలచి' యనియు నర్థములు. ఇట్లే "దున్నహాక్షుత్పిపాసాశ్రమా కులత్వంబునకు వగచుచు" 3.2.84, "అల్పకాలంబుకావగచుచు" 1-4-112 అను ప్రయోగములందు కూడ అర్థభేదము మునుబట్టి ప్రయోగములకు వేఱువేఱు ఆరోపము లీయవలెను. ఈయలేదు సరే. వేరు వేరుగా కూర్పనైనను లేదు.

"మీ తండ్రికి వగవుడుగువింత"—ఇచ్చట వగన్—అని ఆరోపము గూర్చిరి. దీనిని హలంతముగా కూర్చుటకు హేతువేమో దుర్గ్రాహ్యముగా నున్నది. ఇది అచ్చు తప్పు గాదు. అచ్చు తప్పు లిట్లుండవు. కావున అట్లనుటకు వీలులేదు. పైగా "వగవు" అని వేఱే ఆరోపమిచ్చినారు. వగవుడుగు—ఉత్వసంధి. ఇచ్చట పూర్వ శబ్దము వగన్—అని విడదీసినపుడు కలరూపెఱుంగ—అన్నచోట "రూప్" అని విడదీయ వల యును గదా? మఱి ఇచ్చటనే ఇట్లు విడ దీయుటకుగల హేతువేమో తెలియకున్నది.

"వగవక", "వగవన్":—అర్థభేదమును పాటింపకుండ ప్రయోగము లీబడ్డవి.

"వచ్చు":—ప్రధాన క్రియ, అనుప్రయుక్తక్రియ, క్రియాజన్య విశేషణము వేఱువేఱుగా కూర్పలేదు.

"ఏ యుపాయంబున నుగ్రవనంబున బడయ వచ్చు"—3.1.36.

"అతండు మీ యొద్దకు వేగంబవచ్చు"—3.1.377

"ద్వాపరంబుతోవచ్చు కలింగని' ఈ ప్రయోగము లందు 'వచ్చు' యొక్క ప్రయోగ భిన్నత్వము స్పష్టమే. వీని నన్నింటిని కలిపి యిచ్చిరి.

వలన:—"దాని పోయినవలనన్"

"అయ్యింటివలన పెరవారు చనకుండగన్"

"సత్యమువలనన ములుమావు" మొదలైన ప్రయోగము లందు 'వలన' దిగర్థకము.

"అన్నలవలన నెఱింగి" మొ. గు. ప్రయోగములందు పంచమ్యర్థకము. వీని కవి భిన్నముగా కూర్పలేదు.

"వలను:—"నడి దానిపోయిన వలను మూచు"—ఇత్యాదిప్రయోగములందు వలను దిగర్థకము.

ఇక్కార్యమునకు వలను గలుగు తెఱిగి—మొదలగు ప్రయోగములందు వలను సామర్థ్యార్థకము. ఈ రెంటి నొక గాట గట్టి వేసినారు.

వలువు:—వలువెడలన్ బయల్పడియె. దీని క్రింద నిదొక్కటే ప్రయోగము. వలువ—అని యిచ్చుట విడదీయవలసి యుండగా వల్వు—అనికోశకారలు భావించుటకు హేతువేమోతెలియదు. వలువ–కు రెం డారోపములు కూర్చిరి. రెండవ ఆరోప మెందు కిచ్చినట్లో? ఒకవేళ వలువ+ఆ=అని ఏవకారార్థముతో గూడియున్నట్లు భావించినా రనుకొందమన్న ఆ ప్రయోగము ఏవకారార్థమగు'ఆ' యను నారోపము క్రింద చూపియుండవలయును గదా. అట్లు చూపియుండలేదు.

"వల్లె" :—'వల్లె యని'—అనియే ప్రయోగము కన్పించుచున్నది. 'వల్లె'—యని ప్రయోగము కన్పించుట లేదు. ఆరోపము 'వల్లె యని' యనియె కూర్చుట లెస్స.

"వాడు" :—ప్రథమ పురుషార్థమున క్రియల కనుప్రయుక్తములైన ప్రయోగములు వేఱు, కర్త్రర్థక సర్వనామములు వేఱుగా కూర్చలేదు.

"వాని, వారి" :—ద్వితీయాంతములు, షష్ఠి సమాన గతములు, కర్తృప్రథమకువచ్చిన షష్ఠీ రూపములు వేనికవి విడివిడిగా నీయలేదు.

వాని వక్షము, వాని నీవు,—షష్ఠీ సమాసగతములు. "ఇట్టి చిఱుత వాని నిది పావమనక"—ఇచ్చట ద్వితీయ. "వాని చేసిన యజ్ఞంబు కంటెను"—ఇచ్చట కర్తృప్రథమకు షష్ఠి.

ఈ యన్నియు కలగాపులగముగా నొకేరాశి క్రింద నిచ్చుట యుక్తముకాదు. మఱి "ఇట్టి చిఱుత వాని నిది పావమనక"—ఈ ప్రయోగము వానిన్—అన్నచోట నీయదగినది గదా. 'వాని' క్రింద నెందుకిచ్చినట్లు? "అని నోడినవాని" ఇచ్చట 'వాని'కి పరమైనది హల్లో, అచ్చో తెలిసికొనుటకు గ్రంథము చూడవలెను.

వానియే :—ఈ ప్రయోగము—"ఏ" లో చేరలేదు. "–ఎ" లో నీయబడినది.

"సుమ్ము"—ఇది పక్కము సుమ్మొక పక్కనిచ్చి సింహమ్ముల నెచ్చికోలుఅదె—2.2.181.

ఈ యొక్కటే ప్రయోగ మీబడినది. "చుమ్ము" అన్న ఆరోపముక్రింద దీని నీయకుండుటకు, "సుమ్ము" అని ఆరోపము ప్రత్యేకముగా కూర్చి దానిక్రింద నిచ్చుటకు హేతువు దురూహ్యము. ఈ శబ్దము సకారాదియనుకొన్నచో "చుమ్ము" క్రింద నిచ్చిన ప్రయోగములు—చక్రవర్తి సుమ్ము, భోజనము సుమ్ము మె. వి,—ఇచ్చట నీయవలసినది. చకారాది యనుకొన్నచో దీనిని కూడ 'చుమ్ము' క్రిందనే చూపవలసి యున్నది.

కోశకారులు కోశగ్రథనమునం దనుసరించిన ప్రణాళికను బట్టియే యీ పై దోషములు చూపబడ్డవి. ఇవి కొన్ని ఉదాహరణములు మాత్రమే. ఇట్టి వింకనున్నవి. ఈ వ్రాయునది సమీక్ష యగుటవల్ల వాని నిచ్చుట కూలంకషముగా చర్చించుటకు వీలులేదు.

కోశకారులు కొన్ని యారోపముల విషయమున నర్థభేదమును బట్టి, వ్యాకరణమును బట్టి, ప్రయోగములు కూర్చిరి. కొన్నిచోట్ల నొకే శబ్దమునకు అర్థభేదమును, వ్యాకరణ భేదమును బట్టి భిన్నారోపమును కూర్చిరి. కాని యీ నియమము కోశమం దంతటను పాటింపబడలేదు. కొన్ని యారోపములు "అందు", "అంత", "అగు"—మొదలగునవి వ్యాకరణవిషయికభిన్నత్వమును బట్టి ప్రయోగములు లెస్సగా విభజించి యీబడ్డవి. కాని "నా, నీ, వాని, వారి, వలన, లో," మొదలగు ఆరోపముల విషయమున ఈ నియమము పాటింపబడలేదు. "ఏది" ప్రశ్నార్థక సర్వనామములకు వేఱుగను వ్యతిరేకార్థక సర్వనామములకు వేఱుగను నారోపములు కూర్చిరి.

ఇట్లే "కాదు, అని" మొదలైనవాని విషయములో నర్థభేదమును బట్టి ఆరోపములు వేఱుగా కూర్చిరి. ఈ నియమము "నిటి, ఏడ, ఆడి, వలను, నగవక, నగవి, నగచుచు" మొదలైనవాని విషయములలో పాటింపలేదు. వాని కర్థభేదమునబట్టి భిన్నారోపములు కూర్చలేదు సరియేగదా ప్రయోగములను గూడ విభజించి యీయలేదు.

మఱి ప్రయోగముల నిచ్చుట—

ఇట్టి కోశములను కూర్చునపుడు శ్రద్ధ వహింపవలసినది ప్రధానముగా ప్రయోగముల నసందిగ్ధముగా నిచ్చుట యందు. ఒక ఆరోపమునందిచ్చు ప్రయోగము పద్యము నందలిదో, గద్యము నందలిదో, పద్యమైనచో నది యే పద్యమో తెలిసికొనుటకు నా యిచ్చిన ప్రయోగమును బట్టి ఆ పదముయొక్క గాని, పదాంశముయొక్క గాని యర్థ వ్యాకరణ విశేషములు మూలాపేక్ష లేకుండ నిశ్చయించుకొనుటకును వీలుగా నా ప్రయోగ మీబడవలెను. పద్యములోని ప్రయోగము నెట్లు ఖండించవలెను, గద్యమందలి దెట్లు ఖండించవలెను, పద్యమైనచో యతిప్రాసస్థానము లందున్న శబ్దములను నుదాహరించు సందర్భముల నెట్లు ఖండింపవలెనన్నది చాల చిక్కులతో గూడిన విషయము. ప్రయోగములు ఖండించి యిచ్చిన తీరుచూడగా ప్రయోగముల నేరుటలో వలసినంత యనుభవము లేనివారు కూడ నీపనిలో నియుక్తులైన ట్లనుకొనవలసి వచ్చుచున్నది. బహుప్రయోగములలో నాయా పద పదాంశముల యొక్క వ్యాకరణాది విశేషాంశములు నిర్ణయించుటకు మూలగ్రంథము చూడవలసి వచ్చుచున్నది. ఒకే ప్రయోగము పలుచోట్ల పలువిధములుగా ఖండించి యీయబడినది. విస్తరభీతిచే నుదాహరించుట లేదు. మరి ఆయా ఆరోపముల క్రింద నీవలసిన ప్రయోగము లన్నియు నీబడలేదు. ఒక ఆరోపము క్రింద నీదగ్గ దింకొక ఆరోపము క్రింద నిచ్చుట, కొన్ని అన

తీయకుండుట జరిగినది. వానిలో కొన్నింటిని ఆయా సందర్భములం దుదాహరించి యున్నాము.

మఱి యీ కోశము కూర్చుటకు కోశకారు లనుసరించినది వావిళ్లప్రతి. పర్యాశ్వాస పద్య సంఖ్య నిచ్చుటకేదేని ప్రతి ననుసరించుట తప్పదు. వావిళ్ల ప్రతినే యనుసరించుటలోని యాంతర్య మేమో సంపాదకులు వివరింపవలసినది. వావిళ్ల ప్రతులనే తీసుకొనుటవల్ల తక్కిన ప్రతుల పాఠాంతరములను తిరస్కరించినట్లయినది. వావిళ్ల ప్రతిలో నచ్చు తప్పులతో బహుసందర్భములందు కోశమున కెక్కినవి. అనేక పాఠాంతరములను గుఱించి, అపపాఠములను గుఱించి, వావిళ్ల ప్రతిలోని తప్పులనుగుఱించి గాని కోశకారు లాలోచించినట్లు కన్పించదు.

—బ్రాహ్మణుల

తో వేగ మత్తరము మంచి ధర్మనిత్యుడు ధర్మజుండు—

'మంచి' అన్న ఆరోపము క్రింద నీ ప్రయోగము నిచ్చిరి. ఈ ప్రయోగ మీ కోశములోని కెక్కుటకు కారణము వావిళ్ల ప్రతిని కోశకారులు గ్రుడ్డిగా ననుసరించుటయే నని వ్రాయక తప్పుటలేదు. వావిళ్ల ప్రతిలో ప్రధానపాఠమిట్లే యున్నది. —ఉత్తర మిచ్చి, ఉత్తర మించి, ఉత్తరమునకు—అని మూడు పాఠాంతరము లున్నవి. ఉత్తరము మంచి—అను ప్రధాన పాఠమున ఛందోభంగ మనివార్యము. ఈ ఛందోభంగమును కోశకారులు గమనించి యున్నచో ప్రయోగ మిట్లిచ్చి యుండ కూడదు. మఱి పాఠాంతరములు మూ డుండగా ఉత్తరమించి —అన్న పాఠమొక్కటే కోశకారులు గ్రహించి దాని కొక యారోపమును గూర్చినారు. తక్కిన రెండింటి కారోపములు కూర్చలేదు. కాని 'ఇచ్చి' యన్న యారోపము క్రింద ఉత్తర మిచ్చి—యన్న పాఠాంతర ప్రయోగమును చేర్చినారు. ఇందువల్ల నీ సమాసమును ఉత్తరము+ఇచ్చి—అని విడదీయుటయే కోశకారుల కభిమత మన్నమాట. ఆ సందర్భములో దానికర్థము దురూహ్యము. మఱి యీ సమాసమందు పూర్వపద ముత్తర మనుకొన్నారు కాబట్టి ఉత్తరమించి—లో కూడ పూర్వపద ముత్తరమే కావలెను. ఉత్తరపదము 'ఇంచి' 'ఇంచి' కావలెను. మఱి 'ఇంచి' అన్న ఆరోపమును కోశకారులిచ్చియుండ లేదు. మించి—యన్న ఆరోపమును కూర్చి యట నీ ప్రయోగము నీయలేదు. "ఉత్తరము మించి యరిగెన" యని వేరొక ప్రయోగము నిచ్చినారు. దీనినిబట్టి ఉత్తర మించి— యన్న సమాసమును ఉత్తరము+ఇంచి యని విడదీయుటయే కోశకారుల కభిమతమని తేలుచున్నది. ఉత్తరపదము ఇంచి—యైనచో నా ఆరోప మిచ్చి దాని క్రిందను, 'మించి' యైనచో దాని ఆరోపము క్రిందను నీ ప్రయోగమును చేర్చవలసి యుండును. నన్నయగారు—"ఉత్తరము మించి"— యని ఇతరత్ర ప్రయోగించుటబట్టి యిప్పటను "ఉత్తరము+మించి" యని పదవిభాగము చేసికొని—భయంపడు— మొదలగు చోట్లవలె 'ము' వర్ణలోపము సాధించుకొనవలెను.

"రాలె":—రాలె కరకాతతు లొప్పఁ దటిల్ల తాళి"

ఇది కూడకోశకారులకు వావిళ్లప్రతియందున్న అచంచల విశ్వాసమున కుదాహరణము. రాలె క్రియారూపము. ద్రుతాంతము. పరమగు కకారమునకు సరళాదేశము, ద్రుతమున కర్థానుస్వారము వచ్చితీరవలెను. కాని వావిళ్ల ప్రతియందు "రాలె కరకాతతు లొప్ప"నియే యున్నది. దానిని యథాతథముగ కోశకర్త లెక్కించిరి. మఱి దీనికి పాఠాంతరము "వలంకులన్ భయంకరములుగా కరాళ కరకాతతు లొప్ప" అని వావిళ్ల ప్రతియం దున్నది. ఇచ్చటకూడ ద్రుతలోప సరళాదేశ రాహిత్యములు కన్పించుచున్నవి. కోశకారులు దీనిని 'కా' అను నారోపము క్రింద నిచ్చిరి. అచ్చట నిచ్చిన యితర ప్రయోగములు సరళస్థిరపరకత్వముచే ద్రుతము జారిపోయిన సందర్భములే. వానిలో దీనిని కూడ చేర్చినారు. కాని యీ చేర్పుటలో యథాతథముగ చేర్చలేదు. సరళాదేశము, అర్థానుస్వారము చేర్చి మఱి చేర్చినారు. సరళాదేశము, అర్థానుస్వారము చేర్చినపుడు దానిని అర్థానుస్వార పరకమైన ఆరోపము క్రింద చూపవలసినదికదా.

"సుగతికి జనుగాక యేల శోకింపంగన్"—1.3.116.

ఇచట "కాక" ఆశీరాద్యర్థకము. ద్రుతాంతము. వావిళ్ల ప్రతిలో నిది కళగానే చూపబడినది. దీనిని కోశకారులు అగు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకమని భ్రాంతి చెందినట్లున్నారు.

"అచటి రాలెల్ల బెల్లు నుగ్గయ్యెఁ జూవె."

ఎల్ల ద్రుతాంతంబైన యవ్యయము. పరుష పరకత్వమున నిచ్చట ద్రుతమున కర్థానుస్వారము రావలెను. కాని వావిళ్ల ప్రతియం దీ పాఠమిట్లే యున్నది. కాబట్టి కోశములోని కట్లే యెక్కినది.

"అనువయించు"

—వారి యనువయించు సిత కృష్ణ రాజిత తంత్రమది—వావిళ్ల ప్రతిలో నిట్లే యున్నది. కొన్ని యితర ప్రతులలో "అనునయించు" అని యున్నది. ఎట్టి వారిని తాము దద్దమ్మ లన్నారో వ్యాఖ్యానించుచు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు 'అనునయించు' నన్న పాఠమును "అనువయించు" అని యుండవలెనని నిర్ణయించిరి. 'అనువయించు' — అను పదము వారి వ్యుత్పత్తికి పరిచితముకాదు కాబట్టి దీనిని పరిష్కర్తలు అనునయించి అని దిద్దియుందురు అని వ్రాసినారు. కాని వారు చెప్పిన 'అనువయించు' పాఠము—వావిళ్ల ప్రతిలోను, మఱికొన్ని ప్రతులలోనిదే కాని క్రొత్తది కాదు. మఱి యీ పాఠము మాత్రము సాధువా ? అన్న ప్రశ్న శర్మగారికి కలుగలేదు. అర్థమును బట్టి అనువయించు—అని యుండిన బాగుండునని వారికి తోచినది. వారిచే దద్దమ్మ లనుకొనబడ్డ వారి వ్యుత్పత్తికి 'అనునయించు'—అని యున్న బాగుండునని తోచినది. మఱి యీ అనువయించు పాఠము కూడ నసాధువే. దీని నొప్పికొన్నచో నన్నయగారి సీసమునందు యతిభంగ

# నన్నయపదప్రయోగకోశము : సమగ్రసమీక్ష

మనివార్యము. ఈ విషయమును వావిళ్ల ప్రతిలోని మఱికొన్ని తప్పులను గుఱించి శ్రీ వి. రామకృష్ణరావుగారు, ఫిబ్రవరి 62 భారతిలో వ్రాసినారు. ఎవరి వ్యుత్పత్తి వారిది. చెప్ప వచ్చిన దేమన కోశకారులు వావిళ్ల ప్రతిలోని తప్పులను కొన్ని అచ్చుతప్పులతో సహా అనుసరించినారనియే. వావిళ్ల ప్రతి ననుసరించుట యున్నది ఈ కోశ నిర్మాణమునకై ఒక విధానమును నిర్ణయించుటకు నియుక్తమైన యుపసంఘము చేసిన నిర్ణయములలో మొట్టమొదటిది. ఈ నిర్ణయ మెంత అసందర్భముగా నున్నదో వేఱె వ్యాకరింప నక్కఱలేదు.

ఈ యుపసంఘ సభ్యు లార్వురు, ప్రత్యేకాహ్వానితు లిద్దరు. మొత్త మెనమండుగురు కలిసి కోశనిర్మాణమున కెనిమిది మాత్రములు ఏకగ్రీవముగా నిర్ణయించిరట. ఎన మండుగురు సభ్యులు ఎన్మిది నియమములు. చిత్రముగనే యున్నది. ఏకగ్రీవముగా నన్నపదమును సంపాదకులు సొగసుగా వాడినారు.

మఱి తత్సమ శబ్దములను (క్రియారూపములు తక్క తక్కిన వానిని) కోశమునుండి వెలి వేయుట సభవారు తీసు కొన్న నియమములలో నొకటి. దీనికి కారణములు. (1) గ్రంథ విస్తరభీతి, (2) నన్నయ వాడిన సంస్కృత శబ్దములలో నర్థవిపరిణామ మంతగా లేదనుకొనుట. (3) వీలైనంత వ్యయప్రయాసములు తగ్గించుకొనుట—అని సంపాదకులు సెలవిచ్చిరి. ఈ మూడు కారణములలో మొదటి చివరి కారణ ములు రెండు ఏకాడమీ పాలకులు చెప్పవలసినవి. గ్రంథ విస్తరభీతి యున్నచో నసలీ కార్యమునకు గడంగుటయే మంచిదికాదు. పైగా నీకోశ మెంత విస్తరమైన నంత యెక్కువ ఫలదాయకముగా నుండును. ఒక మహా సంస్థ పూనుకొనుటవలన వ్యయము పరిగణనములోనికి రాకూడదు. పదిమంది చేయు పని కావునను ప్రయాస లెక్కలోనికి రాదు. అస లిట్టి పనులయందు ప్రయాస పరిగణించనే రాదు. మఱి రెండవ కారణము నన్నయగారు వాడిన సంస్కృత శబ్దము లలో నర్థ విపరిణామ మంతగా లేదన్నది నిజమే. కాని, అంతగా లేకున్నను కొంతైన నున్నది గదా. మరి అది కాక కేవల మొక్క అర్థనిర్ణయము కొరకే అనగా నిఘంటు నిర్మాణము కొరకే ఇది నిర్మింపబడలేదు. కోశనిర్మాణము ప్రయోజన మానాటి భాషా స్వరూపమును సువ్యక్తము చేయుటయేగదా. నన్నయభట్టు అంతవర కేదో వ్యవహార మాత్రోపయోగిగా నున్న భాషలో భారతమువంటి మహా గ్రంథము రచించుటకు పూనుకొన్నవాడు. ఆ మహా గ్రంథ మును నిబంధించుటకు దగినంత పదజాలము తెలుగులో లేదు. లేకపోవుటవల్ల బహుపదములను సంస్కృతము నుండి తెనుగులోనికి తెచ్చినాడు. ఆయన యా సంస్కృత పదముల నే ప్రక్రియ ననుసరించి తెనుగులోనికి తెచ్చినాడో దానిని సుకరముగా గ్రహింపవలెనన్న తత్సమ శబ్దములకు కూడ కోశమునందు ప్రవేశ ముండి తీరవలెను. వ్యాకరణ శాస్త్రరీత్యా తత్సమశబ్దములకు తక్కినవా రందరిలో కంటె నన్నయలో నెక్కువ ప్రాముఖ్య మున్న దనుటలో నెవ్వరికిని విప్రతిపత్తి యుండదనుకొందును. తత్సమములను కోశమునుండి వెలివేయుట చాలా పెద్ద లోపము.

మఱి డు, ము, వు, లు, ల, ను, ని, కు, కి, న, నన్, అన్ అను వానికి ప్రత్యేకారోపములు కూర్చ నక్కఱలేదని యీ సభ వారి నిర్ణయము. తత్సమశబ్దముల నీయని పద్ధతిలో డు ము వు ల కు ఆరోపములు కూర్చకున్నను బాధ లేదు. కాని ద్వితీయ, షష్ఠి, సప్తమి, ప్రత్యయములకు ఆరోపములీయక పోవుటవల్ల నన్నయగారు వాడిన కారక స్వభావము సంపూర్ణ ముగ గ్రహించుటకు వీలు లేకపోయినది. ద్రుతమును గురించి నన్నయభావములు గ్రహించుటకీ కోశమునం దిందువల్ల నవకాశము లేకుండ పోయినది. ప్రశ్నార్థకములను, సంబోధ నార్థ కములను, వేఱె యీయని కారణ మేమో తెలియకున్నది. ఏవకా రార్థములు ప్రతీకము లిచ్చినపుడు వీనినికూడ వేరుగా నీయవలసినది.

మఱి సమాసములను కూర్చుటకు నన్నయ యవలంబించిన ప్రక్రియను గూర్చి తెలిసికొనుట కీ కోశమువల్ల నవకాశములేదు.

కోశమునకు విపులమైన పీఠిక లేకపోవుట ఒక పెద్ద లోపము. ఇట్టి కోశనిర్మాణము తెనుగులో ప్రప్రథమముగా వచ్చినది కాబట్టి ఇది ఏ ప్రణాళికతో కూర్చబడ్డదో, కూర్చు చున్నప్పుడు కన్పడిన ప్రయోగ వైచిత్రి ఎట్టిదో మొదలైనవానిని గురించి పాఠభేదములను గురించి సమగ్రమైన చర్చయవసరము.

ఇక ముద్రణము—ముద్రణము కూడ లోప రహిత ముగా నున్నదనుటకు వీలులేదు. అచ్చు తప్పు లుపేక్షింప వీలు లేకుండ నున్నవి. కొంచె మెక్కువగానే యున్న వనవలెను. కొన్నిచోట్ల నక్షరముల కక్షరములే యెగిరిపోయినవి. కొన్ని చోట్ల అర్ధబిందువులు పోయినవి.

అంచట్టి కొనియెన్—ఒకచోటన పెదకాలంబునికి—అల్లి యది ధవళంబైన యశ్వంబునందు—అమల సువర్ణ శృంగ ఖురయై—ఇందఱ సన్నిభిన యడిగి తింద యెఱింగన్—మొదలగునవి బహుళముగా నున్నవి. కొన్ని చోట్ల అర్థ బిందువులు సరళాదేశములు రావలసి యుండగా రాలేదు.

నాయెద్దన నుండుడేను వాన ప్రస్థాశ్రమంబున—ధర్మువునందు తగిలి యుండను—భువనముల వెలిగెను నీ వుద్భవ మొటను జొచ్చుటను—మోహమునములోని సహజ వైరివర్గంబున్—ఈ జాతి దోషములు కేవలము ముద్రా పకులకే చెందు ననలేము. ఇవి ఛందో వ్యాకరణములకు సంబంధించినవి. కాబట్టి ప్రయోగముల నెరినవారే యనుభవ లోపములవల్ల నీదోషములను చేసియుందురని తోచు చున్నది. సంపాదకులు మఱికొంత శ్రద్ధ చూపినచో నిట్టి దోషములు దొరలకుండ నుండెడివి.

ఈ గ్రంథము బహుసంస్కారములను కోరుచున్నది. ఏకాడమీవారు తగినంత శ్రద్ధ వహించి ద్వితీయముద్రణము నందైన నాయాదోషములు పౌనః పున్యముగాకుండ చూడ వలసి యున్నది. ఏమైనప్పటికిని ఇట్టి గ్రంథమును కూర్చి నందులకు సంపాదకులను ప్రకటించిన ఏకాడమీ వారిని అభినందించవలసినదే.

---

నన్నయ పదప్రయోగకోశము; సాహిత్య అకాడమీ ప్రచురణ; సంపాదకులు : శ్రీ ఆబ్బూరి రామకృష్ణరావు; డా॥ దివాకర్ల వెంకటావధాని; వెల రు. 40/-

# కాకతీపురము హనుమకొండయేనా?

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

'శ్రీమాన్ కాకతివరాధినాథో బేతః' అని ఖాజీపేట శాసనము కాకతీయరాజులలో మొదటివాడైన బేతరాజునుగురించి చెప్పుతూన్నది. ఇంకా కాకతీయ శాసనములలో 'కాకతిపుర', 'కాకతీయపుర' అన్న పదాలు—కాకతిపురమని ఒక వూరు ఉన్నట్టు సూచించేటివి—ఉన్నవని పరిశోధకు లెందరో గుర్తించిన సంగతి. అయితే ఈ 'కాకతి పురము' ఎక్కడిది ? అని ప్రశ్న.

శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారూ, శ్రీ మారేమండ రామారావుగారూ చాలా చాలా చర్చ చేశారు. పై రాష్ట్రాలలో 'కాకతిపురము' అన్న మాటతో మేనమామ పోలికగల వూళ్లలో ఏది కాకతిపురము కాగలదూ ? అని. పర్యవసానము ఇదమిత్థమని తేలలేదు. మెట్టుకు 'కాకతిపుర'మని ఒక వూరుమాత్రము ఉండి ఉండాలి. అది ఏ ప్రదేశములోనిది ?

"ప్రతాపరుద్రుని చరిత్రము" అని ఏకాంబ్రనాథుడు కాకతీయ రాజుల చరిత్రమును వచనములో వ్రాసినాడు. అతడు ఈవంశమువారు చిరకాలమునుంచీ హనుమకొండనే ప్రధాననగరముగా చేసుకుని పాలించినట్లు వ్రాస్తున్నాడు. ఆ వూరిలో చిరకాలమునుంచీ పద్మాక్షి వెలసి ఉండినట్లున్నూ ఈ కాకతివంశపురాజులు పద్మాక్షి దేవిని అర్చిస్తూండినట్లున్నూ వ్రాస్తున్నాడు. ఈ దేవి "భయంకరంబై భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ బేతాళ రాక్షసపరివృతయై సింహాసనంబున .... కొలువుం" డగా మాధవవర్మ ఆమెను చూచెనట. కనుక పద్మాక్షి అన్న దేవి ఈ నాడు పద్మాక్షి గుట్టమీది ఆలయములో ఉన్న (దిగంబర) తీర్థంకరుని యక్షిణి కానే కాదనిపిస్తున్నది. పద్మాక్షిగుడి హనుమకొండ కోటలో మరియొకటి గాని ఉండినదేమో ! గుట్టమీదిది జైనుల స్థావరము. ఇక్కడి గుడిని రెండో ప్రోలరాజు మంత్రి యొక్క భార్య కట్టించినది. ఈ గుడిలోని పద్మావతి పద్మాక్షి ఎట్లగును ? ఈమె యక్షిణి; దేవత కానే కాదు. కనుక 'పద్మాక్షి గుడి' అన్నది హనుమకొండలో ఉండి ఉండినట్లయితే అది ఇంకొక గుడి అయివుండ వలెనూ, ఆ దేవతా విగ్రహమే ఇంకొకటి అయివుండవలెను.

పద్మాక్షి అంటే 'తామరరేకులవంటి పెద్ద కన్నులు గల దేవి' అని అర్థము, పద్మావతి అని మాత్రము కాదు. పద్మావతి పార్శ్వనాథుని యక్షిణి; ఘోరరూపి కానే కాదు. హనుమకొండ కోటలో ఈ నాటికీ విశ్వబ్రాహ్మణ మఠము కడ ఒక రాతి విగ్రహము—అర్ధ శిల్పరూపము—కనబడుతూన్నది. ఈమె "కోటరాక్షి, అసిధారిణి, త్రిలోచని, కృశోదరి, శవారూఢ", అగ్నిపురాణము వర్ణించే చాముండ. ఈమెకు ఈ నాడు ఆలయము లేదు, ఆ నాడు ఉండి యుండ వలెను. అలంపురంలో 'జోగులాంబ' అని పేరుపడ్డ యోగేశ్వరి—ఘోర రూపి, మహాబల, లంబస్తని, ప్రేతాసన సమాయుక్తయైన దేవి—కి ఆ నాడు ఆలయముండినది. (అదే ఈ నాటి బ్రహ్మేశ్వరాలయము). కనుక యీ యమ్మకు ఉండిన ఆలయము భగ్నమైనది అనవచ్చును. ఈమెయే పద్మాక్షి అయి యుండునా ? ఈమె చేతులు ఎనిమిది. రెండింటిలో కత్తి, రక్తపాత్రా ఉన్నవి. తక్కినవి విరిగి పోవడమువల్ల ఆయుధాలేవో తెలియరావడము లేదు. అయితే, తెలుస్తూన్న లక్షణాలు మాత్రము చాముండవే. చాముండ విగ్రహము వ్యాపించినంత విరివిగా కాకతీయ సామ్రాజ్యములో ఇంకే ఒక్క విగ్రహమూ వ్యాపించలేదు. ఈమె సప్తమాతృకలలో ఒక్కతె; యముని శక్తి. మాతృ కలవరుసలో ఉన్నప్పుడు ఈమెకు—శవము కాక—నక్క వాహనముగా కనపడుతూన్నది. టిక్కవోలులో నక్క, శవమూ కూడా కనిపిస్తున్నాయి. కనుక, నక్కనూ, శవమునూ వాహనములుగా—గలిగిన దేవి చాముండయే ననుటలో విప్రతిపత్తి లేదు. కాకతీయుల రాజ్యములో నక్క, శవమూ, మానవ శీర్షమూ, చిహ్నములుగా ఉన్న దేవి, వాహనాలు లేక కేవలము రక్తపాత్రా, కత్తి, డమరుకమూ, త్రిశూలమూ అన్న ఆయుధాలను ధరించిన దేవీ కనబడుతున్నారు. ఈ రెండూ చాముండ రూపములే అనగా చాముండను—ఒక్క దేవినే—సూచించే రూపాలే. వెల్నూరి ఇరుగోళమ్మకూ, నాగార్జున కొండ మ్యూజియములోని చాముండకూ గుడ్లగూబ చిహ్నముగా నున్నది. పూర్వకారణాగమము చాముండకు గూబను వాహనముగా చెప్పుతుందిట. కనుక యివన్నీ చాముండ మూర్తులే. దొండపాడులో 'కాకతమ్మబీడు'—అని కరణీకపు

లెక్కలలో కూడా పేరుపడ్డ మైదానము—మీద ఈమె బొమ్మయే కనబడినది. శ్రీనాథుడు మండపాకలో—పెను బాకలో మాహూరములో—ఏకవీరమ్మతో కూడా సైదోడై ఉంటుం దన్నాడే, ఆ కాకతమ్మ, ఈ నాటికీ తల మాత్రంగా ఉన్న ఏకవీరమ్మకు సైదోడుగా మండపాకలో దర్శన మిస్తూ న్నట్టిది చాముండయే. కాకతీయులు కులదైవముగా కొలిచిన దేవి—కాకతీయుల అమ్మవారు—కాకతమ్మ. కాకతి అన్నది ఇంటిపేరు. 'విరియాల' వంటిది. ఈమె కాకతీయుల ఇంటి దైవము. ఈమెను వారు తమపురమునందు—కాకతి పురము నందు—ప్రతిష్ఠించుకున్నారు. కాకతిపురము హనుమ కొండకు చేరి ఉండిన వూరు. కొండ హనుమద్గిరి, వూరు కాకతిపురము.

ప్రతాపరుద్రచరిత్రము అని ఏకాంబ్రనాథుడు వ్రాసిన వచనగ్రంథమూ, గూడూరు శాసనమూ ఈ వూహకు బలమిచ్చుచున్నవని నా నమ్మకము. మొదటి దానిలో హనుమద్గిరి దగ్గరి నగరము రాజధానిగా పరిపాలించిన రాజు లను చెప్పుచూ ఏకాంబరనాథుడు ఇచ్చిన వరుస యిది : (1) పద్మసేనుడు, (2) వెన్నమ, (3) పొరికి వెన్నమ, (4) గుండమ (5) కుంతలి (గుండమ చెల్లెలు), (6) యెఱుకుదేవ (7) భువ నైకమల్ల (8) త్రిభువనైకమల్ల (9) కాకితప్రోల (10) రుద్ర. గూడూరు శాసనము దుర్జయాన్వయులగు విరియాల వారిని వరుసగా చెబుతూ, (1) వెన్నడు, (2) ఎఱ్ఱభూపతి, (3) విరియాల భీముడు, (4) ఎఱ్ఱ నరేంద్రుడు, (5) అతని భార్య కామమసాని అని చెప్పి తరువాత బేతరాజు కాకతి వల్లభుడై నాడంటుంది. ప్రతాపరుద్ర చరిత్రమూ, గూడూరు శాసనమూ రెండూ కూడా బేతనికి (ఎఱుకు దేవనికి) ముందు కుంతలియో, కామమసానియో రాజ్యాధి కారము చేసినట్లే చెపుతున్నాయి. దానిలో కుంతలి యెఱుకు దేవనికి అనుమకొండ రాజ్యము ఇచ్చి పోయినదీ, దీనిలో కామమసాని బేతని కాకతి వల్లభు చేసి కాకతిలో అతనిని నిల్పినది. అనుమకొండను చేరిన వూరే 'కాకతి'. కామమసానికి బేతనియెడ ఎందుకా అభిమానమూ ? అన్న ప్రశ్నకు ప్రతా పరుద్ర చరిత్రము 'మేనత్త కనక' అని చెపుతున్నది.

'కాకర్త్య' అన్న ఇంటిపేరుతో (చూ. విరియాల భీమ నృపుడు) మనకు వినబడే మొదటి పేరు కాకర్త్య గుండ్య నది. ఇతని తాత గుండయ రాష్ట్రకూటుడు. రాష్ట్రకూటుల సేవలో (కాకతి పురములో కావచ్చునూ) ఉండినవాడు. ఇతని కొడుకు ఎఱ్ఱయ రాష్ట్రకూటుడు.. (కాకతిపురమువాడే). వీని కొడుకు చాళుక్య అమ్మరాజు సామంతుడు, నతవాటిసీమ నేలిన కాకర్త్య గుండ్యన. ఇతడు రాష్ట్రకూటులను విడిచి చాళుక్యుల సేవ స్వీకరించినవాడు కనుక 'రాష్ట్రకూట' పదము జార్చి, తన వంశమువారి వూరుపేరు, అనగా ఇంటి పేరు 'కాకర్త్య' గా తేలినది, దానిని చేర్చుకొని 'కాకర్త్య గుండ్యన' అయినాడు. ఇతని తరువాతి వారిని హనుమకొండ చరిత్రకారులు (రెండు మూడు జిల్లాలు దాటి) తెలుసుకో లేదు. బేతరాజు తేలినాడు గుండ్యన పదవికి వారసుడుగా. ఈ బేతరాజును శత్రువులు పదభ్రష్టుని చేసినారు. అతని మేనత్త కుంతలిదేవి అనే కామమసాని—హనుమకొండరాజు చెల్లెలు కాబోలు—బేతరాజుకు తన భర్తను బాసటగా పంపి కొఱవి దేశములో ప్రతిష్ఠ చేయించింది. తరువాత ఆమె భర్త చని పోయినాడు. ఈమె బేతరాజును కాకతివల్లభుని చేసినదీ, కాకతి ('కాకతి నగరములో' 'కాకతి వంశ ప్రతిష్ఠను'—ఏమి అర్థము చెప్పినా సరిపోతుంది) నిల్పి ఆ వంశానికి 'కోటి' చేసింది. అంటే బేతరాజును హనుమకొండకు రప్పించి, తాను హనుమకొండ రాజ్యాన్ని పాలిస్తూ బేతనికి స్నేహితులను కూర్చి, ఆ రాజ్యము కాస్త అతని చేతిలో పెట్టి వెళ్లింది. బేతరాజు 'కాకతి పురాధినాథు, డైనాడు. కాకతి అనగా హనుమ కొండను చేరిన పురము.

శ్రీ మారేమండ రామారావుగారు, రుద్రదేవుని హనుమ కొండ శాసనములో 'అనుమకొండా పురవరేశ్వర' అన్న బిరు దున్నూ, 'కాకతీయ' అన్న బిరుదున్నూ, రెండూ చెప్పబడ డము చేత, కాకతి పురము అనుమకొండయే అయితే రెండు పేరులూ అనవసరము కనక కాకతి వేరే వూరన్నారు. 'కాక తీయ' అన్నది ఇంటిపేరు. దానిని ఎందుకు వదలాలి ? అనుమ కొండ చిరకాలమునుంచీ ఆ పేరుతోనే ఉండినప్పటికీ దానిని చేరిన వూరు కాకతి. అధిపతులు కాకతీయులు. కాకతి అన్న ఇంటిపేరు గల 'కాకతీయ' వంశమువారు. కనుక కాకర్త్య, కాకతీయ, కాకెత, వంటి పదాలన్నీ వూరుకీ, అదే యింటి పేరుకీ చెందుతాయి.

కాకతీయులు కొలిచిన అమ్మవారు, చాముండి, కాక తమ్మ అన్న సామాన్య నామముతోనే తెలియబడి కాకితమ్మ, కాకితమ్మ బావి, కాకితమ్మ బీడు వంటి పేర్లకు కారణ మైంది. ఈమెను కొల్చినవారముకనుక కాకతీయుల మైత్రి మని కాకతీయులు శాసనములో వ్రాయించినట్లు కానరాదు. కాకతీయుల తరువాతివారూ చివ్వరి కాలపు విద్యానాథుడూ ఈ కారణము చెప్పడములో అపోహకు లోనై, బండి పేరే గుర్రానికి పెట్టారు. వారు ఇంతకన్నా పెద్ద తప్పులే వ్రాశారు దీనికి లెక్క ఏమిటి ? ? వరంగల్లులో చితాపుఖాను శాసన కవి "శుభ నిశుంభ దానవకుల ప్రోన్మూలనోజ్జృంభణా, రంభా కాకతి రాజ్యపీఠ కమలావాది ర్జగన్మాతృకా" అంటూ 'రంభా' అలంకారములో పార్వతీ, కమలా, జగన్మాత అంటూ దున్నుకు పోయాడు. ఈ కవులకు అటు అసలు కథలూ అక్కరలేదూ, ఇటు శిల్పసంప్రదాయాలూ అక్కరలేదూ.

# అమృతం కురిసిన రాత్రి

శ్రీ బాలగంగాధర తిలక్

అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం
తలుపు తెరచి యిల్లు విడిచి
ఎక్కడికో దూరంగా
కొండదాటి కోనదాటి
వెన్నెల మైదానం లోకి
వెళ్లి నిలుచున్నాను.

ఆకాశం మీద అప్సరసలు
ఒయ్యారంగా పరుగులెత్తుతున్నారు
వారి పాదాల తారామంజీరాలు
ఘల్లు ఘల్లుని మ్రోగుతున్నాయి
వారి ధమ్మిల్లాల పారిజాతాలు
గుత్తులు గుత్తులై వేలాడుతున్నాయి
వారు పృథు వక్షోజ నితంబ భారలై
యౌవన ధనుస్సుల్లా వంగిపోతున్నారు.

నన్నుచూసి కిలకిలనవ్వి యిలా అన్నారు.
చూడు వీడు
అందమైనవాడు
ఆనందం మనిషైన వాడు
కలల పట్టు కుచ్చు లాగుతూన్న కిరీటం ధరించాడు
కళ్ల చివర కాంతి సంగీతగీతాన్ని రచిస్తున్నాడు.

ఎర్రని పెదవులమీద తెల్లని నవ్వుల వీణల్ని మీటుతున్నాడు
ఎవరికీ దొరకని రహస్యాన్ని వశపరచు కొన్నాడు

జీవితాన్ని ప్రేమించిన వాడు జీవించడం తెలిసిన వాడు
నవనవాలైన ఊహావర్ణార్ణవాలమీద ఉదయించిన సూర్యుడు
ఇతడే సుమీ మన ప్రియుడు నరుడు మనకి వరుడు.

జలజలమని కురిసింది వాన
జాలువారింది అమృతంపు సోన
దోసిళ్లతో తాగి తిరిగి వచ్చాను
దుఃఖాన్నీ చావునీ వెళ్లి పొమ్మన్నాను
కాంతా మధుర కాశ్మీరాంబరం కప్పుకున్నాను
జీవితాన్ని హసన్మందారమాలగా ధరించాను
చైత్రయాత్రా పథంలో తొలిఅడుగు పెట్టాను.

అమృతం కురిసిన రాత్రి
అందరూ నిద్ర పోతున్నారు
అలసి, నిత్యజీవితంలో సొలసి సుషుప్తి చెందారు
అలవాటునీ అస్వతంత్రత నీ కావలించు కున్నారు
అధైర్యంతో గదిలో తాము ముడుచుకు పోయి పడుకున్నారు
అనంత చైతన్యోత్సవాహ్వానాన్ని వినిపించుకోలేక పోయారు.

అందుకే పాపం
యీ నాటికీ ఎవరికీ తెలియదు
నేను అమరుడిననీ!

# సాహిత్యము - అధునాతన జీవితము

**శ్రీ అల్డస్ హక్స్లీ**

జీవితముమీద సాహిత్యముయొక్క ప్రభావము ఎట్లా వుంటుంది? అట్లులనే, జీవితము తన ప్రభావమును సాహిత్యముపై ఎట్లా చెల్లించుకుంటుంది? ఈ ప్రకరణములో సాహిత్యం అంటే అర్థము ఏమిటి? ఇందువలన, ఎవరి జీవితము, ప్రభావితము అవుతున్నది? ఎవరి జీవితమువలన సాహిత్యము ప్రభావితము చేయబడుతున్నది?

చరిత్రయొక్క ప్రగతి బహు విషయములచేత నిబంధితము అవుతున్నది. ఇట్టివానిలో సాంకేతిక విజ్ఞానము, ఆర్థికములైన ఏర్పాట్లు, ఉన్నత పదవులలోవున్న మహా పురుషులయొక్క కార్య కలాపములు, వారి అభిప్రాయములు, భావములు—ఇవి ముఖ్యమైనవి. ఇప్పుడు ఈ అభిప్రాయములను లేక భావములను సువ్యక్తముగా అభివ్యక్తము చేయుచు చేసిన రచన, లేక చిరస్మరణీయముగనుండు ప్రసంగము—సాహిత్యమగుచున్నది. సాహిత్యమనెడి పేరున పరగుటకు యోగ్యతను పొందుచున్నది. అట్లు వ్యక్తీకరింపబడిన భావములు సాహిత్య శబ్ద వాచ్యములగుచున్నవి. కాని, ఇప్పుడు సాహిత్యమునకు సమకూర్చబడిన, ఈనిర్వచనము— శబ్ద శరీరము ధరింపచేయబడిన భావములు అన్న నిర్వచనము—అతి వ్యాప్తముగావుండి, మనకు ఇక్కడ ప్రయోజనకారియగుటలేదు. లాక్, హెగెల్, మార్క్సు లెనిన్—వీరి అందరి రచనలును, చరిత్రయొక్క గతిని ఎంతగనో ప్రభావితము చేసినవి. అనగా, బహుజనముల జీవితములపై తమ ప్రభావములు చెల్లించుకొన్నవి. అయితే తాత్త్వికము, రాజకీయము అయిన భావములకు వీరు శబ్దముల ద్వారమున పోసిన పోతలకు, షేక్స్పియరు, వర్డ్స్వర్త్ మొదలైన ప్రతిభావంతులయిన కవులు మనుష్యుల అంతఃకరణ ప్రవృత్తులను గూర్చి, వారిమధ్య సంబంధములను గురించి, ప్రకృతి, ప్రకృతి తత్వములను గురించి వ్యక్తీకరించివున్న భావములకు సామ్యము వున్నదని అనలేము. అట్లనుట అర్థ రహితముగా గూడ నుండును. అందువలన, ఇప్పుడు నేను 'సాహిత్యము' అను మాటను వాడిన సందర్భములలో, దాని యర్థము, షేక్స్పియర్, వర్డ్స్వర్త్ వంటివారు వ్రాసిన గ్రంథములవంటి గ్రంథములను గూర్చి యనియేకాని, మరి ఒక్కటికాదు.

ఇట్టి సాహిత్య గ్రంథములలో, ఇతర అంశములతో పాటు, మహత్త్వపూర్ణమైన భావములు, తాత్త్వికములైనవి, రాజకీయ సంబంధములైనవి వుండి, అవి చరిత్రగతిని మార్చుటకు, రూపు పొందించుటకు తోడుపడుచు, తద్ద్వారమున జనుల జీవితములపై తమ ప్రభావమును చెల్లుబడి చేసుకోగల్గుటకు సమర్థములై, ఆ జనుల సామాజిక జీవనములో, ఆ జీవనమునకు ఆధారమైన ఆవరణములో పరిణామములను తెచ్చిపెట్టగల్గుచున్నవి. ఈజరిగినయంతకాలములో కవులు, నాటక కర్తలు, నవలా రచయితలు, వ్యాసకర్తలు, తమ ప్రతిభను ఉపయోగించి, ఇట్టి భావములను ప్రచలితములోనికి తెచ్చుటకు ప్రయత్నము చేసివున్నారు. కొన్ని సందర్భములలో వారి ప్రయత్నములు సఫలమైనవి. మరికొన్ని సందర్భములలో పూర్తిగా విఫలములైనవి. రూసోగారి రాజకీయ భావములు చరిత్రపై గట్టి ముద్రను వేయగా, దాంతీగారి రచనలు అట్టి పని చేయలేకపోయినవి. ఇటీవలి రచయితలలో హెచ్. జి. వెల్స్ గ్రంథములు పొందినంత ప్రచారము మరి యే ఇతర రచయితల గ్రంథములుగాని పొందలేదు. ఆతని గ్రంథములు బహు భాషలలోనికి అనూదితములైనవి. కాని, ఆయన ఆ గ్రంథములలో చెప్పిన మానవతగాని, ఉదార సిద్ధాంతములుగాని, హేతుమత్తమయిన అంతర్జాతీయ తత్త్వముగాని, చరిత్రపై చెప్పుకోతగిన ప్రభావమును చెల్లించుకొనలేకపోయినవి. శతాబ్ద లక్షణమును, అనగా ఆధ్మాతము చెందుచున్న జాతీయవాదపు విగ్రహారాధనమును, ప్రగుణముగా పేటు రేగుచున్న నియంతృత్వములను ఈయన గ్రంథములు ఏమియు చేయలేకపోయినవి. అభూత కాధానకము అను చెప్పుటలో వెల్సుకు సాటిరాగలవారు లేరు. కాని అంతర్జాతీయ వాద ప్రవక్తగా, హేతువాదిగా, సహనమును నూరిపోయుటకుగా ఆయన సాగించిన ధార్మిక యుద్ధము పూర్తిగా విఫలమైపోయినది.

దీనినిబట్టి తేలుచున్న విషయము ఇది. సాహిత్యములో శక్తికి, ప్రచార దృష్ట్య దాని ప్రభావమునకు ఎక్కడను సంబంధములేదు. ఎంత ప్రతిభవున్నా, రచయిత ఎంత మేధావియయినా, చరిత్ర గతిని మార్చే భావమును అందరిచేతను అంగీకరింప చేయగలడన్న హామీ ఎప్పటునులేదు. అట్టి అంగీకారమునకు మేధావిత్వము ఎదురు తిరుగవచ్చును. ప్రచారమునకు సంబంధించినంత వరకు, అది రాజకీయములోకానిండు, మతమున కానిండు, వ్యాపార రంగమున కానిండు, భాష అందముగా వున్నదా, లేదా? భావము మతి మెత్తనగా చెప్పబడినదా, లేదా? విచారధార గాఢముగను, క్రాంత దర్శిత్వముగను వున్నదా, లేదా, అన్నదేమియు అక్కర లేదు. ఏ విషమును జనముల తలలకు ఎక్కించదలచుచున్నామో ఆ విషయమునకు సంబంధించిన భావములను కొన్ని అల్పపు పద బంధములనుగా పోతపోసి, వానిని నిరంతరము వల్లె వేయుట మాత్రమే ఇందులకు కావలసియున్నది. ఒక్కొక్క సందర్భములో ఈ ప్రక్రియ గూడ పని చేయదు. అందుకు గూడ అనుకూల పరిస్థితులు అవసరమగుచున్నవి. మేధావులయిన

వారి భావములు వాటియంతట అవి ప్రజలలోనికి నూటిగా ఎక్కుట ఎప్పుడునూలేదు. ఆ భావములు, వానిని వ్యాఖ్యానముచేయు వారి చేతులలోపడి, నలిగి, నలిగి రెండు, మూడు హస్తములను దాటిన అనంతరమున మాత్రమే చరిత్ర గతిని మార్చుటకు సమర్థములగుచున్నవి.

లాటినుభాషలో 'వార్తెన్' అను మాట యున్నది. దానికి కవి అనియు, ప్రవక్తయనియు అర్థములున్నవి. చరిత్రలో, ప్రవక్త తుల్యులయిన కవులు, మహత్తరములైన ఆశయము లను ప్రపంచించినవారు, మత ధర్మములను నిలుపగా బద్ధకంకణులయినవారు, అవినీతినితెగడి మంచితనమును పైకి ఎత్తిన వారు, ఎందరో వున్నమాట నిజమే అయినను, కవిత్వముయొక్క లక్షణము లేక ధర్మము, నిజమునకు ప్రవక్తృత్వము కాదనియే చెప్పవలసియున్నది. ఇది దానికన్న వేరైనది. ప్రవక్తృత్వము జరగవలయు దానినిగూర్చి చెప్పునట్టిది. దానికి ధార్మికతతో, వివేచనముతో ముడియున్నది. మరియు అది భగవంతుని లీల యందు, విశ్వ ప్రయోజనమునందు విశ్వాస ముంచునట్టిది. అందులకు విరుద్ధముగ ఒనగూడి వచ్చు బహు విషయములు విద్యమానములగుచున్నను, ప్రవక్తృత్వము వానిని త్రోసివేయును. మరి కవిత్వమనగా, ఇట్టిదికాదు. ఏమి జరుగుచున్నదో దానికిలది ప్రధానము. అస్తిత్వముయొక్క రహస్యములు, అవి అజ్ఞేయములైనను, ఇక్కడ అవి ప్రధానము. అంతియకాక, జీవజాలము అంతుతేలకయున్నవైచిత్రి ఎరుకకురానితనము ప్రధానము. ఈ జీవజాలము, స్త్రీలు—పురుషులకు వలెనే, చేయుటకు సమర్థమైన సర్వమైనక్రూరత, సర్వమైన అర్ణవము, తేజస్స్వంతమైన తెలివి, చీకటికోణమును పోలిన, ఆత్మహత్యాసదృశమైన మూర్ఖత, తాత్విక సంబంధమైన అంతర్వీక్షణము, తుచ్ఛము, హేయము, జుగుప్సాకరము అయిన మూఢ విశ్వాసము—ఇవి గూడ ఇక్కడ ప్రధానములు. ఇవి అన్ని "ఉన్నదానితో" ముడిపడియున్నవి. "నిన్ను నీవు తెలిసి కొనుము" అని ప్రతి వేదాంతమును బోధించుట కలదు. తాత్విక జీవన సారథులయినవారి సందేశమే అది. మరి సాహిత్యముయొక్క పరమ ప్రయోజనమేమనగా, ఆ ఆత్మావబోధము మనలో కల్గుటకు తోడుపడుట. ఇది సాహిత్యముయొక్క ప్రధాన ధర్మము. 'వార్తెన్' అయినవాడు భగవంతునిగూర్చి, సమాజమును గూర్చి శాస్త్రములనుగూర్చి, చరిత్రనుగూర్చి, జోస్యములవంటి మాటలను కొన్నింటిని చెప్పవచ్చును. కాని అతడు అంతర్ద్రష్టయై, క్రాంతదర్శియై,మానవమైకమైన సర్వానుభూతియందలినిసంవాదమును చూచి, విచక్షించి, ఇతరులకు దానిని అవబోధమగునట్లు చేయగల్గినవాడే కవియగును. కానివాడు వట్టి బల్లాకుడు. వట్టి తార్కికుడు.

ఒక పద్యముగాని, లేక సరసమైన సాహిత్యమునకు సంబంధించిన దేదియైనగాని, డా. జాన్సన్ అన్నట్లు, "ప్రథమ దర్శన మాత్రముచేత, అనభిజ్ఞునకు ఆశ్చర్యమును కల్గించి, నేను దీనిని చూడలేక పోయితినే, లేక చెప్పలేకపోయితినే అనిపించ" వలయును. మరి అతడు దానిని చూడలేకపోయెననగా, తెలిసి కొనలేకపోయెననగా, అతడు తన్ను గురించియే ఏమియు తెలిసి కొనలేకపోయినాడని అర్థము. మంచి కవిత్వమనగా, ఇతరుల కంటె వేరైన స్త్రీలును, పురుషులును, తమ్ము తాము చూచుకొని, అన్వేషించుకొని, ఆవిష్కరించుకొని, తాదాకృతి విషయము లను శక్తివంతమైన ఉద్దీప్తికరమైన శబ్దములలో అభివ్యక్తము చేయుటయే యగును. ఇటి విలక్షణ లక్షణముగల వ్యక్తులు తమ ప్రవర్తనమునుగూర్చి పరిశీలనముచేసికొనుటయేగాక, బాహ్యాభ్యంతరమైన తమయొక్క అస్తిత్వము, ఐచ్ఛికముగా తాము గ్రహించిన భూమికకు, లేక పరిస్థితుల బలమున చేసి, తాము నిర్వహించవలసి వచ్చిన భూమికకు ఎట్టులు సరిపడని దగుచున్నదో గూడ చూచుకొనుచున్నారు. మరి ఇట్టి సాహిత్యమునకు తమ్ము అర్పించుకొన్నవారు గూడ అటులనే ఆత్మావబోధమునకు, ఆత్మ పరిశీలనమునకు కడంగినవారై, తమవట్ల గూడ, ఆ రచయిత తనకు తన శరీరమునకు గల సంబంధమును గూర్చి, తనకు తన అంతఃకరణమునకుగల సంబంధమును గూర్చి, తనకు ఇతరులకు, తనకు ప్రకృతికి, తనకు, తన చుట్టునువున్న సమాజిక వ్యవస్థకు, సంస్కృతికివున్న సంబంధమును గూర్చి, తెలిసికొనిన అంశములే, తమయందు ఆ రచయితయందువలెనే యదార్థములని భావించుట కలదు.

ఉత్తమ సాహిత్యము, ఆత్మావబోధమును కలుగజేయు విద్యవంటిది. (ఆత్మావబోధమునకు అనుత్తమ సాహిత్యము దారి తీయును. ఈ విషయమును నేను ముందు ముందు తెలియ జేయగలను). ప్రవక్తలు మంచిని బోధించుటయు, చెడ్డను తెగడుటయు చేయుదురు. కవులు, అట్లు గాక, ఆ మంచి యొక్క రహస్యములయిన ఆధారములను, గూఢజనిస్థానము లను, మనముందు ఆవిష్కరింతురు. మనకు వానిని గూర్చిన ఎరుకను కల్గింతురు. ఈ ఎరుక కల్గుటయున్నది అవధిభూతము గాని మంచి సంగతులలో నొకటి. అది అట్టిదని చెప్పుటకు వేర దృష్టాంతము లేమియు నక్కరలేదు. దాని కదియే దృష్టాంతము. ఆత్మ విద్య, లేక ఆత్మ జ్ఞానము, దానియంతట యది యే పరమోత్తమమైనదైనప్పటికిని, దానికోసమే, దానిని సాధన చేయవలసి వున్నప్పటికిని, నైతిక ప్రాతిపదికముగ గూడ దానిని సమర్థింపవచ్చును. ఏది కలదో, దానిని గూర్చి, ఎరుక అధికమగుట యున్నది, దానియంతట అది ఉత్తమమైన దగుటయేగాక

వ్యక్తిత్వమున యది తెచ్చు బాహ్యమైన మార్పుల వలన గూడ ఉత్తమమైనది, అవదాతమైనది యగుచున్నది. ఇట్టి ఎరుకకు ఉత్తమ సాహిత్యము మార్గమగుచున్నది. వ్యక్తిత్వములో మార్పులను తెచ్చిపెట్టి, ఈ ఎరుకవలన లేక ఈ ఆత్మావబోధమువలన మనలో దాగివుండి కనుపించని బలహీనతలను, అవిమృష్టములైన వ్యసనములను, అపరీక్షితములైన బుద్ధి జాడ్యములను వెలికి చూపు లోచూపువంటిది కావచ్చును. అయినను ఆ మార్పు లోకోత్తరమైన ఉన్నతిని చేకూర్చునట్టిదియు కావచ్చును.

ఉత్తమసాహిత్యము ఒకవిధముగా సూర్యుని వంటిది. సూర్యుడు ప్రకాశించుటలో తారతమ్యములులేక యుండును. అట్లే, ఉత్తమ సాహిత్యము గూడ తారతమ్యములు లేకయుండును. సూర్యునకు తన ప్రకాశమును ప్రసాదించుటలో ఎట్లు వీడు మంచివాడు, వీడు చెడ్డవాడు, వీడు మందబుద్ధి, వీడు ప్రతిభావంతుడు అనియుండదో, అట్లే ఉత్తమ సాహిత్యమునకు గూడా వీడు సజ్జనుడు, వీడుకాదు, వీడు ప్రతిభావంతుడు, వీడు కాదు అనియుండదు. షేక్స్పియరు రచించిన "ట్రాయ్ లస్ అండ్ క్రెస్సిడా" యున్నది. అందులో నానా ప్రకారములయిన పాత్రలను ఆశ్చర్యజనకముగా ఆయన సృష్టించినారు. వారి శీలములు, చరిత్రములు వేరు వేరు. ఈ పాత్రములలో నేది మానవ స్వభావమునకు, సమాజ ధర్మమునకు విశ్వ భావనమునకు సరిపడియున్నదో షేక్స్పియర్ మనకు చెప్పడు. మానవస్వభావమును గూర్చి, సంఘ ధర్మమును గూర్చి, విశ్వభావమును గూర్చి, అందులో ప్రతి పాత్రకును స్వంత అభిప్రాయములున్నవి. ఆ అభిప్రాయములలో ఏది నిష్కృష్టమైనదని తాను భావించుచున్నదియు షేక్స్పియరు మనకు తెలియజేయడు. ట్రాయిలస్ పాత్రమున్నది. ఆ పాత్రము ప్రేమైకశీలము కల్గినది. మౌగ్ధ్యము ప్రధాన లక్షణముగా గలది. మరి హెక్టార్ పాత్రమును చూచినచో, అంతకన్న వీర రసమునకు భాజనమగుపాత్రము వేరుగాలేదు. ఉలిసిస్ పాత్రమున్నదనగా, ఆ పాత్రము లోకజ్ఞతకు, వైదగ్ధ్యమునకు మచ్చు తునక. కెస్సాండ్రా యున్నదనగా, ఆ పాత్రమునకు వైధికమైన నియతివాదమునందు విశ్వాసముమెండు. అకారుణికమైన ఈ విశ్వము దైవతముల ఏలుబడిలోలేదు. అజ్ఞేయము, అనిష్టము అయిన విధి చేత పాలించబడుచున్నదని ఆ పాత్రముయొక్క నమ్మకము. లేక హెలెన్, క్రెస్సిడాలను తీసికొని చూచినచో, యౌవన పుష్పము మధువులొలికెడివేళ, వారికి ప్రపంచమున లైంగికమైన సుఖానుభవము తప్ప వేర యేమియులేదు. మరి ఈ పాత్రములలో నెవరి దృష్టి సరియైనది? లేక ఆర్తిచేత, ఆమయములచేత హీనమైనది, వార్ధక్యమునకు, కాయికము, ప్రాకృతికము అయిన దుఃఖములకు, వ్యధలకు తావలమైనది, తుదకు, ప్రవిలీయమును చెందునది యయిన భౌతికదేహమునే ప్రసిద్ధమగు ఆత్మ ద్రవ్యముగా నెంచుటలో ఉగ్రమైన పట్టుదలను ప్రదర్శించుచూ, వరేణ్యములైన పాటోపములను, ఉన్నతములైన ప్రవర్తక ప్రత్యయములను, తిరస్కార పూర్వముగా అవహేళనము చేయుట యందు ఉగ్రస్వభావమును—వ్యక్తము చేసెడి థర్సైట్స్‌నకు ఏది ఏమియో యదార్థముగా తెలియునందుమా? షేక్స్పియర్‌నకు ఇచ్చట పక్షపాతములేదు. ఆయన ఎవరి పక్షమును వహించలేదు. తీర్పులను చెప్పలేదు. వార్తెన్ శబ్దమునకు యర్థమైన ప్రవక్తగా నాయన యుండదలచుకొన్నచో ఆయన పని తేలిక అయ్యెడిది. మరియు సుఖముగా గూడ నుండెడిది. ఆయన అట్లు చేయలేదు. ఆయన 'వార్తెన్' శబ్దమునకు మరియొక అర్థమైన కవిమాత్రుడుగా నుండిపోయినాడు. ఏది యేమో పరిశీలనచేసి, అన్వేషించి, యున్నదానిని యున్నట్లు లిఖించిన లేఖకుడుగా నుండిపోయినాడు. ఏది యెట్లుండవలయును అనెడి నైర్దేశిక సత్యముతో నీతిని గూర్చి, ధర్మములను గురించి ప్రఖ్యాపనము చేయలేదు. ఒక ప్రత్యేక ధర్మము వైపునకుగాని, లేక కార్యాచరణ విధానము వైపునకుగాని, పాఠకులను లాగుకొని పోవలయునన్న ప్రయత్నము చేయుట గూడ ఆయనలో కన్పించదు. తాను ఒక కథను చెప్పుచున్నాడు. ఆ కథలో పెద్ద విశేషమేమియునులేదు. మరియు నది యంతగా ఆనంద సంధాయకమైనదియు గాదు. కాని అందులో షేక్స్పియర్ ఏమి చేసినాడనగా, తన పరిశీలనముయొక్క ఫలితములను గుది గ్రుచ్చినాడు. ఆత్మావలోకనము చేసికొని, ఆ అనుభవ పరమార్థమునందులో నింపినాడు. ఏది వున్నదో, దానిని గూర్చిన ప్రమను మనకు కలికి కవిత్వముఖమున అందజేయును, ఆ కవితా పాకమును అంగీకరించుటకో, అట్లుకాని పక్షమున తిరస్కరించుటకో, మనకు స్వాతంత్ర్యమును గూడ వదులుచున్నాడు.

ఆత్మావబోధము అన్నది ప్రథమతమఅనుభవములను గూర్చిన ఎరుక. మరి అనుభవము లనగానేమి? అవి శబ్దములకందని సంఘటనలు. అంతియగాక, అస్తిత్వమును గూర్చి సత్యాభాసమైన స్ఫుటత్వము ఏర్పడి, దానికి ప్రత్యయ రూపమైన ఆకారము ఏర్పడక ముందున్న వాసనా విశేషములు; ఇది ఇట్టులయిన పక్షములో సాహిత్యమును గూర్చిన తాపత్రయము దేనికి? ఎందుకు సమీచీనమైన, అద్వితీయమైన, శబ్ద శరీరము గల్గిన, ఉత్తమ అభివ్యక్తి కోసము మృగయా వినోదము వతుగా నానా అవస్థలు పడటము? ఈ ప్రశ్నలకు లభించే ప్రత్యుత్తరము లోక విరుద్ధముగావుంటుంది. శబ్దముచేత పట్టుటకు వీలుకాని అవాఙ్గోచరములైన అనుభవములయొక్క సూక్ష్మ రచనా రీతులను మనము ఎరుగుటకు మరల శబ్దములవలననే సాధ్యమగుచున్నది. ఒక పులిని

చూచినప్పుడు, కల్గు భయోత్పాతమును గురించిగాని, లేక పన్ను పోటువలన కల్గు బాధను గురించిగాని, మనము తెలియుటకు ఒక నవలా రచయితగాని, ఒక కవిగాని అక్కరలేదు. కాని అన్ని అనుభవములు ఇట్లుగా నుండవు. ఇట్లుగా స్ఫుటముగా, కొట్టవచ్చినట్లు అనుభవమునకు రావు. మరియు కొన్ని అనుభవములు మనస్సునకురాక, జటిలముగా, నానావిభాగసంహతిని కల్గియుండును. ఇట్టి పరిస్థితులలో కవులు, నవలా రచయితలు మనకు తోడుపడుచున్నారు. వారి అవసరము మనకు కల్గుచున్నది. మనము ప్రేమలో పడినచో, ప్రేమలో పడుట వలన కల్గు అనుభవ మెట్టులుండునో వారివలన మనము తెలియగల్గుచున్నాము. మనము కాతరులమైనప్పుడు, లేక లజ్జాళువులమైనప్పుడు, లేక ఏదో దోషమును అచరించినామన్న బాధలో మున్నప్పుడు, అప్పుడు ఎట్టి భావములు మనలో కల్గునో, వాటిని గూర్చిన ఎరుకను ఆ కవుల సాహాయ్యమున, నవలా రచయితల సాహాయ్యమున పొందగలము. అనుక్రోశము—జుగుప్స, మెప్పుదల—అభ్యసూయ, అనురాగము—అసహ్యము—ఇట్టి భావములు ఒక్కొక్కప్పుడు యౌగపద్యముగా కల్గుట యుండుము. ఇట్టివి అనుభవమునకు స్ఫుటముగా అందని గడ్డు విషయములు. వీనిని వ్యక్తపరచి మనకు చెప్పగల్గుటలో గూడ కవులును, నవలారచయితలును సమర్థులు. మరి సామాన్యుడు ఆ నవలలను, కవిత్వములను పఠింపనిచో, ఇట్టి భావములు, అతడు నిజముగా అనుభవించుచున్నను, అతని ఎరుకకు స్ఫుటముగా అందుటలేదు. కవియు, నవాలారచయితయు ఇట్టి నిగూఢ వేదనలకు శబ్దశరీరమును కల్పన చేయుటచేత, ఆ వేదనల వివిధ దశలను సాక్షాత్కరింపచేసుకొని, పద్యములలోనవో, గద్యములోనవో వెలువరించుటచేత, మనలోవుండి, మనకు అవగతముకాని, అవాగ్గోచరములై, సర్వ ప్రత్యయములకు వేరై, సాదృశ్యముచేత ఒక్కటైన వేదనలను, భావములను చెప్పుటచేత, మనము గూడా వానిని అవగతము చేసుకొనగల్గుచున్నాము. అనుభవించగల్గుచున్నాము. శబ్దశరీరియైన భావనము, మన ఉనికికి ఆధారమైన అవాగ్గోచర అవ్యక్త భావనము తెలియుటకు దారి చూపును. ఆత్మావబోధమనగా ఈ అశాబ్దిక క్షేత్రమును ఎరుగుట. మరి ఆ అశాబ్దికక్షేత్రమును చేరుమార్గము, శబ్దమయ ప్రపంచమునందున్నది.

అనగా, సాహిత్యము ద్వారమున మనము మన అనుభవములను అవగతము చేసుకొనగల్గుచున్నాము. అర్థము చేసుకొనగల్గుచున్నాము. ఒక వ్యక్తి ఒక అనుభవమును పొందుచున్నాడనగా, ఆ పొంద గల్గుట, అతని దేహరచననుబట్టి, మూర్తినిబట్టి, ప్రకృతిని, స్వభావమును బట్టి, మరియు అతని ఆవరణ పరిస్థితినిబట్టియు నుండును. ఫాల్‌స్టాఫ్‌వంటి మూర్తిగల వ్యక్తి, హాట్‌స్పర్‌వంటి మూర్తిగల వ్యక్తికివలె ప్రపంచమును అనుభవించలేడు. పిక్‌విక్‌వంటి వాని శరీరములో కాషియస్‌వంటి వానిశీలము ఎక్కడును ఇముడదు.

జీవితము సాహిత్యముపై తన ప్రభావమును ఎట్లు చెల్లించుకొనుననగా, ముందు, ఆ సాహిత్యము సృష్టించువారిపై తన ప్రభావమును చెల్లించుట ద్వారా, సాహిత్యమును ప్రభావితము చేయును. తమ పరిసరముయొక్క ఒత్తిడులకు, ప్రచోదనములకు ఈ సాహిత్య సృష్టికర్తలు తమ స్వభానుశీలములను బట్టి, తమ శరీరసంస్థాన పద్ధతులనుబట్టి ప్రతిసంభావితులగుటయుండును. అందువల్ల అధునాతన సాహిత్యమును గురించి మూకఉమ్మడి నిగమనములనుచేయుటయు, చేయగా వాటిని అంగీకరించుటయు, అంతగామంచిదికాదు. ప్రాకృతస్థితిని దాటికిపైకి వచ్చిన ఏ సమాజముగాని, సజాతీయ ధర్మబద్ధమై వుండదు. భిన్న జాతీయమైన సామాజికఆవరణములో ప్రతిసంభావనము చేయు రచయితలు—వీరు వేరువేరు వ్యక్తులు—వారి మూర్తివిశేషములేమి, స్వభావానుశీలములేమి, ఉత్తర దక్షిణ ధృవముల పోలి దూరములుగా కూడ నుండవచ్చును—అద్వితీయులని చెప్పవలసియున్నది. ఈ విషయములన్నిటిని మనస్సులో పెట్టుకొని, ఇప్పుడు మన చుట్టును ఝటితిస్ఫూర్తిగను, ఆత్యంతికముగను జరుగుచున్న మార్పులు ఏవిధముగ ఆధునిక జీవితమును, అద్యతన సాహిత్యమును ప్రభావితము చేయుచున్నవో పరిశీలించవలసియున్నది. ఇప్పుడు మన చుట్టునుఉన్న నూతన ఆవరణ విశేషమువలన, ఎట్టి ఎట్టి నూతనానుభవములు మనపాల పడుచున్నవి? ఇరువదియవ శతాబ్దములో బ్రతుకుచున్నందువలన కల్గుచున్న మనస్తత్వ సంబంధమయిన కొన్ని ఫలితములను, లేక పరిణామములను ఇక్కడ ముందుగా వివరించవలసిన అవసరము ఉన్నది.

మొదటిఫలితము:—మనము ఉదజని అస్త్రమునకు, ప్రచ్ఛన్న యుద్ధమునకు సమకాలికులము. ఇందువలన చాల మంది ఒక విధమైన నిర్వేదమును, నిరంతరమైన ఆందోళనమును చెందు చున్నారు. మరియు బ్రతికి ఎందుకనిన భావము గూడ వారిలో కల్గుచున్నది. ఏ క్షణములోనయిన ఆ క్షణములో పడిపోగల ప్రపంచముఉండి ఏమి లాభమన్నభావము గూడ పొడము చున్నది. అందువలన ముందుఆలోచనము, ప్రయత్నము, శ్రమ మొదలైన ఉత్తేజక లక్షణము గూడ కొరగానివై పోవుచున్నవి.

రెండవఫలితము:—మనము వర్తమాన వస్తూత్పత్తి, వస్తువిభాగ పద్ధతులకు సమకాలికులము. సాంకేతిక విజ్ఞానములో

సాధింపబడుచున్న ప్రతి ఒక్క అభివృద్ధియు సమాజ వ్యవస్థలో గూడ తుల్యమైన అభివృద్ధిని వాంఛించుచున్నది. మరి ఇట్టి అభివృద్ధివలన జరుగుచున్న విచిత్రములను గూడ మనము గమనించవలసివున్నది. రాను రాను జనము అధికముగా సున్నములైన వ్యవస్థలకు లోగి పనిచేయవలసిన వారగుచున్నారు. ఆ పని చేయుట వారికోసముకాదు. పారిశ్రామిక కార్యక్రమ క్షమత్వము కొరకు, ఉద్యోగధర్మఫలసాధకత్వముకొరకు అట్లులయిపోవుచున్నారు. మరి ఆ కార్యములపై వారికి అధికారము ఏమైన యున్నదా అన్నచో అది కన్పించదు. అట్టి అధికారము వారికి సుతరామూలేదు. అందువలన ఒక నిస్పృహ, ఒక ఏమియుచేయలేనితనము విస్తరించుచున్నది. తమ భాగధేయమునకు తాము అధిపతులము కాలేక పోవుచున్నామే అన్న వైక్లబ్యమువలన వారిలో ఈ నిస్పృహ జనించుచున్నది. సాంకేతిక విజ్ఞానము పెరుగుచున్న కొలదియు, అధికారము అత్యల్ప సంఖ్యాకులయినవారి చేతులలో కేంద్రీకృతమగుచున్నది. అట్లు జరుగుట ఆ అభివృద్ధి లక్షణమో! అన్నట్లు గూడ ద్యోతకమగుచున్నది. 300 కోట్ల మందిసామాన్య జనము, వేళ్లమీద లెక్కకు వచ్చు అత్యల్పసంఖ్యాకులయిన రాజకీయవేత్తలయొక్కయు, సేనానులయొక్కయు, పరిపాలనానిర్వాహకులయొక్క దయాదాక్షిణ్యములపై ఆధారపడి యుండవలసిన వారగుచున్నారు. మరి ఈ యందరు వివేకులా, సజ్జనులా అన్నచో, నదియును చెప్పలేము. వీరందరును ఒకానొక రాజకీయపద్ధతికి బందీలయి గూడ యున్నారు. మరి ఆ రాజకీయ పద్ధతి యెట్టిది? విగ్రహారాధనమును పోలిన జాతీయ తత్వజన్యమైనది. అది అట్టిదగుటవలన విలయమునకేగాని, మరియొక రకమైన పర్యవసానమునకు దారి తీయుటకు సమర్థమైనదికాదు. అగుటకు వీలు లేదు. అందువలన జనము అనుభవించుచున్న నిస్సహాయ స్థితి సామస్త్యముతో సంపూర్ణమైన పరుషవృత్తి, వక్రశీలము సంవలితమై కన్పించుచున్నవి. అదియొక వైఖరిగ గూడ ఏర్పడుచున్నది.

సాంకేతిక విజ్ఞానము పెంపొందుటతో ఉద్భవమగుచున్న మరియొకరకమైన సమస్య జనాభా పెరుగుదలకు సంబంధించినది. ఈ మధ్య ప్రపంచ జన సంఖ్య మరియు త్వరితముగ పెరుగుచున్నది. హఠాత్తుగా పెరుగుచున్నది. క్రీస్తు పుట్టిన రోజులలో ఈ ప్రపంచమునందలి జనసంఖ్య 25 కోట్లకు మించియుండలేదని అంచనాలు వేసినారు. అది అంతకు రెట్టింపు అగుటకు 16 శతాబ్దములు పట్టినది. కాని, ఇప్పుడు ప్రపంచపు జనసంఖ్య 300 కోట్లు. ఇది 600 కోట్లు అగుటకు 40 సంవత్సరములకన్న ఎక్కువకాలము పట్టదనుచున్నారు.

ప్రపంచముయొక్క జనసంఖ్య ఇట్లు ఆకలేక పెరుగుచున్న కారణమువలన పట్టణముల సంఖ్యయు అధికముగుచున్నది. అధిక సంఖ్యాకులయిన ప్రజలు ఇప్పుడు మనుష్య సృష్టములైన పరిసరములతో నివసింపవలసిన వారగుచున్నారు. అచ్చటి పసివాండ్రలో చాలమంది ఆవు ముఖమును చూడనివారు, ఒక ఫల వృక్షమును తిలకించియుండనివారు, పంట పొలమును కాననివారు కలరన్నచో, అందు ఆశ్చర్యమేమి? ఇట్టి పరిస్థితులలో నేర్పడు మానసికములైన పరిణామములవలన తొలుతగా అనుభవజ్ఞానము సంకుచితమై పోవుచున్నది. అంతియగాక, అనుభవ హానియు జరుగుచున్నది. అధునాతనమైన నే పట్టణములోనైనను బీభత్సమైన జీవితమును నడుపుకొనవలసినవారగుచున్నారు. దానికి విరుపు కన్పించుటయులేదు. వారికి తదితరమైన జగత్తుతో, ఉత్సాహకారకమైన జగత్తుతో, సహజమైన, ప్రకృతిసిద్ధమైన జగత్తుతో, ఆ జగత్తునకు సంబంధించిన గూఢతత్త్వముతో సంబంధములేని వారైపోవుచున్నారు. అందువలన, నిసర్గసిద్ధము, అకృత్రిమము అయిన కవితాత్మ యొక్క సౌందర్యమును వారు అనుభవించలేనివారు, అదిలేనివారు అగుచున్నారు. (ఈ సందర్భమున ఒక్క ముఖ్య విషయమును చెప్పవలసియున్నది. ఇప్పుడు గూడ కవులు ప్రకృతిని గురించి గానముచేయుచున్నారుగాని, అది చెప్పుకోతగినదియై యుండుటలేదు. ఇప్పుడు ఈ ప్రకృతికి సంబంధించిన వ్రాతలు శాస్త్రవేత్తలవలన సాగుచున్నవి. సాహిత్యముతో సంబంధములేని, కొద్దిమాత్రపు సాహిత్యమును కల్గిన గ్రంథములు పక్షుల జీవితములను గురించి, మృగముల, కీటముల జీవితమును గురించి వెలువడుచున్నది. జనము ఈ గ్రంథముల నధికముగా ఆదరించుచున్నారు. ఇప్పుడు కవిత్వము పట్టణవాసులకు కల్గుచున్న హానిని గురించి కీర్తనము చేయుచున్నదేగాని, ప్రకృతిని గురించి అంతగా గానముచేయుటలేదు. దానిని కవులు ప్రాకృతిక శాస్త్ర శాస్త్రవేత్తలకు, జంతుశీలపరిశీలనవేత్తలకు వదిలివేయుచున్నారు. జనుల పారమార్థిక బుభుక్షను తీర్పవలసినవారు, అందువలన, ఇప్పుడు ఈ శాస్త్రవేత్తలయిపోయినారు.) ఇదిగాక, మరియు ఇతరమైన మానసిక పరిణామములు గూడ ఇందువలన సంభవించుచున్నవి. ప్రపంచములో ఒకానొక పెద్ద పట్టణములో కేవలము నాగర జీవితమునే నడుపుట వలన కలుగు విపర్యాసము లెట్టివో సాంఘిక శాస్త్రవేత్తలును, కవులును గూడ గ్రహించుచున్నారు. శాస్త్రవేత్తలు దానిని విచక్షించి చెప్పగా, కవులు ఆ విపర్యాసములను కవిత్వ రూపమున నభివ్యక్తము చేయుచున్నారు. పట్టణవాసులలో పెరుగు సంబంధములేని తనమును, సమాజము అంగీకాగా, అందులో నాగరులు అంగముకాని స్థితిని అనుభవించుటను, సతము సమూహములో జీవించుచు, నిరంతరమూ ఒంటరితనములోనుండి

బాధపడుటను, అటు శాస్త్రవేత్తలును, ఇటు రచయితలును, వారి వారి పద్ధతులలో అభివ్యక్తము చేయుచున్నారు.

ఇప్పుడు మరియొక పరిణామమును గురించి విచారింప వలసియున్నది. అదియును సాంకేతిక విజ్ఞానాభివృద్ధి ఫలితముగ నేర్పడినట్టదే. అది సంతాన నిరోధమునకు సంబంధించినది. ప్రస్తుతము ఈ సంతాన నిరోధపు పద్ధతులు పారిశ్రామికముగా ఔన్నత్యమును పొందియున్న దేశములలో ఆచరింపబడుచున్నవి. ఈ దేశములలో నిప్పుడు స్త్రీలకును, పురుషులకును సంసారము చేయుటయు, బిడ్డలను కనుటయు వేరై పోయినవి. ప్రజననము ఇప్పుడు శృంగార కార్యమునుండి ప్రత్యాఖ్యాతమై పోయినది. జన సంఖ్యను అదుపులో పెట్టు పద్ధతినిబట్టి ఆలోచించుచో, ఇది ఒక సుగుణముగనే అవభాసించును. కాని, ఇందు వలన కలుగు మానసికమైన పరిణామము లెట్టివి? ఒక విధముగా నవియు బాగుగనే యున్నవని చెప్పవచ్చును. స్త్రీ పురుషులు పరస్పరము స్నిగ్ధులగుటను దృష్టిలో పెట్టుకొని యోచించుచో కాయికమైనశృంగారానుభవమును ప్రాణిప్రజనన కార్యమునుండి పృథక్కరణము చేయుటవలన, ఆ స్త్రీ మధ్య, ఆ పురుషుని మధ్య అకృత్రిమయుమైన మానవీయ సంబంధము, స్వాభావికమైన అనుబంధము బలపడుచున్నది. ఈ ఒక్క లాభమును చూచుకొన్నచో, ఇందువలన కలుగు ఇతరమైన హాని ఎక్కుడై కన్పించుచున్నది. సంసారకృత్యమును, ప్రాణిప్రజనన కార్యమునుండి పృథక్కరించుటవలన, అతిలోక సుఖానుభవము సారములేనిది, లఘువు, తుచ్ఛమైనదియగుటకు మార్గమేర్పడుచున్నది. దుఃఖము నెరుగని శృంగారసంబంధమైన సుఖము, తేలికచేయబడుచో స్త్రీ, పురుష సంబంధము, ప్రతి ఒక్కనికి సులభముగ నందుబాటులోనికి తేబడిన లైంగికజీవనము, స్నిగ్ధతచేత సమర్థింపదగినది కాకపోయినప్పుడు, ఆధ్యాత్మిక జీవనమునకు వ్యయముగా పరిణమించుటయేగాక, అభిమానమును తొలగబెట్టి, పవిత్రతను కూలద్రోసి (శృంగార జీవనము, ప్రజనన కార్యమునుండి సంతాన నిరోధ సాధనముల ద్వారమున వేరు చేయబడినప్పుడు, పుణ్యపాపముల భావనము గూడ ప్రత్యాఖ్యాతము చేయబడుచున్నది) జీవితమునకు సార్థక్యములేమిని, అవిశిష్టక్షుద్ర భావమును సంపాదనచేసి పెట్టినదియగుచున్నది.

నూతనములైన అనుభవముల సామస్త్యమువలన మన చుట్టునున్న ఆవరణము మారిపోవుచున్నది. పరిసరములు మారిపోవుచున్నవి. వీనిని శోధనము చేయుటయు, సమీక్షించుటయు, అర్థమును తెల్పుటయు, అప్పుడు వానికి సాహిత్య సత్త సముపాత్తమగునట్లు చేయుటయు జరుగవలసియున్నది. అద్యతన జీవితము అద్యతన సాహిత్య నిర్మాతలను ప్రభావితము చేయుట సహజము. మరి అట్టిసాహిత్యమునకు తమ్ము ఆపావృతులను చేసికొని, దానిని అనుభవించువారు, అధునాతన నాగరక జీవితమునందలి ఉద్వేగము, ఆందోళన, వ్యగ్రత, నిష్ప్రయోజకత్వము, నిస్సహాయస్థితి, వక్రశీలము, సంబంధములేనితనము లేక పృథక్త్వము, ఒంటరితనము లేక విశ్లేషము—ఈ అన్నింటి సంగతి యేమో తెలిసికొని, అధికభయదర్శకమైన సంబాధ సంవిధానమునకు, బహుళజనసంఖ్యకు, మిక్కుటముగా నాగరీకృతముచేయబడుటకు భాజనమగుచున్న ఆవరణమువలన లభ్యమగున్న అనుభవమెట్టిదో, అర్థము చేసికొన వలంతులగుదురు.

# చిన్నయసూరి

శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తి

[ప్రప్రథమముగా ఆంధ్ర ప్రభుత్వమునకు మార్చి నెలలో శ్రీ చిన్నయ సూరి వర్ధంతి జరుపుటకు శుభేచ్ఛ కలిగినది. ఆ సందర్భములో ఆంధ్రవరరుచికి సమర్పించు కవితోపహారమిది.]

సన్మతి నీ స్మృతిచ్ఛవులు మార్కొని నిన్న గతించినట్టులై
ఉన్మథనమ్ము పొందినవి—ఒక్క ప్రభాతము వాఙ్మయ ప్రపం
చోన్మిషితమ్ము నీవని మహోదయు లాంధ్రులు పల్క సాహితీ
చిన్మయ సూరివై చనిన చిన్నయసూరి! కృతజ్ఞతాంజలుల్.

ప్రజలకు దూరమై తెలుగు బాలిక పోలిక పోల్చరాక య
క్కజముగ సంస్కృతాటవుల కన్పడి కన్పడకుండనక్కనన్
విజయము చేసి నీ కలము వేసిన వ్యాకృతి మార్గమందు త
న్నిజ సుకుమార రూప రమణీయత చూచితిమయ్య నీ కృపన్.

చిరుసూత్రమ్ముల పోహలించితి వహో చింతామణీకారికా
వర భాష్యార్థ సమస్తమున్ వరరుచి ప్రజ్ఞా సమప్రజ్ఞతో
తిరుమంత్రంబయిపోయె నీ యభిధ యీ దేశమ్ములో తెల్గు వ్యా
కరణం బాంధ్రులు సంస్కృతాన చదువంగా నేడనావశ్యమై.

బాలవ్యాకరణమ్ము చేసితివి విద్వత్పాత్ర యోగ్యంబుగా
నీలో దాగిన పాండితీ గరిమకున్ నేత్రమ్ముగా, తెల్గు నీ
మూలానన్ గద నేడు శాస్త్రరచనా పూర్ణాధి కారంబుతో
శ్రీ లాలిత్య గుణంబు గల్గి ప్రకటించెన్ వర్ధమాన ప్రభన్!!

దీపారాధనమీవ చేసితివ యాంధ్రీదేవి నట్టింట ఆ
నీ పుణ్యంబున మాపదంబులు సదా నిర్భీతితో సాగుగీర్
వ్యాపారంబది సంస్కరింపబడ—నీపై గౌరవ శ్రీ యిటుల్
రూపస్వీకృతి చేసె-త్వత్పరిచితతార్యుల్ చూచు స్మృత్యంకమై.

# పృథ్వీగీతం

ఈనాడు ప్రపంచ మంతయు ఒకానొక సందిగ్ధావస్థలో పడి అట్టుడికే నట్టుడికి పోవుచున్నది. భౌతిక రసాయనికాది శాస్త్రములు మహోవేగముతో అభివృద్ధి చెందుచున్నవి. మానవుడు గ్రహాంతర ప్రయాణమునకు సన్నద్ధుడగుచున్నాడు. కాని అతడు భూలోకవాసి. ఈ భూలోకము యుగయుగాలనుండి సంస్కృతి వైవిధ్యము సంపాదించుకొన్నది. ఈ సంస్కృతికి మానవుడు ఔరసుడు. అతని నరనరములలో ఈ సంస్కృతి జీర్ణమై పోయినది. భౌతికశాస్త్రాది పురోగమనమువలన నానాడు మానవుడు తాను నమ్మిన సంస్కృతి మంచి సెబ్బఱలను ఎంచుట మొదలిడినాడు.. అతడు జన్మారంభమునుండి పెంచుకొన్న సంస్కృతి బాంధవ్యమును త్రోసిరాజనలేక పోవుచున్నాడు. ప్రత్యక్షప్రమాణము, హేతువాదము, ప్రయోగపరిశీలనము—వీని నాశ్రయించి, మూడుపూలారుకాయలుగా పింపిళ్ళ గూసి, సర్వ మానవీమానవ సుఖసంపాదకము అయిన విజ్ఞానశాస్త్రములను కాదనలేక పోవుచున్నా డతడు. ఒకవంక మతధర్మాదులు, మరొకవంక శాస్త్రవిజ్ఞానము—మానవుని తన వైపునకు త్రిప్పుకొన వలయునని క్రుమ్ములాడుకొనుచున్నవి. వీని అలబలమునకు తట్టుకొనలేని నరుడు తబ్బిబ్బగు చున్నాడు. ప్రశ్నార్థక చిహ్నములతో ప్రపంచమును, తత్పరిణామ పర్యవసానములను అతడు పరిశీలించుచున్నాడు. కాని ఇంతవఱకు తత్ప్రశ్నోచిత సమాధానము లభించలేదు. లభింపదు గదా యని మానవుడు తనపట్టుదలను వీడడు. ప్రయత్నములు విరమింపడు. ఈ పరిశీలనము చేయుచున్నప్పుడు మానవునిలో అంతర్ముఖదృష్టి ప్రబలినది. అతడు తన్ను దాను పరీక్షించికొన ప్రారంభించినాడు. ముందు తన్నుదాను తెలిసికొన్నచో పిదప ప్రపంచరహస్యము బోధపడును. కాని యీ పరిశీలనములో మానవుడు కృతార్థుడు కాలేదు. కృతార్థుడు కాలేక పోవుటయే కాక బృహన్మానసిక సంక్షోభము అనుభవించుచున్నాడు. తత్ఫలితముగా అత డుక్కిరి బిక్కిరి యగుచున్నాడు. మానవుని ఆరాటమును, ఆత్మపరిశీలనమును, అంతర్మథనమును చిత్రించుచు మాదిరాజు రంగారావుగారు "పృథ్వీగీతం" రచించిరి.

నవ్యాంధ్రసాహిత్యములో భావకవిత్వము బహుళముగా బయల్వెడలినది. వచనపద్యమును నూతన ప్రక్రియకధి కాదరము లభించినది. ప్రథమముగా భావకవిత్వము ఆత్మప్రణయపరముగా అవతరించినప్పటికి కాలక్రమమున అది తత్త్వచింతనోన్ముఖ మయినది. ఈనా డనేకులు తత్త్వవిచారము చేయుచు ఆత్మాశ్రయకవిత్వమును అల్లుచున్నారు. వచనములో, పద్యములో వచనపద్యములో అట్టి కవిత్వము ఆకృతి వహించుచున్నది. వచనపద్యము వ్రాయువారికి టి. యస్. ఇలియట్ ఆదర్శ కవిగా నున్నాడు. వచనపద్యపద్ధతిలో తత్త్వచింతన గావించినవారు రంగారావుగారు. షడ్భాగముల పరిమాణముగల చిఱుకబ్బ మిది. దీని యంతట మానవజీవనతత్త్వము ప్రాచీన నవీన గతి భేదములతో పరామర్శింపబడినది. గ్రంథకర్త మానవునిలో గల దివ్యరాక్షసాంశలను కనుగొన్నారు.. కనుగొనుటయే కాదు.

> "ఈ సమార్ద్ర ప్రవృత్తియొక్క వివృతరూపం
> సంగీతం, సాహిత్యం, శిల్పం, త్యాగం
> ఈ సమార్ద్ర ప్రకృతియొక్క సంవృత రూపం
> అధికారం తీరనిదాహం వ్యాపారమనోలక్షణం"
>
> (పుట. 8)

అని చాటినారు. మానవుని నిరాశామయ జీవితము, దానిని స్వర్గతుల్యముగా చేయుటకు అతడు పడుపాటులు వర్ణింపబడినవి. మానవ స్థిరాంతఃకరణము, అపజయములో జయమును దర్శించు దానిప్రవృత్తి విపులముగా ప్రశంసింపబడినవి.

> "అధికార వ్యామోహం, కీర్తికాంక్ష ప్రబలి
> అంతరింపబడిన ఒక రాజవంశ రక్తంలో
> తడిసినట్టిదే వేరొకటి ఆవిష్కరింపబడి
> అణగద్రొక్కబడిన ఒక జాతి, మతం స్థానంలో
> జరుపబడి వేరొకజాతి మతాభ్యుత్థానం
> .... .... .... .... .... ...
> .... .... .... .... .... ....
> నిల్వడానికే నిన్నటి వరకు సాగిన రాజరికం
> చేసిన సర్వతోముఖ ప్రయత్న ఫలితం"(పు.11.12)

అని అన్నపుడు మనకు శ్రీ శ్రీ లీలగా కన్పించును. రంగారావుగారు భావావతారము కొఱకు ఊహా చిత్రములను సృష్టించుటలో గడుసరి.

> "జీవిత మొక చివర తెలియని చీకటి సంతెన
> సంఖ్య తెలియని అనుభవాల వెలుగు మెట్లపై
> అడుగడుగున కొక పునర్జన్మ ఎత్తినట్టుగా
> గమనం సాగించు (పుట. 9)

పృథ్వీగీతం:—కర్త:—మాదిరాజు రంగారావు, ప్రాప్తిస్థానము:— నాగార్జున బుక్ డిపో, నారాయణగూడ, హైదరాబాదు వెల 1-00

అని యనుటలో వారొక మధురోహ చిత్రమును సృష్టించి నారు.

"అవిచ్ఛిన్న కాలగమన స్వరూప వ్యాఖ్యానమతులు
రవికీ శశికీ గల సంబంధం, మనకుగల బాంధవ్యం"
(పుట. 5)

అని అన్నప్పుడు.

"ఒక పెద్ద ఇసుకదిబ్బవలె పగలు
నల్లని రాతిగుట్టవలె చీకటిరాత్రి
గాలిలో తేలు దూది పింజలవలె వెన్నెల
నీటి బిందువుకోసం మానవుని తహతహ. (పు. 15)

అని యన్నప్పుడు రంగారావుగారి యూహా వైచిత్రి గోచరించును. మఱి వారి భావుకతకు కావ్యమంతయు తార్కాణ.

వక్తవ్యములయిన భావములను స్పష్టముగా చాటుటకు గ్రంథకర్తకు కారయిత్రీ శక్తి పుష్కలముగా నుండవలయును. భావము లెంత క్రొత్త లయినను అవి పాఠకుని మనసున కెక్కవలయును. అప్పుడు గాని కవి కృతార్థుడు గాడు. ఇక్కడే కవనములో అన్వయమున కున్న ప్రాధాన్యము గోచరించును. రంగారావుగా రాంధ్రభాషా కారకమును పాటించుటకు ప్రయత్నింపలేదు. భావములలో క్రొత్తదన మున్నంతగా వారి కవిత్వములో అన్వయసౌలభ్యము చూపట్టదు. ఒక్కొక్కచోట దూరాన్వయము తారసిల్లును.

"ఆకాశంపైని ఒక్కొక్క నక్షత్రంయొక్క హాసం
శ్మశానంలో నిప్పు రవ్వలవలె భావింపజేయు రాత్రి
పరుపబడిన చీర కుచ్చెళులలో దాగిన పృథివి
విసరబడిన కొంగుచాటున కన్పించని దిగ్వలయం"
(పుట. 7)

మున్నగు చోట్ల దర్శనశక్తి యున్నంతగా ప్రదర్శన శక్తి కనపట్టదు. అన్వయక్లిష్టత పద్యములం దుంటకు ఛందస్సు కారణమనుకొనవచ్చును. కాని "పృథ్వీగీతం" వంటి కావ్యములలో అన్వయక్లిష్టత యుండుటకు హేతువు కానము. 'యొక్క' యుపయోగము, "పడు" ధాతు ప్రయోగము బహుళముగా నున్నవీ లఘుకావ్యములో. వానివలన రచనకు ఇంపుగాక పడలింపు దాపురించును. అంతేగాక యీ కావ్యములో బంధము మొక్కవోయిన చోట్లు చాల కలవు.

"నా మనశ్చక్షువునకు నీ రూప మెంత దగ్గఱ అంటే
నా రూపానికీ నీడకూ మధ్య ఎంత దూరమో అంత"
(పుట. 4)

అని యనుటలో బిగి కానరాదు. రంగారావుగారి యూహా వైచిత్రిగల పాఠకులు "పృథ్వీగీతం" పఠించి క్షణకాలమయిన అంతర్ముఖు లగుదురు.

శ్రీ ఎన్. జి. ప్రసాదరావు.

# రచయితలకు మనవి

భారతిలో మేనెలనుండి ప్రతి నెలా ఒక చిన్న నవల ప్రకటించవలయునని సంకల్పము. నవల అచ్చులో 15 పేజీలకు తక్కువకాకుండా, 25 పేజీలకు మించకుండా ఉండవలెను. మే నెల సంచికలో ప్రకటించడానికి వ్రాతప్రతి ఏప్రిల్ 20 కి మాకు చేరవలెను. ఆ తర్వాత ప్రతి నెలా 5 వ తేదీకి చేరవలెను. ఆమోదింపబడిన నవలకు రు. 101-00 లు ఇవ్వబడును. అనువాదాలు అంగీకరింపబడవు.

రచయితలు తమ రచనలను సంపాదకుడు, భారతి, అని పంపవలెను. ఉత్తరములుగాని, రచనలనుగాని సంపాదక వర్గములో ఎవరి పేరనూ పంపవద్దని మనవి. ఈ విషయమును ముఖ్యముగా గమనింప ప్రార్థన.

—సంపాదకుడు, భారతి.

# రాసలీల: దాని వికాసము

శ్రీ కర్ణ రాజశేషగిరిరావు

రాసలీల జానపద నాట్యము. ఇందు ప్రజాభిరుచి వ్యక్తమగుచున్నది. ఇది అభినయానుకూలము. ఇందు జానపద హృదయము స్పందించుచుండును. ఇవి నేడు శృంగార లీలల కాలవాలమ్మైనవి. ఇతర ప్రాంతము లందున్న పరంపరానుగుణ నాట్య పద్ధతులమీద దీని ప్రభావ మెక్కువగా పడిన దనుటలో సందియము లేదు. నేడు రాసలీల లోకనాట్య సంపత్తియైనది. ఇది లోక వస్తువు.

వ్రజప్రాంతము దీనికి కేంద్రము. ద్వాపరయుగములో శ్రీ కృష్ణు డవతరించినదాది రాసలీల లున్నవని పరంపరానుగత విశ్వాసము. జానపదులం దీ కృష్ణలీల లభినయరూపము నాశ్రయించిన వనుటలో విప్రతిపత్తి యేమియు లేదు. దానలీల, మానలీల, మాఖనచోరి (వెన్నదొంగతనము)ఆది యభినయములు, సూరదాసు మొదలగు 'అష్టఛాప' కవుల పదముల నాధారముగా గాని, ఈ లీలలు రూపొందినవి. 15, 16 శతాబ్దము లందీ పద్ధతి వ్రజప్రాంతమున విలసిల్లియున్నది. నందదాసు, వ్రజవాసీ దాసు, ధ్రువదాసు మొదలగు భక్తులు 'రాసో' రచనలను గావించి 'రాస' వికాసమునకు దోడ్పడిరి. నేటి రాసలీలలందు కథోప కథన పద్ధతి, గీతబద్ధశైలి, సంగీతము జోడింపబడినవి. 'వ్రజవాసీదాస' కృత 'వ్రజ విలాసము' నారాయణస్వామి విరచిత 'వ్రజ విహారము' రాస రసికజనపారాయణ గ్రంథములు.

డాక్టరు దశరథ ఓఝా హిందీ నాటక వికాసమునకు రాసలీల లెంతో తోడ్పడిన వని అంగీకరించినారు. దీనికి కారణము నాటకము లానాడు ఛందోబద్ధమ్మై, గేయ రూపమున నుండు టయే. ఇందు గద్య ముపేక్షింపబడినది. పాత్రలు ప్రారంభము నుండి చివరివరకు వేదికపై నుందురు. ప్రవేశ నిష్క్రమణలు సూచింపబడవు. ఇవి నృత్యగీతప్రధానములు. మంగళాచరణము, ప్రశస్తిపాఠము 'స్వాంగు' నాట్యములవలె నుండును. రచనా ప్రయోజన మంతమందు తెలుపబడును. భాష తద్భవ ప్రధానము. పలుకుబడి అటనట కులుకుచుండును. రాసో గ్రంథములను బట్టి హిందీ నాటకారంభము 13 వ శతాబ్దమునుండి ప్రారంభమ్మై యుండవచ్చునని తేలినది. రాస పరంపరయే హిందీ సాహిత్యమును వందలకొలది యేండ్లు ముందుకెత్తిపోసినది. అపభ్రంశ సాహిత్యాధ్యయనమునకు 'రాస'పరంపర యెంతయో తోడ్పడుచున్నది. రాస సంబంధిత 'రహస' శబ్దమును పండితులు చర్చించిరి. ఇది రహస్య శబ్దమునకు వికృత రూపము. రాస నాట్యమును 'రహస'మని పిలుతురు.[1] వాజిద్ అలీ శాహ 'రహసు' లాడించెడివాడు. కేసరీబాగునందు 'రహసఖానా' రాసలీల లాడుటకు కట్టించెను.

రాసలీలలు హిందీ సాహిత్యమునకు సంబంధించిన విశేష సంపత్తి మాత్రము కాదు. ఉత్తర ప్రాంతమునందు బహుళ ప్రచారమున నున్న నాట్యరూపము. రాసలీల లొకవైపు నృత్య భూమిక నేర్పఱచినవి. రెండవవైపు నాట్య సామగ్రిని దృష్టిలో నిడుకొని రాసలీలల దభినయోపకరణములు సమకూర్చబడినవి. రాసలీల లోక, శాస్త్రనాట్య పద్ధతులకు మహా సేతువు. రాసలీల ప్రచలితార్థము, ప్రకారము కృష్ణచరిత్రకు సంబంధించినది. నృత్యాభినయమున కనువగు వివిధలీల లిందు పొందుపఱుపబడినవి. ఇందు సంగీతమునకు ప్రధాన స్థానమున్నది. కాని, సంవాద మంశరూపమున విలసిల్లుచుండును. అందువలన రాసలీల కతిపయ నాటక తత్వములను పుంజుకొని, జానపదనాట్యకళా రూపమున వేదిక నెక్కిన నాట్యకళాదేవి.

## 'రాస' శబ్దార్థము

రాసలీలలు రసప్రదానములు. 'రసానాం సమూహో రాసః'. రస సమూహమే రాసము. మహారాసమునందు కృష్ణుని యనేక రూపములు కల్పింపబడును. ఇద్దరు గోపికల మధ్య నొక్కొక్క కృష్ణు డుండును. ఇది యొక రసవత్తర ఘట్టము. రాసము లందు నృత్యము, అభినయము, సంగీతము ద్వారా రసనృష్టి యేర్పడును. కృష్ణుడు గోపికలతో మండలాకార నృత్య మొనరించును. ఇదియే రాసము. డాక్టరు కంకడ్ రాస శబ్దము 'రస' శబ్దమునుండి పుట్టలేదని యభిప్రాయపడుచున్నారు. నృత్యము చేయునపుడు బిగ్గరగా అరచుచుందురు. ఈ అరపులు జానపద నృత్యములం దీనాటికి కానవగును. దీనికి రాసమునకు సంబంధము కలదు. డాక్టరు దశరథఓఝా ఈయభిప్రాయమునే వెలిబుచ్చినారు. రాసశబ్దము సంస్కృత శబ్దభవముకాదు. ఇది దేశీయపదము. తదుపరి సంస్కృత శబ్దమ్మైనది. రాసమను

1. సాహిత్యకార్ సం. 6, సంచి. 2—పేజి 65.

జానపదనృత్యము నాట్యభేదముగా స్వీకరింపబడి సంస్కృత నాట్యశాస్త్రములందు జేరినది. రాసో, రాసక ప్రయోగము లీనాటికి రాజస్థానమునందున్నవి. రాసక్రీడలు గోపికలకు సంబంధించినవి. ఇది గొల్లలందు ప్రచలితమైన నృత్యముకావచ్చును.2

శ్రీరామచంద్ర శుక్లాగారు 'హిందీ సాహిత్య కా ఇతిహాస్' అను గ్రంథమునందు 'రాస' శబ్దమును వివరించిరి. 'బీసల దేవరాసో' యను వీరి కావ్యమునందు కావ్యార్థమున 'రసాయణ' శబ్ద మనేక పర్యాయములు వచ్చినది. అందువలన 'రసాయణ' శబ్దము నుండియే 'రాసో' శబ్ద మేర్పడి యుండవచ్చును. రస శబ్ద యుక్తములగుటచేత వీరోచిత గుణయుత గ్రంథములను 'రాసో' లని పిలువ నారంభించిరి.

## 'రాస'—'రాసో' పద్ధతులు

'రాస'—'రాసో' శబ్దములకు పరస్పర సంబంధము గలదు. శ్రీ హజారీప్రసాదు ద్వివేది గారు 'హిందీ సాహిత్య కా ఆది కాల్' యను పుస్తకమునందు 'పృథ్వీరాజ రాసో' యను వీర కావ్యమును సమీక్షించినారు. దీనిని వారు 'సందేశ రాసకము'తో పోల్చుచు, ఈ రెండు ప్రథమమున నొకేకోవకు జెందినవనియు, తదుపరి వేర్వేఱు పాయలుగా చీలి వెళ్లిపోయినవనియు చెప్పినారు. వీరి దృష్టిలో 'సందేశ రాసకము' మసృణగేయ రూపకము. 'రాసో' 'సందేశ రాసక' ప్రారంభ మొకే రీతి నున్నది. కాని, 'రాసో' ఉద్ధత రూపమునందున్న గేయ రూప మగుటచేత యుద్ధ వర్ణన కది యనుకూలము. యుద్ధవర్ణనలతోబాటు, వీర కావ్యములందు ప్రేమవర్ణన లుండుట సహజమే కదా! 'పృథ్వీరాజ రాసో' కథా కావ్యము. ఇది ప్రధానముగా ఉద్ధతప్రయోగ ప్రధాన మసృణ ప్రయోగయుక్త గేయరూపము.

రసప్రధాన రచన రాసో యనియు, రాజస్థాన ప్రాంతమున వర్ణనాత్మక గ్రంథములను 'రాసో' లందురని శ్రీ అగరచంద నాహటా అభిప్రాయపడుచున్నారు. ప్రాచీన జైనకృతులందు 'రాస' శబ్దము ప్రయోగింపబడినది. కాని, 'రాసో' శబ్దము ప్రయోగింపబడలేదు. 17 వ శతాబ్దము ఉత్తరార్ధమున, 18 వ శతాబ్దమున రచియింపబడిన కొన్ని వినోదపూర్ణరచనలందు 'రాస' 'రాసో' శబ్దములు కన్పట్టుచున్నవి.3

డాక్టరు మాతాప్రసాదగుప్తగారు 'హిందీ సాహిత్యకోశ' మునం దిట్లు వివరించినారు.

'రాస'ము గీతనృత్యపరకము. రాసకావ్యధారకు జెందిన దిది. లాస్యము నాలుగు విధములు : శృంఖలా, లతాపిండీ, భేద్యక లాస్యములు. లతా భేదములే దండరాసకము, మండల రాసకము, నాట్యరాసకము. 'రాసో' ఛందో వైవిధ్యపరకము. 'అపభ్రంశ' సాహిత్యమునందు 'రాసాబంధ' సాహిత్యము గలదు. 'రాసా ఛందస్సు'నందు వ్రాయబడుటచేత దీనికి 'రాసాబంధ'మని పేరు వచ్చినది. ఇతరబంధములు గూడ నుండును. ఛందో వైవిధ్యముగల రచనలను 'రాసాబంధము'లని, 'రాసక'ములని పిలిచిరి. ఇది నృత్య గీత రహితము. ఇది మిశ్ర ఛందోవిలసితము. ఇందు పాఠ్యతత్వము కాననగును.

'పృథ్వీరాజ రాసో' కథాకావ్యము. ఇది ఉద్ధత ప్రయోగ ప్రధాన మసృణ ప్రయోగయుక్తగేయరూపము. 'రాసో' పృథ్వీరాజ కాలమునాటిదైనచో అందు కొన్ని 'రాస' లక్షణము లుండక తప్పదు. ప్రారంభదశలో 'రాసో' సంజ్ఞక రచనలు చరిత్రకావ్యములేకావు; రాసకావ్య తత్వము అందు నిగూఢములు. 16 వ శతాబ్దమున రచియింపబడిన నరపతికవి కృత 'బీసల దేవరాసో' ఈ విషయమును ధృఢపరచుచున్నది. ఈ గ్రంథమునందు 'రాస'—'రాసో' శబ్దము ఉపయోగింపబడినవి. కవి స్వయముగా వీని పాడుట కనువుగా రచియింపబడిన గీతములని పేర్కొనినాడు. అవసరమని తోచినవు డొక్కొక్క యక్షరమును జోడించి పాడుచుండెడివారని కవి స్వయముగా వర్ణించినాడు. దీనినిబట్టి 'రాసో' కావ్యము లభినయ యోగ్యములనియు, గేయ కావ్యములనియు స్పష్టమగుచున్నది. కాని వర్తమానరూపమున 'రాసో' గేయకావ్యముగా కన్పించుటలేదు. ఇందు కథా కావ్య లక్షణములు కన్పించుచున్నవి. చరిత్ర కావ్యరూపమును దాల్చిన దనుటకు సందియములేదు.

రాసలీలలు లోకనృత్యములు. ఇవి లోకగీతముల రూపమున నెల్వడి రెండుపాయలుగా చీలినవి. మొదటిపాయ నృత్యగానము కొఱ కుద్దేశింపబడినది. రెండవది చదువుటకు, అభినయమున కనుకూలముగా నున్నది. మొదటికోవకు చెందినవి రాసగ్రంథములు. జైనమతప్రభావమువలన దీని రూపము మారజొచ్చినది. 15 వ శతాబ్దమున చరిత కావ్యమువలె కథా వస్తువును ప్రధానముగా స్వీకరించి పాడుట కనువుగానున్నవి. రెండవకోవకు చెందినవి 'రాసో' కావ్యములు. ఇవి గేయానుకూలములు. ఇవియు చరిత్ర కావ్యమువలె రూపొందినవి. రాజచరిత్రను గానముచేయుట కవి యుద్దేశింపబడినవి. యుద్ధవర్ణన, వివాహవర్ణన, మొదలగునవి మెండయినవి. 'జల్హ' కృత 'బుద్ధిరాసో' ప్రేమ ప్రధానకావ్యము. 15, 16, 17 శతాబ్దములందు రాస గ్రంథములందు కొన్ని చరిత్ర నాధారముగా దీపికొని వ్రాయబడినవి. కొన్ని మతవిషయముల

---

2. హిందీ నాటక్—ఉదయ్ ఔర్ వికాస్—పేజి 75—76.

3. నాగరీ ప్రచారిణీసభ పత్రిక సంపుటి 58, సంచిక 4.

నాధారముగా గొనియు, కొన్ని స్వతంత్ర కథావస్తువు నాధారముగా గొనియు, వ్రాయబడినవి.

'రాస'—'రాసో' లు రెండును వేఱురూపము లనియు, వీనికి పరస్పర సంబంధమేమియు లేదనియు కొందఱు పండితులు వాదింతురు. అందుకు కారణము:

| రాస. | రాసో. |
|---|---|
| నైతిక ప్రధానములు | శృంగార ప్రధానములు |
| వైరాగ్య మూలకములు | యుద్ధ వర్ణకములు |
| గేయరూపకములు | పాఠ్య కావ్యములు. |

ప్రాచీన కావ్యములను దృష్టిలో బెట్టుకొని పండితులు పై భేదములుసూచించుచున్నారు. కాని కాల ప్రమాణమును స్వీకరింతుమన్న నా రెండింటికి 500 ఏండ్ల వ్యవధానమున్నది. 17 వ శతాబ్దమునాటి 'రాస—రాసో' కృతులను జూచిన పై విషయము తేటతెల్లము కాగలదు. జైనుల రాసగ్రంథములు శాంత ప్రధానములు. అందువలన 'రాసో' గ్రంథములవలె ఉద్ధత ప్రయోగములిందు కానరావు. కాని, జైన కవులు 'రామ' గాథను దీసికొనినపుడు యుద్ధవర్ణన గావించినారు.

జనశ్రుతి ననుసరించి రాసలీలలు మణిపురీ నృత్యమున కాధారమని యందురు. ఒకనాడు శివుడు రాసలీలలు నేర్పాటు చేసెను. అప్పుడు పార్వతి నృత్యము, చిఱుగజ్జెల ధ్వనిని వినెను. రాసలీలలు చూడవలెనని యున్నదని పార్వతి శివుని కోరినది. శ్రీ కృష్ణుడు దీని కొప్పుకొనలేదు. ఒక రహస్య స్థానమున దీని నేర్పాటు చేయుటకు శ్రీ కృష్ణుడియ్యకొనెను. దేవతలను, గంధర్వులను, అప్సరసలను రాసలీలలను జూడ రమ్మని పిలువనంపిరి. నంది మృదంగమును, బ్రహ్మ శంఖమును, ఇంద్రుడు వేణువును దీసికొని వచ్చిరి. నాగరాజు కృపవలన స్థల మాలోక పూర్ణమాయెను. గంధర్వులు సంగీతము నారంభించిరి. రాసలీల ప్రారంభ మాయెను. ఏడు దినములు, ఏడు రాత్రు లీ యుత్సవము జరిగినది. మణిపురీనృత్యమున కిది యాధారము.

శ్రీ మద్భాగవతమునందు మరియొక కథ పేర్కొనబడినది. రాధకు అహంకారము, అభిమాన మావరించెను. ప్రధాన నాయకుడు శ్రీ కృష్ణు డంతర్థానమాయెను. మఱల వారిని స్మరించుచు, వారి లీల లాడుట మొదలిడిరి. శ్రీ కృష్ణుని పునర్దర్శనము లభించెను. వియోగశృంగారము రాసలీలల కాధారమని పై కథ తెలుపుచున్నది. భాగవతధర్మ ప్రచారమునకు రాసలీలలు తోడ్పడిన వనుటలో సందేహములేదు.

## మతప్రచార సాధనములు

కాళీయమర్దన మొనరించిన తరువాత శ్రీ కృష్ణుడు బృందావన వాసులతో నృత్యము చేసెను. అందులో నొకటి రాస లీల. మహాప్రభు వల్లభాచార్యుడు భాగవతపురాణములోని రాసలీలను వివరించెను. అందు రాసలీలలందు రాధా కృష్ణులేగాక బృందావన వాసులందరు పాల్గొనినట్లు వివరించిరి. ఇది మండలాకార నృత్యము. కృష్ణుడు మధ్య నుండును. గోపికలు వారిచుట్టు నిలబడి నృత్యములు చేయుచుందురు. అనేక ప్రాచీన చిత్రములందు రాధా కృష్ణులు మధ్యనున్నట్లు చిత్రింపబడినది. తాళము వేయుచు నృత్యము చేయుచున్నట్లు కొన్ని చిత్రము లందు చిత్రింపబడినది.

కృష్ణుడు చరిత్ర నాయకుడు. కృష్ణుని లీల లత్యద్భుతములు. దార్శనిక, సాంఘిక, రాజనైతిక విషయములందు నిజ ప్రతిభను చాటిన మహా పురుషుడు శ్రీ కృష్ణుడు. మధ్య యుగమునందు ఉత్తరభారతదేశమున కృష్ణలీలలే రంగస్థలమున కాధారమైనవి. రాసలీల లిట్టి జానపద నృత్యములే. శ్రీ మద్భాగవతమునకు రాసలీలలకు మాత్రమే సంబంధమున్నదనుకొనుట పొరబాటు. భాగవతపురాణములో శ్రీ కృష్ణునిలీల లభివ్యక్తమైన మాట నిజమే. కాని, దీనికి భిన్నమైన సంప్రదాయమొకటి యున్నట్లు జానపద సంస్కృతి తెలుపుచున్నది. ఇట్టి సంప్రదాయము జయదేవుని గీతగోవింద మందు విలసిల్లుచున్నది. భాగవత పరంపరానుగత రాసలీలలు శరత్పూర్ణిమకు చేయుదురు. గీతగోవింద పరంపరానుగుణ రాసలీలలను వసంతర్తులో నాడుదురు. సూరదాసు సమయమునకీ రెండు పద్ధతులు సమన్వయ పరుపబడినట్లున్నది.

జైనమత ప్రభావమువలన రాసలీలలలో కొన్ని మార్పులు జరిగినవి. (1) నృత్యగానతత్త్వము నెమ్మదిగా మాసిపో నారంభించినది. జినదత్తసూరి కృత 'ఉపదేశ రసాయన' రాసము గేయ కావ్యము. 'పద్ధడియా' బద్ధము. దీనిని సంగీతవిద్వాంసు లే రాగములోనైన పాడగలరు. కాని యిందు కొన్ని యాచారము లేర్పడినవి. జైన మందిరములలో శ్రైరవరాసము, తాలరాసము నిషేధింపబడినవి.

(2) ధార్మిక నాటకములవలె నభినయము వస్తువాయెను. బలభద్రుడు, చక్రవర్తిజినుడు మొదలగువారి గుణ గణము లిందు పొందుపరుపబడినవి. కవి సోలణుడు 'చచ్చరి' విరచించెను. ఇందు 'లకుట' రాసము నిషేధింపబడినది. కాని 1328 నాటి సప్తక్షేత్రరాసములందు జైనమందిరములందు బాహ్యప్రచలిత రాసవర్ణనలు పొందుపరపబడినవి. (1) తాలరాసము (2) లకుట రాసము. 1200 ప్రాంతములో లక్ష్మణకవి విరచిత 'సుపాసనా' చరితమునందు చేతితో తాళమువేయు పద్ధతి వివరింపబడినది. దీనినిబట్టి జైనమత ప్రచారకులు 12, 13, 14 వ శతాబ్దము లందు తాళ లకుట రాసము లాడెడివారని తెలియుచున్నది.

ధార్మిక గ్రంథములందు రాసశబ్దము దార్శనిక భావ విలసితమై బ్రహ్మముయొక్క పూర్ణస్వరూప సన్నద్ధమై రహస్య ప్రక్రియ రూపమును దాల్చినది. 'లీలా'వత్తు కైవల్యమ్మనునది పుష్టి మార్గ ప్రమాణము. ఈ 'లీలా' శబ్దము దార్శనిక శబ్ద జాలమునందు ప్రవేశించినది. భగవంతుడు రాసరూపుడు. రసమునందు వారి కానందము కల్గును. లీల రససృజనమున కాధారము. ఇదియే భగవంతుని ప్రేమస్వరూపాభివ్యక్తి.

రాసలీల లోకవాడు వెలువడినవికావు. వీని వికాసమున కొక క్రమ పద్ధతియున్నది. వీని వికాస క్రమము మూడు తెఱంగుల వెల్లి విరిసినది. (1) జైనరాస పరంపర. వ్రజ ప్రచలిత రాసలీల నారంభించిన దాది వచ్చుచున్నది. 16 వ శతాబ్దమువఱకీ సంప్రదాయము బహు ప్రచారమునం దున్నది. (2) వైష్ణవ ధర్మప్రచారమునకు రాసలీలలు తోడ్పడినవి. ధర్మ ప్రచారమునకు వైష్ణవాచార్యులు శ్రీ మద్భాగవతమునుండి వివిధ ప్రసంగముల నేర్చి కూర్చి, కథా వస్తువును రూపొందించి వినూత్న నాట్యశైలిని ప్రవేశపెట్టిరి. ఇది నందదాసుని సమయము వరకు ప్రచారము నందున్నది. (3) 17 వ శతాబ్దమునందు నందదాసు రాసలీలలను పరిష్కరించెను. శ్రీ వియోగి హరి విరచిత 'ఛద్మ యోగినీ లీల' (1978 విక్రమాబ్దము) విశేష ప్రచారమునం దుండెడిది. (4) అధునిక రాసలీలలందు వివిధరీతులు కన్పట్టుచున్నవి. ఇది గేయ నాట్యముగా విలసిల్లినది. గద్య భాగము కథావివరణకు జోడింపబడినది. పారసీక కంపెనీలచేతులలోబడి వికృత రూపమును దాల్చినది.

14 వ శతాబ్దము తరువాతి వైష్ణవాచార్యులు రాసలీలలకు మహత్వపూర్ణ స్థానమిచ్చుటకు లీలలను జోడించిరి. జైన రాస గ్రంథములు ధార్మిక గ్రంథములు. ఇవి వీర రస ప్రధానములుకావు. ధార్మిక వైష్ణవ మిందుకు తోడ్పడినది. వల్లభాచార్యుడు శృంగార క్రీడల కిందు స్థానమీయలేదు. ఆయన కీ రసయోజనమందు కళాకారులు గూడ తోడ్పడిరి. స్వామి హరిదాసు, హితహరివంశరాయ (1559) ఘమండీదేవ, నారాయణభట్ట మొదలగువారు రాసస్థాపనమందు వల్లభాచార్యునకు తోడ్పడిరి. 'ఘమండీదేవ' లలితాసఖి గ్రామీణులకు రాసలీలలన్నేర్పెను. అక్బరు దర్బారునందున్న వల్లభుడు బృందావనమువచ్చి యీ నాట్యమును నేర్చుకొనెను.

రాసలీలలందు కృష్ణలీల లభివర్ణితములు. గొల్లల నృత్యములు, గోపగోపికలలీలలు, కృష్ణుని చిలిపిచేష్టలు రాసలీలలందు చూడనగును. కథోపకథనము మౌఖికరూపమున నడచును. అబ్దుల రహమాను రాసక వైశిష్ట్యమునుగురించి వ్రాయుచు, బహు రూపమునందు సుసంబద్ధ 'రాసో' సంవాద రూపమున ప్రదర్శింపబడునని తెలిపినారు. ఇతర రాసములందు మంగళాచరణములు ఆశీర్వచనము మొదలగునవి కూర్చబడినది.

## వ్రజ ప్రాంతము

వ్రజప్రాంతమునందు రాసలీల లతిప్రచలితములు. యుగయుగములనుండి భారతీయులు తీర్థయాత్రలను సేవించుచు, మధుర, బృందావనములను దర్శించుటయున్నది. రాధాకృష్ణుని మందిరమును దర్శించి, రాసలీలలలో సాక్షాత్తు రాధాకృష్ణలీలలను గాంచినగాని, వారి యాత్ర పూర్తిగాదు. ఈ ధార్మికదృష్టి రాసలీలల ప్రచారమునకు దోడ్పడినది. అప్పుడప్పుడు రససిద్ధులు వివిధరాసములను విరచించిరి. సూరదాసు రాసలీలాపదములను రచించిరి. ఈనాటికీ ఈ పదములు నోనోట నానుచున్నవి. హితహరివంశుడు సంస్కృతపండితుడు. ఆయన సంస్కృతములోను, వ్రజ భాషలోను 'రాస' పదములను వ్రాసెను. వీనిని నేటికి రాసలీలలలో వినవచ్చును. నందదాసకృత 'రాసపంచాధ్యాయి' విద్వల్లోకమునందు స్వర్ణరశ్మి రచనముగా భావింపబడుచున్నది.

బృందావనదాసు, దామోదరస్వామి, శ్రీ వంశీహరి పాతకోవకు చెందిన రాసపద రచయితలు. బృందావనదాసు పదములందు సంవాద పద్ధతివలన నాటకీయత పరిఢవిల్లుచుండును. సాహిత్య మూల్యము గూడ విలసిల్లుచుండును. వ్రజభాషలో ఆయన అందెవేసిన చేయి. వీరి పదములు రస స్ఫోరకములు. వీరి 42 లీలలు ప్రచురింపబడినవి. ఈ లీలలందు కథావస్తువు ఆరోహణావరోహణ క్రమమునందుండును. అక్కడక్కడ కథపరాకాష్ఠ నందుచుండును. గౌనావాలీల (మనుగుడుపు) సునారిన్ లీల (బంగారు పనిచేయువామె) విసాతిన్‌లీల (దోసరాలు) పటువినలీల (ద్వారలీల), రంగరేజనలీల (అద్దకము) తమోలినలీల (తమలపాకు అమ్మునామె) నాఇన లీల (మంగలిస్త్రీ) వైదనిలీల (వైద్యస్త్రీ) నటువినలీల (నాట్యగత్తె) బీనావాలీలీల (నాగస్వరము) ధాఢినలీల (కోరలు గలది), గంధినలీల (అత్తరు అమ్మునది), బ్రాహ్మచారీ లీల, జోగినిలీల (ఎఱుకత) మొదలైనవి ఉత్తమ సాహిత్య రచనలు. ఈ రచనల నాధారముగాగొని, అనేక శతాబ్దములనుండి శతాధిక రాసమండలులు వ్రజ ప్రాంతమునందేకాక, ఉత్తర భారతదేశమంతయును రాసలీల లాడబడుచున్నవి.

## వికాసక్రమము

రాసలీలలకు, సంస్కృత నాట్యములకు సంబంధము లేదని శ్రీ దశరథ ఓఝాగారి యభిప్రాయము. స్వయంభూ ఛందస్సులో రాసకఛందము పేర్కొనబడినది. సందేశ రాసకమునందు మూడుపాళ్ళు రాసక ఛందములే. రాసలీల గోపజన ప్రచలిత నాట్యము. శార్ఙ్గధరుడు 'సంగీతము' నందొక కథను వ్రాసినారు.

శివుడు తాండవమును, పార్వతి లాస్యమును నేర్చుకొనిరి. పార్వతి బాణాసురుని కూతురగు 'ఉష'కు లాస్యము నేర్పెను. ఈమె అనిరుద్ధుని పెండ్లాడినది. ఆమె ద్వారవతియందు గోపకులమునకు నేర్పెను. దానిని సౌరాష్ట్రమందలి యువతులు నేర్చుకొనిరి. అటనుండి తదితర ప్రాంతములకది వ్యాప్తి నొందినది. నేటికిని సౌరాష్ట్ర, గుజరాతు ప్రాంతములందు రాసక, రాసగర్బ నృత్యములను చేయుదురు. రాసక్రీడలు సౌరాష్ట్రమున ఆభీరులందు ప్రారంభమైనదని పై కథ సూచించుచున్నది.

భామహుడు నాటకము ద్విపది, శమ్యా, రాసక, స్కంధాదిని 'అభినేయార్థ కావ్యము' అనినాడు.

'నాటక ద్విపదీ శమ్యా రాసక స్కంధాదియత
ఉక్తతదభినేయార్థ ముక్తోఽన్యైస్తస్య విస్తర"—24

హేమచంద్రుడు 'కావ్యానుశాసనము'నందు రాసకమును గేయ కావ్యముగా స్వీకరించినాడు.

'గేయండోంబికాభాణ ప్రస్థాన
శింగకభాణికా ప్రేరణ రామాక్రీడ
హల్లీస రాసక గోష్ఠీ శ్రీ గదిత రాగ కావ్యాది' —8114

రాసకము గేయరూపకము. నృత్యము అభినయము, సంగీతము—వీని త్రివేణీ సంగమమే రాసకము.

హేమచంద్రుడు 'అనేకార్థ సంగ్రహము'నందు రాస క్రీడ గొల్లల క్రీడయనియు, దేశిభాషలో రచింపబడిన శృంఖలా బద్ధ రచనయని వివరించినాడు.

'క్రీడాసుగోదుహోయ భాషా శృంఖలకే'

నారద పంచరాత్ర జ్ఞానామృతసార సంహితయందు కృష్ణుడు గోపికలతో లీలలాడుచున్నటులు వివరించినాడు. ఇది క్రీ. పూ. నాల్గవ శతాబ్దము నాటి రచన. అందువలన మాక్డొనాల్డు భారతీయ రూపకోత్పత్తి కాధారము కృష్ణభక్తి ప్రచారమే యై యుండవచ్చునని భావించినారు.

హేమచంద్రుని శిష్యుడు రామచంద్రుడు నాట్యదర్పణ మందు రాసక లక్షణము విశదీకరించినాడు. ఇందు నృత్యగీత తత్త్వము స్వీకరింపబడినది.[4]

విశ్వనాథుడు రాసక లక్షణములను వివరించెను. పాత్ర వృత్తి వర్ణనలను గురించి, వ్యాఖ్యానించెను. రాసకము లోక ప్రచలిత గేయ రూపము. నాట్యాచార్యులు నాట్యరాసకముగా తదుపరి దీనిని స్వీకరించిరి. భరతముని నాట్యశాస్త్రమునందు 'రాసక'మను ఉపరూపక ముల్లేఖింపబడినది. ఈ రాసక భేదములు మూడు: (1) తాలరాసకము (2) దండరాసకము, (3) మండల రాసకము.

తాలరాసక నామస్యాత్ త్రిధా రాసకం స్మృతమ్
దండరాసక మేకంతు తథా మండల రాసకమ్

నాట్యశాస్త్రము ప్రథమ శతాబ్దమునాటిది. అందువలన ప్రథమ శతాబ్దమునకుముందే రాస సంప్రదాయము లోకమునం దున్నట్లు స్పష్టమగుచున్నది.

నాట్యశాస్త్రమునందు వర్ణింపబడిన 'తాలరాసకము' తాలబద్ధనృత్యము. 'తాలరాసకము'నందు నిపుణులు భాట జాతివారు. నేడు భాటులు వ్యక్తులను పొగడి పొట్ట పోసినను, ఒకనాడు వారు నృత్యముగానమునందు కుశలురై యుండ వచ్చును. దండరాసకము కోలాట వంటిది. జినదత్తసూరి దీనిని 'లకుట రాసక' మనినారు. లకుటమనగా కోల. సప్త క్షేత్రరాసగ్రంథమునందు 'దండరాసకము'ను నర్తకజాతి వారాడునదని వ్రాసియున్నది. వీరు ప్రత్యేకముగా దండరాసకమునందు ప్రత్యేక ప్రావీణ్యమును సంపాదించినవారు కావచ్చును. జినసూరి జైనమతానుయాయులకు దండ రాసకమును నిషేధించినారు. ఈ నాడు రాజస్థానము వ్రజ, మాలవప్రదేశములందు దీనిని 'ఆంయారమద్యా' అందురు.

మండల రాసకము మండలాకార నృత్యము. ఇది సామూహిక పురుషనృత్యము. ఇది దండరాసకమువంటిది. మండల రాసకమునందు హల్లీసక నృత్యమని మరి యొకటి కలదు. భరతుడు దీనిని గూడ వివరించెను. ఈ రెండింటికి పరస్పర సామ్య మెక్కువ. భేదము చాల తక్కువ. వాత్స్యాయనుడు దీనిని పేర్కొనినాడు. (హల్లీసక క్రీడేన కోగాయనః) అభినవగుప్తుడు (9 వ శతాబ్దము) నాట్య శాస్త్ర టీకను వ్రాయుచు హల్లీసకనృత్యము మండలాకార నృత్యమని తెల్పెను. (మండలేనతు యన్నాట్యం, హల్లీసక మితిస్మృతమ్). 9 వ శతాబ్దము నాటికి ఈ రెండింటికి భేదము లోపించి యుండవచ్చును.

అభినవగుప్తుడు 'అభినవ భారతి' లో రాస, రాసక విషయమును చర్చించెను. దీనిని అభినవగుప్తుడు గేయరూపక భేదమనినాడు.

'అనేక నర్తకీయోజ్యం చిత్రతాల లయాన్వితమ్
ఆ చతుష్షష్టి యుగలా ద్రాసకం మసృణోద్ధతమ్'
(భా. 1. పే. 183)

దీనినిబట్టి ఇది (1) గేయ రూపకమనియు (2) తాల లయ ప్రధానమైనదనియు, (3) 64 జతలు పాల్గొను నాట్యమనియు తెలియుచున్నది.

4. భా 1—పే. 214.

శ్రీ కన్హైయాలాల్ మున్షీ 'గుజరాత్ అండ్ ఇట్స్ లిటరేచర్' అను పుస్తకమునందు ప్రాచీన గుజరాతీ సాహిత్యమునందున్న వివిధ రాస గ్రంథములను పేర్కొనినారు. ఈ గ్రంథములందు 'దోహా చౌపాయి' మాత్రాఛందస్సు లుపయోగింపబడినవి. ఇందు ప్రేమగాథలు వర్ణింపబడినవి. క్రీ శ. 1118 ప్రాంతమున రచింపబడిన 'సవ తమ భావ్యము'నందీ రాస సంప్రదాయము అపభ్రంశసాహిత్యవిశేషమని పేర్కొనబడినది. శ్రీ మున్షీగారు గుజరాతీ సాహిత్యమునందు 'భరతేశ్వర బాహుబలి' (1145) నుండి 'రాస' పరంపర ప్రారంభమైనట్లు వ్రాసినారు. 'రేవంతగిరి రాసము' విజయసేన విరచితము. ఇందు ప్రజ లుల్లాసముతో నాడుచుండేయాటనుజూచి, 'నేమి' ప్రసన్నుడాయెననియు, అంబికాదేవి సర్వ కామ్యములను దీర్చెనని వ్రాయబడినది. దీనినిబట్టి రాసలీల ఆ సమయమునకు నృత్యవస్తువులేగాక, అభినయ రూపకము లాయెనని విశదమగుచున్నది. గుజరాతు భక్తకవి నరసింహ మెహతా (15 వ శతాబ్దము) రాసలీలలో తల్లీను డాయెనట. ఆయన చేతిలో దివిటీలు వెలుగుచున్నవట. చేతులు కాలిపోవునవు విషయము మరచి యాడుచుండెనట! గుజరాతునందు 'గరబా' నృత్యము రాసలీలవంటిది. గుజరాతులో 'రాసడో' యను జానపద నృత్యము గూడ కలదు. సూరతు నికటస్థ ప్రాంతములందు జానపదులు నెమలి ఈకలను గట్టుకొని దేవీ సమక్షమున నృత్యమును చేయుదురు. దీనిని 'ధీర్వా' రాసమందురు. 'రాస' గీతములను 'గరబా' నృత్యమునందు బాడుదురు. రాసము లోకనృత్యము. అభినయ వస్తువై నాట్యకోటిలో చేరినది.

## అద్భుతలీలలు

రాసములందు కథావస్తువు సంక్షిప్తముగ సూచింపబడుచుండును. దృశ్యపరివర్తనమున కిందవకాశములేదు. 15 వ శతాబ్దియందు రాసలీలలు విషయమునుబట్టి ముప్విధముగా నున్నట్లు తెలియుచున్నది.

(1) జనీ నాటకరూపమున.
(2) చరి ఉపరూపమున.
(3) రాసోరూపమున.

రాసలీల లత్యద్భుతములు. రాసలీల లాడుచోట జనము మూగియుందురు. పాత్ర సంవాదములు పద్యాత్మకములు. నాయకుడు కృష్ణుడు. నాయిక రాధ. రాధ గోపికలతో రంగముమీదికి వచ్చును. ఖలనాయకుడు కంసుడు. కృష్ణుడు రస సాగరుడు. కంసుడు కృష్ణద్వేషి. అందువలన కంసుని సంవాదములు గద్యాత్మకములు. శ్రీకృష్ణుని లీలలు జీవితమునకు కతి సన్నిహితరూపములు. రాసలీలల రూపమున జానపద హృదయము పరమాత్ముని లీలల నవలోకించుచు, ధన్యమగుచున్నది. లోక రంజకుని లీలల గను జానపదులు ధన్యులు.

---

# కీ॥ శే॥ వాసిరెడ్డి పార్థసారథి

ఈ సంవత్సరం మార్చి 15 వ శ్రీ వాసిరెడ్డి పార్థసారథిగారు శివసాయుజ్యము చెందినందులకు విచారించుచున్నాము. శ్రీ పార్థసారథి 1902 లో జన్మించినారు. 1920 లో స్కూలుఫైనలు చదువుచు, గాంధీ సందేశము నాలకించి చదువు మానుకొని స్వాతంత్రోద్యమములో చేరినారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహములో పాల్గొన్నారు. వీరు మంచి రచయితలు. ముఖ్యముగా తాత్త్వికవిషయములనుగురించి వ్రాసెడివారు. యోగశాస్త్రము వీరి అభిమానశాస్త్రము. భారతి వీరి తాత్త్వికవ్యాసములను చాల ప్రకటించినది. ఉగ్రడాఫ్ జీవితము; సత్యాగ్రహస్మృతులు; నేటి మానసికపరిస్థితులు; ఆధునికమానవుని అన్వేషణ; శిరమ్మద్ షహీద్ వేదాంతి; బావుల్ ప్రేమతత్త్వము; జెన్‌బౌద్ధము; హిరణ్మయపద్మరహస్యము మొదలగు – గ్రంథలను వీరు రచించిరి.

యోగమున గ్రంథములు రచించుటయేగాక, యోగాభ్యాసమున గూడ వీరు నిష్ణాతులు. వీరి ఆత్మకు పరమశివుడు శాంతిని చేకూర్చుగాతమని ప్రార్థించుచున్నాము.

# మధుశ్రీ

శ్రీ శనగన నరసింహస్వామి

వచ్చెం బొంగుచు మాధుమాస మొక క్రొవ్వాగుంబలెన్, వీథులం
దెచ్చెన్ భావజరాజసుందరరథాఽహీనధ్వనుల్, తోటలన్
విచ్చెన్ నైకవిధప్రసూనములు, నిర్విఘ్నంబుగా వీనులం
జొచ్చెం గోకిలకంఠకాహళగళత్ సోత్సాహగీతారుచుల్

ఈ మావి చివురాకు లిపుడె పట్టెనయేమి
ప్రతివత్సరము చివ్రుపట్టు కాద;
ఈ కోకిలాలాప మిపుడె వింటిమ యేమి;
పదిపదిసార్లు విన్నదియె కాద;
ఈ మల్లికావల్లి యిపుడె పూచెనయేమి
వెనుక యేడాది పూచినది కాద;
ఈ మలయానిలం బిపుడె వీచెనయేమి
సృష్ట్యాదినుండి వీచినది కాద;
ఈ వసంతము క్రొత్తగా నిపుడె దిగెన
యేమి, యేడాది కకసారి యేగుదెంచు
నైన నేయామె సత్కవితావతార
మట్లు నవనవోన్మేషత్వ మందుకొనును

ఇది ఋతురాజ మీ సురభి నెచ్చట నణ్వణువందు జీవమే
కదలి మదాలసాలసవికాసము వీచు, నెవో యపూర్వ స
మ్మదమృదుభావనాస్మృతులు మాటికి రేచును, సృష్టియే
పొదలును పుల్కలన్ వగలుపోవుచు మన్మథరాజధానియై

వర్ణప్రకర్షాధివాసమ్ము లీ కర్ణి
కారకమ్ములు తావి గాంచెనేని;
రక్తరశ్మిచ్ఛటారమ్యమ్ము లీ యశో
కములు క్రొమ్మంటలు క్రక్కెనేని;

సకషాయగంధనిశ్వాసమ్ము లీ చూత
కళికలు పువ్వులై వలచెనేని;
క్రోధారుణేక్షణాంకురమ్ము లీ కింశు
కములు బాణమ్ములై గాడనేని;
ఒక్కమనజాతికే పుణ్యమోసరిల్లి
దోసి! జీవింప లేమమ్మ యుర్విలోన
ననుచు ప్రోషితభర్తృకాంగనలు విరహ
భూరిదుఃఖమ్ముతో సొలిపోయినారు

శిశిరము ముదిరి వసంతము
దిశలను చుంబించి వలపు తీపులు రేపున్
వశులకును; తదాగ్రహ మిక
ప్రశమించునె గ్రీష్మమగుచు పైబడకున్నే.



# దండి మహాకవి ఉదంతము

శ్రీమతి విజయలక్ష్మి

కవిబ్రహ్మయగు తిక్కన కంకితమగు కేతన దశకుమారచరిత్ర, మనకు సంపూర్ణముగ లభించిన కథాకావ్యములలో మొదటిది. ఇది దండి మహాకవి సంస్కృత రచనకు అనువాదము. సంస్కృత దశకుమార చరిత్రమునకు మూలమగు అవంతిసుందరీ కథయు, అవంతి సుందరీ కథాసారమును, అసంపూర్ణములుగా నలుబదేండ్ల క్రిందట లభ్యమైనవి. అందులో దండి యొక్క పూర్వ వృత్తాంతము గలదు. ఆ విషయ మిందు పొందుపరుపబడినది.

అగస్త్య మహాముని పాదపద్మ స్పర్శచే పవిత్రమైనది, ఒక పుణ్యమునకు కోటి పుణ్యముల ఫలితము నిచ్చుటచే పుణ్యకోటి యైనది, సప్త పవిత్ర మహానగరములలో నొకటియై, అష్టాదశ శక్తి పీఠములలో ప్రసిద్ధి గాంచినదియై, దక్షిణాపథమునకు శిరోరత్నమై చెన్నారినది కాంచీపట్టణము. దానిని సింహవిష్ణువను పల్లవరాజు పాలించుచుండెను.

ఒకనా డారాజు సభతీర్చి యుండగా నొక గంధర్వు డేతెంచి వీణ వాయించుచు నొక మధురగీతము నాలపించెను. రాజా గీతమునందలి కవితాసంపత్తికి మెచ్చి, మది పులకించి, యీ గీతమును రచించిన కవివతంసు డెవరని గంధర్వు నడిగెను. అతడంత వినయపూర్వకముగా ప్రభువున కిట్లు చెప్పదొడగెను. "ఆర్యావర్తమునకు పశ్చిమోత్తర దిశగా నున్న, గుజరాత్ రాష్ట్రమున, ఆనర్త దేశమునకు ముఖ్యపట్టణమైన ఆనందపుర సమీపమున ఒక పెద్ద బ్రాహ్మణాగ్రహారము గలదు. అందుండి కౌశిక గోత్రీకులగు కొందరు బ్రాహ్మణులు కుటుంబములతో నాసిక ప్రాంతమున నున్న యచల పురమునకు వలస బోయి, యచ్చట స్థిరనివాసము లేర్పరచుకొనిరి. ఈ యచల పురము, మూలదేవునిచేత, నతని మిత్రుడగు అచలుని కొరకు నిర్మింపబడినది. అచలపురమున కట్లు వలసపోయిన బ్రాహ్మణులలో నారాయణస్వామి యనువత డొకడు. అతని కుమారుడు దామోదరుడను వాడే యీ గేయకర్త. బాల్యముననే యతనిని కవితాకన్య వరించినది. ఈ యువకవి భారవి మహాకవి సాంగత్యమును పొందియుండి, యా మహనీయుని వలన విష్ణువర్ధన రాజకుమారుని స్నేహమును పొందగల్గెను.

విష్ణువర్ధను డొక పర్యాయము వేట కేగుచుండెను. దామోదరు డతని ననుసరించెను. మార్గములో క్షుద్బాధా నివారణార్థమై, దామోదరుడు మాంసాహారమును స్వీకరించెను. యజ్ఞ సమయములందు హవిశ్శేషమైన మాంసమును మాత్రమే బ్రాహ్మణుడు భుజింపదగును. అన్యసమయములందు విప్రుడు పలల భక్షణము చేయుట తగదు. కావున నీ పాపమును క్షాళనము చేసుకొనుట కొరకు, దామోదరుడు తీర్థయాత్రలకు బయలుదేరి, యనేక పుణ్యక్షేత్రములను దర్శించెను. మార్గ మధ్యమున దుర్వినీతుడను గాంగనృపతితో చెలిమి జేసి, నే డతని యాస్థానమున సుఖమున్నవాడు" అని చెప్పి గంధర్వు డశేచ్ఛం జనియెను.

ఇట్లు గాంగనృపతి సన్నిధిని సుఖముగా నున్న దామోదరుని చరిత్ర విన్న సింహవిష్ణు మహీపాలున కతని జూడవలెనన్న కోరిక మిక్కుటమయ్యెను. ఒకదాని వెంట మరొకటిగా మరల మరల యాహ్వానముల బంపి, దామోదరుని తన సన్నిధికి రావించుకొనెను. పల్లవ నరేంద్రుని వదాన్యలక్ష్మికి వశుడైన దామోదరుడు కంచినుండి కదలక యుండెను. దామోదరు డా కాలమున 'గంధమాదన' మను గ్రంథమును, సంస్కృత ప్రాకృతభాషలలో అలంకారశాస్త్ర గ్రంథములను రచియించెను. సింహవిష్ణుని కోరికపై దామోదరుడు వివాహము చేసుకొనెను.

తదుపరి కొంతకాలమునకు, దామోదరదంపతుల రాగరసవార్ధికి పూర్ణచంద్రుడో యన, నవమన్మథుని బోలు నొక్క కుమారు డుదయించెను. కృతజ్ఞతా సూచకముగ దామోదరు డా కుమారునకు సింహవిష్ణువని ప్రభునామము నుంచెను. అనంతరము కలిగిన మరి యిద్దరు కుమారులకు, మనోరథుడు, అతిలోభుడు అను నామముల నిర్దేశించెను.

దామోదరు డిట్లు సిరిసంపదలతో దులదూగుచుండ, కాలచక్రము దొరలిపోయెను. రెండవ కుమారుడైన మనోరథునకు నల్వురు కుమారులు జన్మించిరి. మనోరథుడు తన పితృభక్తికి నిదర్శనముగ పెద్ద కుమారునకు దామోదరు డనియు, తనకు ప్రభువు యెడలను భ్రాతయందును గల గౌరవ ప్రతిపత్తులను వ్యక్తము చేయుచు, మూడవ కూమారునకు సింహవిష్ణు వనియు నామకరణముల జేసి, రెండవ వానికి భవదాసనియు, నాల్గవ వానికి వీరదత్తు డనియు పేర్లు బెట్టెను.

కొంతకాలమున కా నల్వురు సోదరులు యుక్తవయస్కులై వివాహములు జేసికొనిరి. వాఱ్గవవాడైన వీరదత్తుడు, మాథుర గోత్రమునకు చెంది, మూర్తీభవించిన పాతివ్రత్యమో యన బరగిన, సుగుణరాశియగు గౌరి నుద్వాహ మయ్యెను. ఆ గౌరి, లక్ష్మీప్రదముగ తొలిసారి స్త్రీ శిశువును ప్రసవించెను. రెండవ సారి, మూడవసారి, యి ట్లనేక పర్యాయములు, తల్లిదండ్రు లకు పేరు ప్రతిష్ఠలు దెచ్చుటకు సమర్థురాండ్రగు అనేక మంది కుమార్తెలు జన్మించిరి గాని, వంశోద్ధారకు డగు పుత్రు డుదయింపడయ్యెను.

ఇట్లా దంపతులు పుత్రునికై చింతించుచుండ, వారిని విచారసాగరమునుండి యుద్ధరించుటకు సమీపించిన నౌకవలె, పున్నామ నరకములనుండి రక్షించు నొక పుత్రుడు కలిగెను. ఆ భార్యా భర్తల తపఃఫలమో యనునట్లు జన్మించిన యా పుత్రరత్నమునకు 'దండి' యని నామకరణము చేసి, యల్లారు ముద్దుగ బెంచుచుండ, నా యర్భకునకు సప్తమ వర్షమున మాతృవియోగము సంభవించెను. అంతటినుండి విద్యాదేవత యగు సరస్వతీదేవియే యాతని పెంచెను. ఉపనయనా నంతరము దండికి పితృవియోగము కూడ సంభవించెను. అదే సమయమున పల్లవరాజు శత్రువులచే జయింపబడెను. దక్షిణాపథమున కరువు కాటకములు సంభవించెను. బంధు మిత్రులను వదలి దేశముపై దిరుగుచు, యనేక విద్యా పీఠములలో యనేక వర్షములు వసించి, దండి యనేక విద్య లందు ప్రవీణు డయ్యెను. కంచిలో మరల శాంతి నెలకొనిన యనంతరము, దండి స్వదేశమున కేతెంచి, బంధుమిత్రుల గూడి సుఖముగ నుండెను.

మాంధాత యను శిల్పి కుమారుడు లలితాచార్యుడు. ఆతడు తొంబదియారు విధములగు దేవాలయ నిర్మాణము నందును, ఆరు విధములగు యంత్ర నిర్మాణమునందును సమర్థుడై, శిల్పాచార్యునకు గావలసిన ముప్పదియారు గుణ ములు గలవాడు. ఒక నాడీ లలితాచార్యుడు దండిని సమీపించి వినయ విధేయతలతో నమస్కరించి, యతని చెంత నాసీనుడై యుండగా, నతని నిర్మాణ కౌశలము నెరింగిన ప్రజానీకము వారిని చుట్టు ముట్టి యుత్సాహముతో శిల్పి నిట్లు స్తుతిం చిరి. "ఈ మహాశిల్పి యంత్రపు మనుజులను చేసి, వారి మధ్య యుద్ధము కల్పించెను. మాయమబ్బులను సృజించి వర్షము కురిపించెను. యంత్రములచేత యింద్రజాలము చేయించెను. ఇతడొక యుద్ధవీరుడు. యుద్ధములో యేనుగుల కుంభస్థలములను పగులగొట్టెను. ఇతడు గొప్ప కవి. శూద్రక మహాకవి చరిత్రమును తమిళములో వ్రాసెను ఇతని తండ్రి మాంధాత యంత్రములను చేయుటలో యువను లను మించెను. మాంధాత యొకతూరి యంత్రముతో కల్ప వృక్షమును నిర్మించి, దుర్జయుడను రాజును ఆశ్చర్యచకితుని జేసెను" అని పొగడుచు ప్రజలు పోగిపోయిరి.

అనంతర మా లలితాచార్యుడు దండితో "దేవా ! నేను చేసిన కొంచెపు పనులే ప్రజలలో నిట్లాశ్చర్యమును కలుగ జేసినవి. కాని యథార్థమునకు, మన దేశములోని శిల్పకళా ఖండము లెన్నియో, తగు శ్రద్ధ చూపువారు లేక శిధిలా వస్థలో నున్నవి. వానిని గమనించువారు లేరు. కాని, బ్రహ్మేంద్ర పరాశర శాస్త్రకళలందు నిష్ణాతులైన మీవంటి పండితుల కిది యొక లెక్కలోనిది కాదు. కావున మిమ్ము లను వేడుకొనవలసిన దొకటి గలదు. మా మల్లపురమున* సముద్రపు టొడ్డున గల శేషశాయి విగ్రహమును మీరు చూచియే యుందురు. ఆ విగ్రహము చేయి ఒకటి శిధి లము కాగ, నేను మరల యతికితిని. మహానుభావులగు మన పూర్వ శిల్పులు నిర్మించిన యపూర్వ కళాఖండములలో నొకటి యగు నా విగ్రహమునకు, నా యతుకుదల సరిగా నున్నదో లేదో పరిశీలింపుడని" బల్కెను.

అప్పుడు దండి దండనుండు వీరపతాకుడను మిత్రుడు, "ఈ శిల్పి ప్రార్థనము నంగీకరింపుము. మనము మామల్ల పురము బోయి శిల్పమును బరీక్షించుటయే గాక, నిన్ను చూచుటకై కేరళదేశము నుండి వచ్చి, యిప్పుడు మామల్ల పురములో నున్న మనమిత్రులు మాతృదత్త, దేవశర్మలను గూడ గలియవచ్చు" నని చెప్పి ప్రయాణమునకు కొప్పిం చెను.

మరువాడు దండి జయంతనారాయణుడు మొదలగు మిత్ర బృందముతో గలసి, శిల్పమును దర్శించుటకై బయలు దేరెను. ఆ మిత్రమండలి మామల్లపురము జేరి, సముద్రము నానుకొని నిర్మింపబడిన మహాసౌధమును గాంచిరి. సముద్ర తరంగము లా సౌధమూలమునకు గొట్టుకొనుట చూడ, నింతకాలమునుండి సముద్ర తరంగములచే గొట్టబడుచుండియు నిలువరించుకొన గలుగునట్లు, నిర్మించిన సౌధనిర్మాత చాతుర్యమును, సాగరుడు తన ఘోషణముచే ఘోషించుచు తరంగహస్తములచే స్పృశించి యానందించుచున్నటు లుండెను. ఆ మిత్రులు మరికొంత దూరము సాగి శేషశాయి విగ్రహ మును గాంచిరి. సాగరుడా యనంతశయనుని పాదపద్మములు

---

* ప్రస్తుతము దీనిని మహాబలిపుర మనుచున్నారు.

భక్తితో తన తరంగ హస్తములచే కడుగుచుండెను. దండియు నతని మిత్రులును, విగ్రహమును మిక్కిలి సమీపమునుండి దర్శించియు, శిల్పి యతికిన హస్తమేదియో గుర్తింపలేక, యా శిల్పినే యడిగిరి. లలితాచార్యు డంత నా శిల్పకళ సార్థకము జెందెనని, వారికి నమస్కరించి సంతోషముతో వెడలి పోయెను.

దండియు నాతని మిత్రులు నా శిల్పసౌందర్యమును దిలకించుచు మరికొంత కాలము గడుపునంతలో, నొక పెద్ద యెఱ్ఱతామర అలలమధ్య కదలుచు విగ్రహము వైపునకు వచ్చుచుండెను. వా రట్లు చూచుచుండగనే, యా కమలము వైకుంఠనాథుని పాదకమలము లంటి యాకస్మికముగా భూష ణాలంకృతుడగు నొక విద్యాధరునిగా మారిపోయెను. దండ్యాదు లాశ్చర్యముతో జూచుచుండ, వారి యాశ్చర్యము నినుమడింప జేయుచు, నా విద్యాధరుడు శేషశాయికి ప్రదక్షిణ నమస్కారము లాచరించి యంతరిక్షమున అంతర్హితు డయ్యెను.

అంత చోళదేశ నివాసియగు రామశర్మ యను మిత్రు డీ చిత్రమేమియో విశదము చేయుమని దండిని కోరెను. 'అవును, ఇదియొక వింత. కాని యొకటి మాత్ర మూహింప వచ్చును. ఒకానొక గంధర్వు డొకానొక మహాముని నేదియో పుష్పములకు సంబంధించిన కారణముచే నొప్పించి యుండును. అత డందులకు కినిసి, యా గంధర్వుని పద్మముగునట్లు శపించియుండును. ఆ రక్త కమల మట్లనేక సంవత్సరములు సముద్రజలమున దేలియాడి, నే డీ కమలనయనుని పాద పద్మ స్పర్శచే శాప విముక్తి నొందియుండును. ఇప్పుడు మనము మన నివాసముల కేగుద'' మని దండి బలుక, నందరు నాశ్చర్య మగ్నమానసులై కాంచీపురము జేరిరి. కాని దండి మిత్రుల కా మాయ యేమియో తెలుసుకొనవలయునను యుత్కంఠ మధికముకాగా, నా రతనిని ప్రార్థించిరి.

మిత్రుల మనోభీష్టము నెరవేర్చుటకై దండి యనేక దినములు కఠిన నియమములతో మహావిష్ణుని ప్రార్థించెను, ఒకనాడు దండి దర్భలపై శయనించి యుండ, స్వప్నమున సరస్వతి సాక్షాత్కరించి ''కుమారా! ఆదిదేవుడైన శ్రీ మహా విష్ణువు నీ నియమవ్రత నిష్ఠకు మెచ్చినాడు. మానవులకు. గంధర్వులకు ప్రభువైన రాజవాహనుని* చరిత్ర నీ మనోనేత్ర మునకు గోచరమగుగాక!'' యని యాశీర్వదించి యదృశ్య మయ్యెను.

మరునా డుదయము దండి సంతోషముతో మేల్కాంచి, విహితకృత్యముల నిర్వర్తించి, కథాశ్రవణ కుతూహలురగు తన మిత్రుల రావించి, యవంతీసుందరి కథ సాంతముగ, పద్మము విద్యాధరుడగు నంతవరకు చెప్పి, తన చెలికాండ్ర ముద్దు చెల్లించెను.

---

* రాజవాహనుని తండ్రి యగు రాజహంసుని చరిత్రతో దశకుమారచరిత్ర ప్రారంభమగుచున్నది.

# తేనె తలవడఁబండు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

మిత్రులు శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు (6—2—1962) నా కిట్లు లేఖ వ్రాసినారు:

"'తేనె తలవడఁబండు' న కర్థము చర్చించుచు నొక లఘు వ్యాసముఁ బంపితిని. అది ఈనెల 'భారతి'లో ప్రకటితము కాగలదు. చూడఁగోరుదును. అభిప్రాయభేదమేమైన నున్నచోఁ బ్రకటింపఁ గోరుదును. మనకు కావలసినది సత్యమే కదా!"

9 వ తేదీ 'భారతి' వచ్చినది. వారి వ్యాసమును చదివినాను. వారు భావించిన యర్థము విషయమున నా యభిప్రాయము భేదించినది. శ్రీ కోదండరామయ్యగారి సౌజన్యమునకును, సత్యప్రియత్వమునకును జోహారు లర్పించుచు, వారి యాజ్ఞ మేరకు నా యభిప్రాయము నిక్కడ తెలుపుచున్నాను.

'తేనె తల'ను గూర్చిన చర్చయేమనగా; జైమిని భారతము అచ్చుప్రతిలో—" తేనె తలవడఁ బండె ధాత్రీ తలంబు" అని యున్నది. సూర్యరాయ నిఘంటువు "తేనె తల—సస్య విశేషము" అని యర్థము చెప్పినది. ఆ యర్థము సరియైనది కాదనియు, 'తేనె తలవడఁబండె' అనునది జాతీయమైనను కావలె. లేదా పాఠము మరియొక విధముగానైనను ఉండవలె ననియు నేను నా 'సాహిత్య సమీక్ష' (పు. 265) లో వ్రాసియున్నాను.

ఆ విషయము నందుకొని శ్రీ వి. రామకృష్ణారావుగారు "తేమ తలపడఁ బండె' అని కవిపాఠము కావచ్చును. తేమ తల పడితే చాలు పంటలు పండుతున్నాయి యన్నమాట"—అన్నారు. 'తేమ' అనునది వారు చేసిన సవరణ.

నేను వారు చెప్పిన అర్థములోగల విప్రతిపత్తిని దెల్పి, ఆ సవరణ సరిపడదన్నాను. వారు తేమ పాఠమే సరియైనదని సమర్థించుచు, మరల నొక విమర్శ ప్రకటించినారు. ఇదీ— 'తేనె తల' కు సంబంధించి యింతవరకును జరిగిన చర్చ.

శ్రీ కోదండరామయ్యగారు మా వాదప్రతివాదము లవలోకించి, తత్త్వనిర్ణయ తాత్పర్యముతో తాళపత్ర ప్రతులు శోధించి—"వ్రాత ప్రతులం దన్నిటిలోను 'తేనె తల వడఁ బండె"యనియే కలదు. 'తేమ' పాఠముగాని, మఱొక పాఠము కాని యందు లేదు. దీనినిబట్టి 'తేనె తలవడఁబండె' ననునదే కవి ప్రయుక్త పాఠమనియు, నది యేదో జాతీయమై యుండు ననియు, దాని మార్పదలచుట భావ్యము కాదనియుఁదేలుచున్నది" అని సందేహమున కెడము లేకుండ, నిర్ణయించినారు. కాబట్టి అచ్చు ప్రతిపాఠమే సాధువనియు, శ్రీ రావుగారి 'తేమ' పాఠము అసాధువనియు తేలిపోయినది.

ఇక అర్థము సంగతి: శ్రీ కోదండరామయ్యగా రిట్లు వ్రాసినారు:—"తేనె తలవడఁ బండు—అను జాతీయమునకు 'సమృద్ధిగాఁ బండు' అను నర్థ మెట్లు వచ్చెనో కొంత వివరింప వలసి యున్నది. 'వెన్ను విఱుగఁబండినదని 'వడ బండిన'దని యనుట నేటికిని వాడుకలో నున్నది. ఇదే యర్థమున నీ జాతీయము కూడఁ బ్రయోగింపఁబడి యుండును— కన్నడమున 'తెనె' యని యొక పదము కలదు. Dravidian comparative vocabulary అను గ్రంథమున 'కతై' అను తమిళ పదమునకు కన్నడమున సామ్యపదముగా 'తెనె' యుదాహరింపబడి యున్నది. దానికి Spike of corn అని యర్థ మొసఁగబడి యున్నది. కన్నడములోని ఈ 'తెనె' యను పదమే తెలుగున 'తేనె' యయినది. తేనెతల యనగా వరి యెన్నుయొక్క అగ్రము. ఆ యగ్రములు వ్రాలునట్లు— సమృద్ధిగాఁ బండినదని భావము. కాని 'తెనె'కు సామ్యమయిన ఈ 'తేనె' తెలుగున వ్యవహారమునుండి జారిపోయి 'తేనె తలవడఁ బండు' అను జాతీయములో మాత్రమే నేడు నిలచియుండి యా ప్రాచీన స్వరూపమును గుర్తింపజేయుచున్నది."

మా మిత్రులు సూచించిన ఈ యర్థమున నాకు తోచిన అనుపపత్తిని మనవి చేయుచున్నాను.

(1) 'తెనె'—'తేనె' అను పదములకు ఆకృతిలోనే గాని, అర్థములో సామ్యములేదు. 'వరి—యెన్ను'కు 'తేనె' యను వ్యవహార మిప్పుడు లేకపోవుటయే గాక, ఒకప్పు డుండెడి దనుటకును ఆధారములేదు. కనుక "తేనె తల—వరి యెన్ను యొక్క అగ్రము" అనుట ఊహ మాత్రమే యగును.

(2) అట్టి యర్థమున్నను, 'ఎన్ను' వ్రాలుట, పంట సమృద్ధిగా పండిన దనుటకు సూచనకాదు. ఎందువల్ల ననగా వరి యెన్ను పండకముందును వాలియే యుండును. నిట్టక నిల్చి యుండదు.

"ఉవిద నిద్దంపు జంఘల సవతుఁ గోరి
కలమ గర్భంబు లడఁచు లోఁ గంటకములు
చాతురుల మించి మఱి దివస క్రమమున
నిలువ కవి బాహిరములైనఁ దలలు వంచు"

(ఆము. 5—33)

"వరి పొట్టలు వెన్ను తీయగానే ముండ్లు బయలగుటయు భారము చేత దలలు వంచుటయును ప్రసిద్ధము"

(వావిళ్లవారి వ్యాఖ్య)

"కలమ గర్భంబు లింతి జంఘలకు నోడి
వేగ తృణమూని తలవంచె వెన్నుచూపి" (రుక్మి. 4.105)

"అపి వనాన్తా వరయా వధీరిత
స్సరోరుహిణ్యా శిరసా నమ న్నపి
ఉపైతి శుష్యన్ కలమ స్సహాంభసా
మనోభువా తప్త ఇ వాభి పాండుతామ్"
(భారవి. 4.34)

ఇందు వరివెన్ను వంగియుండుట శిరమువంచి నమస్కరించుటగా చెప్పబడినది.

"జనా స్తదాలోక పథాత్, ప్రతి సంహృత చక్షుషః
తస్థు స్తే వాఙ్ముఖాః సర్వే, ఫలితా ఇవ శాలయః"
(రఘు. 15. 78)

ఇందు తలలు వంచుకొనియున్న జనులకును, వెన్నులు వాలియున్న వరిపైరునకును సామ్యము చెప్పబడినది.

వరి వెన్ను వంగియుండుట స్వభావ మన్నది యిక్కడ సారాంశము.

పూర్తిగా పండిన తరువాత పైరు వాలిపోవును. పైరు పడిపోవుటే సమృద్ధిగా పండిన దనుటకు గుర్తు. దానిని బట్టియే 'విఱుగ బండినది'—'పడఁబండినది' అను మాటలు పుట్టినవి.

వాడుకలో 'పైరు విఱుగఁబండినది' యనుట కలదు గాని, 'వెన్ను విఱుగఁబండినది' యనుట లేదు. 'వెన్ను' విఱిగినచో పండిన పంట మంటిపాలై పోవును. ఏడు గాలము చేసిన కృషి వ్యర్థమై పోవును. కాబట్టి 'సమృద్ధిగా పండిన'దను నర్థమున 'వెన్ను విఱుగఁబండిన' దనుమాట పుట్టుటకే వీలులేదు.

పండ్ల బరువుచేత చెట్లును, వెన్ను బరువుచేత వరి పైరును నేలకు వాలుట సహజము. ఈ లక్షణమును దెలుపు కవుల వర్ణనలును విరివిగా నున్నవి. ఒక కొన్ని మాత్ర ముదాహరించుచున్నాను.

(1) "భవంతి నమ్రా స్తరవః ఫలోద్గమైః"
(భర్తృ. పరో—61)

(2) "నిమ్మలు మాదీ ఫలమ్ములు నతిరమ్య
ముగఁ బండి నేలపై మోచియుండఁ
బనసలు వీడలఁ బండి గుత్తులు గట్టి
వారక వానిపై వ్రాలియుండు"
(నన్నె. కు. 7—96)

(3) "పూచిన తీగెలన్ మధుర
భూరి ఫలంబుల వ్రేగునన్ మహిన్
మోచిన కొమ్మలం గలిగి
మూఁకలుగట్టిన పోకమోకలన్"
(కేయూర. 3—10)

(4) "కలమాః పాకవినమ్రాః
మూలతలాఘ్రాత సురభి కల్హారాః
పవనాకంపిత శిరసః
ప్రాయః కుర్వంతి పరిమళ శ్లాఘామ్"

(5) "కలమము లుండఁ బండి యొఱిగంబడి"
(ఆము. 1. 67)

"కలమములు—వరిపైరులు, పండి, ఒఱిగంబడి (వెన్ను బరువుచే) క్రైవాలి" అని వేదం వారి టీక.

(6) "బలుసు పండుల చాయఁ దనర్చి పండి క్రై
వ్రాలిన రాజనంబులకువచ్చు శుకంబుల జేరనీక"
(విక్ర. 4—39)

(7) "కనుఁగొన నయ్యెఁ బండి యొఱిగంబడి యుండెడి
రాజనంబు" (చంద్రా. 1.39)

(8) "కేదారంబులం బండి సో, యుగమై వెన్నుల వ్రేగులన్
ధరణి మోయన్ వ్రాలు సస్యావళుల్" (ఉ. రా. 1.74)

ఇంకను ఉదాహరణ లెందుకు? పండి—ఒరగఁబడునది 'పైరు' గాని, 'వెన్ను'కాదు. వెన్నును 'తేనె' యనుట ఈనాటి భాషలో లేదు. అందువలన—'తేనె తల—వెన్నుయొక్క అగ్రము పడన్—వ్రాలునట్లు, పండెను' అని యర్థము చెప్పుట సరి పడదు. తేనెను 'తేనె' గానే ఉంచి, అర్థము సరిపడు మార్గము చూడవలె. నా కొక మార్గము కనఁబడినది. అది యిక్కడ మనవి చేయుచున్నాను.

నే నీ వ్యాసము వ్రాయుచు, ఏదో పదముకొరకు భాగవతము తిరుగవేయుటలో ఈ క్రింది పద్యము కంటబడినది.

"జగములు మూఁడును సంతోషమును బొందెఁ
గుఱ్ఱీల చన్నుల గురిసె బాలు
నవజలంబులతోడ నదులెల్లఁ బ్రవహించె
నిఖిల వృక్షములు దేనియలు వడిసె
వాసుదేవుని యభిషేక వాసరమున" (10. పూ. 950)

ఈ పద్యములోని "నిఖిల వృక్షములు తేనియలు వడిసె" అను వాక్యము "తేనె తలపడఁబండె ధాత్రీ తలంబు" అను వాక్యము వంటిదిగానే నా బుద్ధికి పొడకట్టినది. 'వృక్షములు తేనెలు వడిసినవి' అనగా పూఁదేనెను వర్షించినవని యర్థము. కిసలయ కుసుమ ఫల భరితములై నూతన శోభతో విరాజిల్లినవని భావము.

ఇట్లే, 'తేనె........లంబు'— అను వాక్యమునకును, ధాత్రిలోని సకల వృక్షములును, తేనె తలపడన్—పూఁదేనె చిప్పిలునట్లు, పండెన్—ఫలించెను—అని అర్థము చెప్పవచ్చును. విప్రతిపత్తి యేమియులేదు.

'కుఱ్ఱీలు చన్నుల బాలు కురిసెను' 'వృక్షములు తేనెలు వడిసెను' అనునవి శ్రీ కృష్ణుని యభిషేకమహిమయొక్క

మహిమను ఉత్కర్షించి చెప్పు వాక్యములు. తేనె తలవడఁబండె ధాత్రీ తలంబు' అనునదియును, శ్రీరామచంద్రుని ధర్మ పరిపాలన మహిమను ఉత్కర్షించుచు, చెప్పిన వాక్యమే. ఇట్టి సందర్భములలో—'క్రేపులు చన్నవిసి పిలికె' 'భూమి దున్నకయె పండె' 'నెల మూడు వానలు కురిసె' ఇత్యాది వాక్యములు వాడుట పరిపాటి. అందువలన 'తేనె తలవడఁ బండె' అను వాక్యమునకు సరియైన యర్థము అప్పుడు స్ఫురింపలేదు. ఇప్పుడు స్ఫురించిన యర్థము నిందు తెలుపుకొన్నాను.

'తేనెతల, పడన్, పండెన్' అను విభాగముకంటెను— 'తేన, తలపడన్, పండెన్' అను విభాగమే సముచితార్థమునకు అనుకూలమని నా యభిప్రాయము.

నే నూహించిన యర్థము సమంజస మగునో కాదో నిర్ణయించుభారము సహృదయులది. శ్రీ కోదండరామయ్య గారును పరిశీలించి, అభిప్రాయభేదమేమైన యున్నచో ప్రకటింపవలసినదిగా కోరుచున్నాను.

## 'తేనెతలవడఁబండె'

### శ్రీ చొక్కనాథయ్య

"Tene, (Tamil) Korralu (Telugu) (Panicum Italicum) - This is a four months dry crop, sown in July, generally upon un-irrigated land, but occasionally under wells, when it is irrigated once a week. It is generally sown by itself. Only the ears are reaped, and the grain husked and boiled like rice. The preparation being called Paramanam. Cakes are also made of it The crop is a pretty one having drooping ears something like barly" (pages 332-333

A Manual of North Arcot Dist. in the Presidency of Madras by Arther F. Cox M. C. S. 1881.

'తేనె' అనేది నిశ్చయంగా సస్య విశేషమని, అది దున్నకయే పండునని, పంట ఏపుగా పెరిగినప్పుడు తలఁవడ పండునని పై ఆంగ్లేయ భాషా వాక్యములవలన తెలియుచున్నది. ఇంత చక్కని విషయమును పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి మన కావాడే తెలిపినాడు. అతని వాక్యాలు కాదనడం వినోదైక ప్రదర్శనం అవుతుంది. పండితులు పదములను రూపుమాపినా ఫరవాలేదు. పంటలను రూపు మాపుతే యెట్లా?

## "రాజగోపాల విలాసము"

### శ్రీ ఆర్. రాజగోపాల్

'భారతి' 39 వ సంపుటము, 2 వ సంచిక, 'కలగూర గంప' శీర్షికలో శ్రీ కొడకండ్ల వేంకట రాఘవాచార్యుల వారు చెంగల్వ కాళకవికృత 'రాజగోపాల విలాసము' అను ప్రబంధములోని అష్టవిధ శృంగార నాయికలగూర్చి చర్చ చేయుచు తత్కావ్య పరిష్కర్తయైన శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు చేసిన విభజనము గూర్చి విమర్శించిరి. వారు పరిశీలించిన Madras Govt Oriental series No. LXViii, 1951 లో ప్రకటింపబడినది. ఆ కావ్యము ఆర్థికము, మున్నగు కారణాంతరములవలన రెండవ ముద్రణము నోచుకొనలేదు.

"రాజగోపాల విలాసము' ముద్రణ ప్రతియందు కొన్ని పొరపాట్లు సంభవించిన విషయము వాస్తవము. ఆ విషయము శ్రీ వేంకటరావుగారే గుర్తించియున్నారు. వారు మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణముగా ప్రకటించిన 'The Southern School in Telugu Literature, Revised Edition' ను పరిశీలించినచో నీ విషయము దెల్లము కాగలదు. దానిని శ్రీ రాఘవాచార్యులవారు చూచినట్లు లేదు.

మన్నారుగుడిలో శ్రీ కృష్ణుడు గోప్రళయమునికోర్కె ననుసరించి రాజగోపాల నామమున పదారువేల గోపికలతో అష్ట మహిషులతో నచ్చట నిలిచెను. కాళయ అవస్థా భేదములచే నీ యష్ట మహిషులను అష్టవిధ శృంగార నాయికలుగా చిత్రించియున్నాడు. ఈ యష్ట మహిషులందరును దక్షిణ నాయకుడగు కృష్ణుని పట్ల స్వీయలే. శ్రీ రాఘవాచార్యులవారు పై 'భారతి' సంచిక 89 వ పుట ఉత్తరార్థము 23, 24 పంక్తులలో "ఇచట అవస్థా విశేషము ననుసరించి రుక్మిణి స్వీయమనుట పొసఁగదు" యనిరి. ఏ కారణమువలన నీ వాక్యము రచించిరో తెలియుట లేదు.

రాజగోపాల విలాసమునందు చిత్రింపబడిన నీ యష్ట విధ నాయికలను లక్షణ సహితముగ నీ క్రింద వివరించుచున్నాను. (సిద్ధాంతములు 'ఆంధ్ర సాహిత్య దర్పణము' లోనివి)

1. రుక్మిణి: కలహాంతరిత—"ప్రియోక్తులు పలుకుచున్నను ప్రాణనాథుని ఎవతె కోపముచే తొలగించి పిమ్మట తాప మొందునో అట్టిది కలహాంతరిత యనబడును."

రుక్మిణి తాపముఁ జూడుడు—

"ఏలా కొండెమువింటి ప్రాణవిభుతో నేలాచలం బూనితిన్
వేళల్ గా పలుగంగనంచు జెలియుల్ వేమారు చాటింపగా
నేలా నే వినవైతి నిట్టి వెతచే నేలాగు పోనింతు నిం
కే లీలన్ విభువేఁడుదానని యెంతే వంతఁ జింతింపుచున్"

(రాజగోపాల విలాసము 1. 97

2. భద్ర: అభిసారిక—

"ఎవతె మదన వశంవదయై కాంతుని తన కడకు రప్పించు కొనునో, లేక తానే అతని కడకుంబోవునో ఆ నాయికను పండితులు అభిసారిక యందురు"

శౌరి భద్ర పంపిన ప్రౌఢదూతి మూలమున దెల్పు సంకేతము:—

"కలికిరో నీవు వచ్చుద్దముకన్ సురపొన్నల పజ్జ గొజ్జగుల్
వలగొను తేటమంచు తెలివాఁకల చెంతల మావిమోకలన్
మలకలు గాఁగ నల్లికొను మాధవికా లతికల్ మరందముల్
చిలికెడు పువ్వుచప్పరము చెంగట యా పొదరింట నుండెదన్" (2—7)

"కుల స్త్రీ యభిసరించునేని తన యవయవములలో దాఁగి సద్దై ఆభరణములు శబ్దింపకుండునట్లు గావించి ముసుంగువే సంవృతయై యభిసరించును" అని సాహిత్య దర్పణమున చెప్పినట్లే నీ స్వీయ కా ప్రౌఢదూతికచేయు హెచ్చరిక జూడుడు:

"కొలముసాము లటంచు గూడి రాకుండను
బాదాంగదమ్ముల బరిహరింపు
మొగిలిమొత్తమటంచు మూఁకపేయక యుండ
గిలుగంటున జేర్పు మేలి ముసుగు
వెలఁదివెన్నెలయంచు వెంట రాకుండను
తళుకుఁ గన్నులఁజావు బెళక నీకు
మసఁగుజాట్ట మటంచు సంటి రాకుండను
చన్నుల పయ్యెద జార నీకు
మసుచుగ్గై నేసి..... (2—14)

3. లక్షణ: వాసక సజ్జిక—

"ఎవతెకు సిద్ధమయిన పడకటింట సఖి అలంకారము చేయునో ఆమె ప్రియుని రాకను ఎదురు చూచుచున్నట్టిది వాసక సజ్జిక యగును."

"వారము నేడెయంచు యదువల్లభు రాకనుగోరి లక్షణా
సారసగంధి కేళిమణిసౌధము తా గయిసేసి వేడుకన్
హారపదాంగదప్రముఖహారిణియై తపనీయమందిర
ద్వారమునందు నిల్చ........" (2—42)

4. జాంబవతి: విప్రలబ్ధ—

"ప్రియుఁడు సంకేత మేర్పఱిచియు ఎవతె సన్నిధికిరాఁడో మిక్కిలి అవమానిత ఆమె విప్రలబ్ధ యని యెఱుంగఁదగినది."

"చింతా సంతతిఁజిక్కి చెక్కిటపయింజేఁజేర్చి చింతింప నీ
ప్రాంతారామనికుంజపుంజములచాయ న్నిల్చి వామాక్షి నీ
కాంతుండెవ్వెద నంచు నేవు దమకన్ గాసింబడం జేసితే
కాంతా యూవ్విలుసేయు మాయలకు లోఁగాకుండు వారెవ్వరే
(3. 6.) అని జాంబవతి అవమానితయై వగచును.

5. మిత్రవింద: ఖండిత—

"ప్రియుఁడు అన్యతోడి సంభోగసంవుఁ జిహ్నములు గల వాఁడై ఎవతెకడకు వచ్చునో ఈర్ష్యా కషాయితయగు నా నాయికను ఖండితయని పండితులు పేర్కొందురు."

"చెక్కిట గోరులున్ నిదురచిన్నెలుచూపెడి వాలుఁజూపులుం
బుక్కిటిపీడియంబును గుబుల్కొను మేను జవాదివాసనల్
చెక్కులు చూప మీన్ బిరుదు టెక్కెమువాని విలాస వైఖరిం
జొక్కుచువచ్చు నాయకునిఁజూచి కషాయితలోచనాంతయై" (3. 29)

6. సుదంత : విరహోత్కంఠిత—

"వచ్చుటకు ఉద్యుక్తుఁడయ్యును దైవవశమున ప్రియుఁడు రాఁడేని అతని రామివలనివగచే పీడితయై నట్టిది విరహోత్కంఠిత యనఁబడును." సుదంత యెట్లు వగచినదో చూడుడు:

"వెలి వినరి నటులున్న దీ విరహ చిహ్న
మింతి నీ చెంత కాయున యిపుడె వచ్చు
ననెడు నీ మాటలకుఁ జాల నలరియుంటి
నింత తామసమోట యే వెఱఁగ సకట" (3.66)

7. కాళింది : ప్రోషితభర్తృక—

"ఎవతెపతి నానాకార్యవశమున దూరదేశమేఁగునో మదన దుఃఖార్తయగు నామె ప్రోషిత భర్తృక యగును." కాళింది చెలితో తన దుఃఖమును చెప్పుట చూడుడు:

"వద్దికి (ఒద్దకు) వచ్చు నాథుఁడను వార్తలు వీనవమ్మియుండియే
నద్దమరేయిదాఁక పడియాసల నాతని రాకఁ గోరఁగా
ప్రొద్దుమపోయె నన్నుమరి ప్రోషితభర్తృకఁగావొనర్చి యే
గద్దరి ముద్దులెంచి వడిగాఁజనెనో హరి గొల్లపల్లెకున్" (4. 6.)

8. సత్యభామ:స్వాధీనపతిక—

"కాంతుఁడు రతిగుణాకృష్టుఁడై ఎవతె చెంతను బాయఁడో విచిత్ర విభ్రమాసక్త ఆ నాయిక స్వాధీన పతిక యనంబడు". కృష్ణుఁడు సత్య ననునయించుట చూడుఁడు:

"బాలేందూపమఫాల యేల యిఁక నీ భావాతిసంగోపనం
బే లీలన్ విహరింప నీవు మదిలో నేలాగు చింతింతువో
యాలీలన్ సమకూర్చువాఁడ భవదాయత్తంబు చిత్తంబు నీ
వేళల్ గాచుక సేవ సేయుటకునై నేమూరు నేఁ గోరుదున్" (4—38)

మద్రాసు ప్రభుత్వముచే ప్రకటింపబడిన నీ 'రాజగోపాల విలాసము'నందు కొన్ని ముద్రణాదోషములును దొరలినవి. కార్యభారములతో తీరికయుండని విద్యావేత్తలకే 'ప్రూఫ్' లను చూచుపని నంటగట్టుటచే నీ దోషములిన్ని దొర్లుచున్నవి. దీనికి భిన్నమగు వాతావరణము ఆంధ్రదేశమునం దవతరింప గలదని యూహించు చున్నాను.

# "మాతంగం అసంస్కృతీయము"

శ్రీ ఎం. విశ్వనాథం

"మతంగజో గజోనాగః కుంజరో వారణః కరీ" అని అమరుడు నామలింగాను శాసనంలో గజపర్యాయపదంగా మాతంగ శబ్దాన్నుల్లేఖించాడు. లింగాభట్టీయకారుడు "మతంగ ఋషి నుండి వచ్చినది" అని నిర్వచించా డీ శబ్దాన్ని. "తత ఆగతః" అనే వ్యాకరణ సూత్రా న్ననుసరించి పంచమ్యంతమతంగ శబ్దానకు అణ్ ప్రత్యయం చేరిస్తే ఏర్పడ్డ రూపమే యీ మాతంగ శబ్దం.

కతిపయ విద్వచ్ఛిఖామణు లీ శబ్దం గైర్వాణంకాక విదేశీ శబ్దమని భావిస్తున్నారు. వారు 'మతంగజో గజో నాగః......" అనే ఈ చరణం అమర కర్తృకం కాదనీ, ఎవనిచేతనో ప్రక్షిప్తాంశంగా దూర్చబడిందనీ అంటారు.

సంస్కృతభాషలో భాషాంతర శబ్దాల అస్తిక్యాన్నంగీకరించని—'తల్లి సమస్త భాషలకు దైవతభాష ధరాతలంబున"నని తలపోసే మరికొందఱు విద్యా దయితులు ఈశబ్దం శుద్ధ సాంస్కృతిక మేనంటూ వాదిస్తారు.

లింగాభట్టీయోక్త వ్యుత్పత్తి భాషా జిజ్ఞాసువుల కెట్టి సమాధానం సాయింపనేరదు. సంస్కృతం ఒకనాడు ప్రవాహిని· ఒక జాతి సొత్తుకాక, సర్వోపాదేయమై సర్వత్రా వ్యాపించి, ఇలలో నలుక్రేవలా మత, విజ్ఞాన, సంస్కృతి దీధితుల వెలయించి, దేశ పురోగమనానికి సాధనమైన దీ భాషామతల్లి. ఈ సజీవ—సరస్వతి అభంగమై ధారాళంగా ప్రవహిస్తూ, వివిధ భాషా క్షేత్రాల్ని సరస సాహిత్య సస్యములతో విభవ సంపన్నం చేసింది. సర్వదేశ వ్యాప్తమయి అలరారినందున ఆ యా భాషల శబ్దాలను తనలో కొంత మార్పుతో ఇముడ్చుకుంది. అట్టి సంస్కృతీ కృత దేశ్య శబ్దాల్ని చూపి భాషా సేవకుల కృతజ్ఞతలకు పాత్రులైనవారు శ్రీ యాదవ ప్రకాశులు.

మన భారతీయులు ప్రాచీన కాలాదారభ్య చీనా, రోము, గ్రీసు మున్నగు సుదూర దేశాలతో వ్యాపార సాహారాలు జరిపి నట్లు ప్రబల చారిత్రక ప్రమాణా లున్నవి. వస్తు వినిమయంతోపాటు ఒక భాషనుండి యింకొక భాషలోనికి శబ్ద సంక్రమణం కూడా జరుగుట న్యాయమే. ఆంగ్ల భాషనుండి మన తెనుగునకు సంక్రాంతమవ్వలేదా! రైలు, మోటారు, బస్సు, స్టేషన్‌లాంటి శబ్దాలు? మీమాంసాభాష్యకారుడయిన శబరస్వామి 'పిక' ప్రభృతి శబ్దాలు అసంస్కృతీయాలని వక్కాణించ లేదా?

ఇంత తెలిసీ కూడా సంస్కృతంలో భాషాంతర శబ్దాల అస్తిక్యా న్నొప్పుకోకపోవడం బాగుండదేమో.

అయితే 'మాతంగ శబ్దం' అన్య భాషలనుండి సంస్కృతాన ప్రవేశించిందని చెప్పే మొదటికోవ పండితుల మతాన్నే ఈ వ్యాసంలో ఉట్టంకింపదలచాను.

ఏనుగ సమస్తమూ తొండంతోనే గ్రహించుకుంటుంది. అది దాని కొక పరమ సాధనం. కాన హస్త శబ్దాధారంతో ఈ బృహ జ్జంతువునకు "హస్తి—కరి" అని నామకరణం చేశారు. సంస్కృతంలో హస్తి-కరి అని హిందీభాషలో హాథీ అని (హాథ్ అంటే చేయి (తుండము) అది గలది హాథీ) మరాఠీలో హాత్తి అనిన్నీ ఏనుగకు పేర్లు.

(దంతీ దంతావళో దంతీ ద్విరదో నేకపోద్విపః మతంగజో గజో నాగః కుంజరో వారణం కరీ, ఇభః స్తంబేరమః పద్మీ" అని అమరం)

భారతీయేతర భాషల్లో గూడ హస్త శబ్దాధారంతోనే పేరుం దేనుగకు. ఇండోనేషియన్ కుటుంబ భాషలో 'లిమన్' అంటే ఏనుగ. ఆ భాషలో లిమ అంటే చేయి. మలయా ద్వీపపు భాషల్లో తోంగ్, తుంగ్, తాక్ అని. సీ్తంగ్ భాషలో తోంగ్ అనీ, ఖ్మేర్ భాషలో డంగ్ (తంగ్) అనీ, హలంత రూపాల్లోనూ; ముండాపరివారజాతమగు సంథాలీలో తి, ఖ్మేర్ భాషలో దయి (తఇ), అనామయిట్‌లో తయి, మోన్‌భాషలో తోఇ (తఇ) పలౌంగ్‌లో తఇ అనీ అజంత రూపాల్లోను, 'హస్త' శబ్ద వాచకాలు కన్పిస్తున్నవి.

'తక్'వూ అనేది పై శబ్దాల సారరూపమని నిర్ధారించవచ్చు. ఆస్ట్రో ఆసియాటిక్ భాషల్లో అంత్య వ్యంజనం లోపించుటూ, దాని స్థానే స్వరభక్తి (Vocalic) అంశాలైన 'ఇ' ఉ" లు వచ్చి చేరుటా కద్దు.

జరయి భాషలోని తోఙన్, చంపా భాషలోని తఙన్, మల్గషీ భాషలోని తానన్, మలయా భాషలోని తఙన్ అనే శబ్దాలు (చేయి అనే అర్థంలో) గమనింపదగినవి.

'హస్త' అనే అర్థంలో మఙన్‌తోఁ, తఙ్ తోఙ్ అనే మలయా ద్వీపపు భాషల్లోని శబ్దాలు ద్రష్టవ్యములు.

ఇందు 'మ' ఉపసర్గగా తోఙ్ శబ్దంగా భావిస్తున్నారు కొందరు విమర్శక సోదరులు.

సంథాలీ భాషలోని మరఙ్ శబ్దార్థం 'దీర్ఘము' 'విశాలము' 'గొప్పది'గా సెలవిచ్చారు Campbell దొరగారు. ఇందు—మ ఉపసర్గ;రఙ్ (లఙ్)ధాతువు. చంపాభాషలో ప్రాఙ్, జరయి భాషలో ప్రాఙ్, గ్లాఙ్ శబ్దాలు గూడ విచారణీయములే. ప్రస్తుతపు టనామయిట్ భాషయందలి 'లోన్' (గొప్పది) శబ్దంలో ధాతువే సురక్షితంగా నిల్చింది. కాని మధ్యకాలపు టనామయిట్‌లోని మ్లోఙ్ శబ్దమందు దుపసర్గస్థితిగూడ లభ్యతోమాంది.

'మ' అనే ఉపసర్గ క్రియాదులకు విశేష బలం వచ్చేందుకని ఖాసీ భాషలో ఉపయోగింపబడుతోంది.

హస్తవాచకాలయిన తంగ్, తఙన్ ప్రభృతుల సారరూపమయిన తఙ్‌ను విశేషబలదాయకమగు 'మ' అనే పురః ప్రత్యయంతో జోడిస్తే 'మతఙ్' అనే రూప మేర్పడుతుంది.

"ప్రకృష్టమయిన వేయి (తొండం)కలది" అనే వ్యుత్పత్తి లింగా భట్టీయంకంటె కొంత సమంజసంగా వుంటుంది.

"యుక్తి యుక్త ముపాదేయం వచనం" అని గదా ఆర్యోక్తి.

# సమ్మోహ విద్య

## శ్రీ పెర్సి. ఇ. లాల్‌కాకా

సమ్మోహవిద్య ఆధునికశాస్త్రం కాని, ఇటీవలి పరిశోధన కానీ కాదు. ఎంతోకాలం నుండి భారతదేశము, తదితర ఆసియా రాజ్యాలలో ప్రాచీనమునులు, సాధువులు ఆత్మవశీకరణకు, ఆధ్యాత్మిక వికాసానికి ఈ విద్యను అభ్యసించేవారు. ప్రాచీనములైన రోమ్, గ్రీస్, ఈజిప్ట్‌దేశాల్లో శతాబ్దాల క్రితం నుంచి సమ్మోహవిద్య అభ్యసింపబడినట్లు లిఖితసాక్ష్యమున్నది. కాని సమ్మోహ విద్యను గూర్చి శాస్త్ర పరిశోధన ప్రారంభించిన ఘనత డా. ఫ్రాంజ్ ఆంటన్ మెస్మర్ అనే స్విస్ దేశ వైద్యునికి దక్కుతుంది. ఒకరోజున వారు ఒక రోగికి చికిత్స చేస్తూ తామా రోగిని నిద్రింప జేసినట్లు కనుగొన్నారు. ఆ నిద్రావస్థలో రోగి మాట్లాడగల్గటం, తమ ఆజ్ఞలకు బద్ధులు కావటం చూసి వారి ఆశ్చర్యానికి మేరలేదు. ఈ పరిశోధనతో ధైర్యం వచ్చినవారై డా. మెస్మర్ అసంఖ్యాకులైన తమ రోగులపై ప్రయోగాలు జరిపి కేవలం మాటలతో సూచనలు చేసి అద్భుతమైన చికిత్సలు జరిపారు. తమ వ్రేళ్ల కొనలగుండా 'జంతు వశీకరణ శక్తి'(Animal magnetism) అన్న ఒక విధమైన అయస్కాంత ద్రవం ప్రవహించేదని వారు తెల్పారు. మాటలతో తగుసూచనలు చేసి, చేతులతో సంజ్ఞలుచేసి రోగులను వారు నిద్రపుచ్చేవారు. ఆ నిద్రావస్థలో ఆరోగ్యాభివృద్ధికి ఎట్టి సూచనలు చేసినా రోగులు వాటిని సునాయాసంగా ఆచరించేవారని తెలిసివచ్చిన తర్వాత, రోగులకు ఎంతోఉల్లాసంగా ఉండేదని, ఆరోగ్యం మెరుగైనట్లు తోచేదని వారు వివరించారు. ఈ ప్రక్రియకు వారు తమపేరిట 'మెస్మరిజం' అని నామకరణం చేశారు.

## డా॥ బ్రెయిడ్ పరిశోధన

తర్వాత 40, 50 సంవత్సరాల కాలంలో ఈవిషయమై పెక్కు ఐరోపా రాజ్యాల్లో విస్తృతమైన జటిల పరిశోధనలు జరిగాయి. అప్పుడు వెలుగులోకి వచ్చిన మరోగొప్ప వైద్యుడు డా. జేమ్సు బ్రెయిడ్. పెక్కుమంది రోగులపై సమ్మోహప్రక్రియా ప్రయోగాలను పెక్కింటిని జరిపిన తర్వాత వారు మెస్మర్ అయిస్కాంత ద్రవ సిద్ధాంతాన్ని పూర్తిగా కొట్టివేసారు. ఈ ద్రవంవంటి మానవతీత శక్తులతో ఏ మానవుడూ జన్మించడని డా. బ్రెయిడ్ దృఢంగా వాక్కొ చెప్పారు. వారి సిద్ధాంతరీత్యా సామాన్యుడు, ఆరోగ్యవంతుడు అయిన ప్రతి వ్యక్తిలోను తాను కోరినప్పుడు నిద్రవంటి జడస్థితిలోకి పోగలశక్తి దాగి వున్నది. ఆ స్థితిలో ఎట్టి సూచనలనైనా వారు విశ్వాసంతో ఆచరిస్తారు. ఈశాస్త్రానికి డా. బ్రెయిడ్ 'హిప్నాటిజమ్' అనే క్రొత్త పదాన్ని కూర్చారు. గ్రీకుభాషలో 'హిప్నాస్' అనేపదానికి 'నిద్ర' అని అర్థము. ఆవిధంగా మెస్మరిజానికి, హిప్నాటిజానికి ఎట్టితేడా లేదు. అవి ఒకే అర్థంగల రెండు పదాలు మాత్రమే.

## 'మనస్సు' స్వరూపం

నిద్రావస్థను కల్గించుట యేలాగో వివరించేముందు మానవుడి మనస్సు ఏవిధంగా నిర్మింపబడిందీ వివరించటం అవసరం. మనస్తత్వం శాస్త్రజ్ఞులు మనస్సును జాగ్రదవస్థలోని మనస్సు, సుప్తావస్థలోని మనస్సు అని రెండుగా విభజించారనిమీాకు తెలుసు. రెండవది మొదటిదానికన్నా ఎన్నోరెట్లు శక్తివంతమైనదనే ముఖ్యాంశం పెక్కుమందికి తెలియదు. చేతనావస్థలో జాగ్రదవస్థలోని మనస్సును మాత్రమే వుపయోగించగలం. మరోవిషయు మేమంటే మనం మెలుకువగా వున్నప్పుడు సుప్తావస్థలోనున్న మనస్సు నిద్రపోతూ వుంటుంది. ఆమనస్సుకు వివేచనాశక్తి వుండదు. అందువలన జాగ్రదవస్థలో నున్న వ్యక్తికి ఏదైనా సూచనచేస్తే వివేచనాశక్తిగల మొదటి మనస్సు ఆసూచనను ఆమోదించనిఎడల అది రెండవ మనస్సులోనికి చొచ్చుకొని పోలేదు. కాని సమ్మోహ ప్రక్రియ ప్రయోగింపబడిన వ్యక్తివిషయంలో పరిస్థితిపూర్తిగా తారుమారవుతుంది. ఆ స్థితిలో అంతకుముందు చురుకుగా వున్న జాగ్రదవస్థలోని మనస్సు మొద్దుబారుతుంది. ఇదివరలో స్తబ్దంగావున్న సుప్తావస్థలోని మనస్సుకు చురుకుదనంవస్తుంది. సమ్మోహవేత్తతో ఆ మనస్సు మాటిగా సంబంధం కలిగి వుంటుంది. కాన ఆస్థితిలో ఏదైనా సూచన చేయబడితే జాగ్రదవస్థలోని మనస్సు నిద్రావస్థలోకి ప్రవేశించటంవల్ల ఎట్టి ప్రతిఘటనచేయదు. ఆసూచన తిన్నగా సుప్తావస్థలోని మనస్సును చేరుకుంటుంది. ఇంతకుముందు చెప్పినట్లు ఈ మనస్సుకు విచక్షణాశక్తి లేనందున ఆసూచనను అది మంచిదేకాని చెడ్డదే కాని ముఖ్యమైనదే కాని స్వల్పమైనదేకాని ఎట్టి అభ్యంతరం లేకుండా అంగీకరిస్తుంది. అయితే అలా అంగీకరించటానికి ఒక షరతువున్నది. వ్యక్తిగత నైతిక విధానాలను కాని లోతుగా వ్రేళ్ళుదన్నుకున్న నియమాలనుకాని వుల్లంఘించే ఎట్టి సూచనను సుప్తావస్థలోవున్న మనస్సు అంగీకరించదు. ఇక్కడ ఒక వుదాహరణ చెప్పనివ్వండి. మాంసాహారాన్ని ఏవగించుకునే కఠిన శాఖాహారిపై సమ్మోహవిద్య ప్రయోగించి మాంసం తినమని సూచిస్తే అతడా సూచనను తిరస్కరించటమే గాక ఆదెబ్బతో నిద్రావస్థనుండి మేల్కొనటంకూడా సంభవించవచ్చును. రహస్యంగా మాంసంతినే శాఖాహారిమాత్రం ఆసూచనను సమ్మోహ నిద్రావస్థలో అంగీకరిస్తాడు.

## దోహదమిచ్చే అంశాలు

ఈనిద్రావస్థను కల్గించటానికి ఏ అంశాలుతోడ్పడుతున్నాయో పరిశీలిద్దాం. అన్నిటికన్నా ముఖ్యమైనది సూచన. తర్వాత విశ్రాంతి, ధ్యానం, ఆలోచన, విశ్వాసం వస్తాయి. ఒక్కొసారి ఒకచిన్న మాటవల్ల లేక సూచనవల్ల మీా ముఖం ఎఱ్ఱగా ఎరుపెక్కడం, మీా నోరూరటం, లేక మీారోమాలు, నిక్క

బొడుచుకోవటంఎలాజరుగుతున్నదోపరిశీలించండి. న్యాయవాదులు, రాజకీయవేత్తలు, వక్తలు, వ్యాపారులు ప్రజలను లోబరుచుకోవటానికి సూచనలను వినియోగిస్తారు. ఆధునిక ప్రకటనా పద్ధతులు కూడా అద్భుతమైన సూచనాశక్తిపై ఆధారపడివున్నాయి. ఎవరికైనా సూచనచేయబడితే అదివారిలో ఆలోచనాశక్తిని దగుల్చ్కాలువుతుంది. మానవుడిలో ఆలోచనాశక్తి, ధ్యాన నిమగ్నత అధికమైనకొద్దీ అతడిని సమ్మోహ ప్రక్రియతో త్వరగా నిద్రపుచ్చగలం. చివరకు నమ్మకకూడా ఇందులో కొంత పని చేస్తుంది. సమ్మోహమునకు వశులవుతామనే విశ్వాసం మీకు తప్పకవుండాలి. అట్టిసందర్భంలో అది నెరవేరే పూర్తి అవకాశంవున్నది. మీరు మాత్రం సమ్మోహకారుని ఆదేశాన్ని సక్రమంగా పాటించాలి.

ఇప్పుడు మనం ఈ నిద్రావస్థను సమ్మోహకారుని సూచనలపై ధ్యాన ఉంచి ఆలోచనలు సాగించిన తర్వాత మన సుప్తావస్థలోని మనస్సు అతిచురుకుతో అనూచనలకు లొంగే వింత స్థితి అని నిర్వచించవచ్చు. ఈ నిద్రావస్థ, నిద్రకాని, తెలివి తప్పిపోవటంకాని కాదని మీరు గుర్తుంచుకోవాలి. రాత్రిళ్ళ నిద్రపోయే ముందర, పగలు మెలకువ వచ్చేముందు మనం నిద్రమత్తు వంటి అవస్థను అనుభవిస్తాం. ఇది కూడా ఆ అవస్థ మాదిరిదే. నిద్రమత్తు స్థితిలో మన జాగ్రదవస్థలోని మనస్సు విశ్రాంతి పొందుతూఉంటుంది. సుప్తావస్థలోని మనస్సు చురుకుగా పనిచేయటం సాగిస్తుంది. ఎట్టి సూచన లివ్వబడినా అంగీకరించటానికి సిద్ధంగా ఉంటుంది.

## సూక్ష్మ పద్ధతి

ఈ సమ్మోహ ప్రక్రియలో నిద్రతెప్పించటానికి పెక్కు పద్ధతు లున్నాయి. కాని ప్రాథమిక సూత్రాలు అన్నింటిలోనూ ఒకటే. అందుకని నేను ఒక సూక్ష్మ పద్ధతిని మాత్రం వివరిస్తాను. సమ్మోహకారుడు ఒకరిని కుర్చీలో సుఖాసీనుడు కావాలనికాని, శరీరమంతటినీ పూర్తిగా చాచి ప్రక్కమీద పడుకోవాలనికాని కోరతాడు. తర్వాత అతడు ఆ వ్యక్తి ముఖాని కెదురుగా వెలుగుతున్న కొవ్వువత్తి, లేక కాంతివంతమైన వస్తువు నొకదాన్ని ఉంచుతాడు. కొవ్వొత్తి ఆ వ్యక్తికి రెండు అడుగుల దూరంలో కంటికి కొద్దిగా ఎగువను ఉంటుంది. తదేకంగా దాన్ని కొన్ని నిముషాలు చూడటంతో వాని కంటి నరాలు త్వరలోనే అలసిపోయి నిద్రమైకం కమ్ముతుంది. నిద్రరావటం కని పెట్టిన సమ్మోహకారుడు మరికొంత నిద్ర విశ్రాంతులను కలుగజేస్తూ మార్పులేని కంఠంతో సూచన లివ్వటం ప్రారంభిస్తాడు. రెండు నుండి అయిదు లేక పదినిముషాల్లో ఆ వ్యక్తి నిద్రావస్థలోకి పోయి ఇంచుమించు అన్ని సూచనలను అనుసరిస్తాడు.

## అద్భుత కార్యాలు

సామాన్యులు ఆరోగ్యవంతులు అయిన వ్యక్తుల్లో 90 శాతం వివిధస్థాయిల్లో సమ్మోహానికి వశులౌతారు. వారిలో 20 శాతం మంది మాత్రం గాఢమైన నిద్రావస్థను పొందుతారు. అందులో వారు సూచనల ప్రకారం మెలకువగా ఉన్న విధంగానే నడవగలరు, మాట్లాడగలరు, మరెట్టి పనులనైనా చేయగలరు. సమ్మోహస్థితిలోనేకాక తర్వాత చేతనావస్థలో కూడా వారు ఇంచుమించు చెప్పబడిన సూచన లన్నిటినీ నిర్వర్తిస్తారు. సమ్మోహస్థితిలో వారికి భ్రమకలిగించవచ్చును. ఎటువంటి బాధకూడా తెలియకుండా చేయవచ్చును. వారిని వట్టి చెవిటివారినిగా చేయవచ్చును, లేక వారి శ్రవణశక్తిని నిశితంగా మార్చవచ్చును. వారిని అంధులుగా చేయవచ్చును, లేక తీక్ష్ణమైన దృష్టిని కలిగించవచ్చును. ప్రపంచంలోకల్లా చేదైన వస్తువు తియ్యగా రుచిగా ఉంటుందని సమ్మోహకారుడు సూచిస్తే అతడు దాన్ని ఆప్యాయంగా నమిలి తింటాడు. ఒక సీసాలో సుగంధవాయువు ఉన్నదని సూచిస్తే అతడు సునాయాసంగా ఘాటైన అమ్మోనియా పొగలను కూడా పీల్చగలడు.

సమ్మోహవిద్యతో మన ఇంద్రియశక్తు లన్నిటినీ మరింత బాగా పనిచేయించవచ్చునని దీనితో మీరు గ్రహించగలరు. కాన జీవితంలో సమ్మోహవిద్య యొక్క ప్రాముఖ్యతను ఎవరైనా హర్షించగలరు. అయితే బహుకొద్దిమంది దీన్ని వినియోగించుకుంటున్నట్లు కన్పిస్తుంది. అందుకు ముఖ్యకారణం ఈ విద్యనుగూర్చి కొన్ని అపోహలు ఉండటమే ననుకుంటా.

పెక్కుమంది సమ్మోహవిద్యను ప్రమాదకరంగా భావించి సమ్మోహకారుడు తిరిగి తమను లేపలేకపోతాడేమో నన్న భయంతో సమ్మోహ ప్రక్రియ చేయించుకోవటానికి సందేహిస్తారు. ఆ అవస్థ నిద్రకాని, ఆత్మవశం దప్పే చైతన్యరహిత స్థితికాని, కాదని నేను హామీ నివ్వదలిచాను.

'మనోభీష్టానికి వ్యతిరేకంగా ఎవరినైనా సమ్మోహప్రక్రియ వశంచేయగలరా ?' అనేది సాధారణంగా ప్రజలు అడిగే మరో ప్రశ్న. దానికి ఆ వ్యక్తి యిష్టానికి వ్యతిరేకంగా అతని సహకారం లేకుండా సమ్మోహానికి వశంచేయటం దుస్సాధ్యమని నేను జవాబిస్తున్నాను. సహకారం సమ్మోహవిద్యకు మూలాధారం. అది లేకపోతే సమ్మోహవిద్యే లేదు.

## వైద్యంలో వాడుక

కడపటిగా వైద్యశాస్త్రంలో ఈ విద్య ఉపయోగం గూర్చి గమనిద్దాం. పాశ్చాత్యదేశాల్లో నేడు సమ్మోహవిద్యను పంటివైద్యంలో, సుఖప్రసవంలో అధికంగా వాడుకం చేస్తున్నారు. మానసిక వ్యాధులచికిత్సలో, శ్రమ ఒత్తిడివల్ల కలిగే వ్యాధులచికిత్సలో, దీనిని విజయవంతంగా ప్రయోగిస్తున్నారు. అధిక ధూమపానం, త్రాగుడు, గోళ్ళు కొరకటం ఇత్యాది దురలవాట్లను ఇతరమైన పెక్కురోగాలను ఇది అద్భుతంగా నివారిస్తుంది. ముగింపులో మామూలు వైద్య చికిత్స పనిచేయలేని కొన్ని సందర్భాల్లో సమ్మోహ పద్ధతి చికిత్స సత్ఫలిత మిచ్చినప్పటికీ అది సర్వరోగ నివారిణి అని భావించ రాదని నేను గట్టిగా చెప్పదలిచాను. అది సర్వరోగనివారిణి కాదు. దాని పరిధులు దానికున్నాయి.

# గ్రంథవిమర్శనము

## శాంతి

శాంతి : క్రౌను ¼ భారతి సైజున 810 పుటలు గల బృహత్ గ్రంథము. క్యాలికో బయిండు. సాహిత్య సంకలనము. సంధాత భార్గవవిద్యాదేవకులపతి. నిర్మాత : ఏకా ఆంజనేయులు— వెల రు. 25 —లు. ప్రతులకు : బండ్లమూడి హనుమాయమ్మ హిందూబాలికా బహుళార్థ సాధక పాఠశాల 2/17, బ్రాడీపేట, గుంటూరు—2 అడ్రెసులో ప్రధానోపాధ్యాయురాలు పేరున వ్రాస్తే పొందవచ్చును.

**200** మంది రచయితలు సమకూర్చిన "పద్య గద్య గేయాత్మకమైన రకరకాల రంగుల రచనాప్రసూనాలతో కూర్చిన కదంబం." ఈ సంకలన నిర్మాత శ్రీ ఏకా ఆంజనేయులుగారు—వారి ధర్మపత్ని శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారు దివంగతులయిన కారణంచేత వారి తొలిసాంవత్సరికము సందర్భములో 12—1—1962 ఈ గ్రంథమును ప్రచురణ చేయించినారు. భార్గవ విద్యాదేవకులపతి శ్రీ పి. వి. ఎల్. వి. ప్రసాదరావుగారు "ఈ సంపుటికి రచనలు సేకరించి, సంపాదకత్వం వహించి రూపురేఖలు తీర్చి దిద్దినట్లు" కృతజ్ఞతలో శ్రీ ఆంజనేయులుగారు వెల్లడించారు. ఈ సంకలనం వల్ల వచ్చే విక్రయధనాన్ని బండ్లమూడి హనుమాయమ్మగారి హిందూ బాలికా బహుళార్థ సాధక పాఠశాలకు సమర్పించారు. ఆంజనేయులుగారి సతీమణికి "చిహ్నిత పరమలోక విశ్రాంతి, దుర్వారబాధాతప్తులైన వారి హృదయములకు ఒక అవగత క్లాంతి, నవ్య దివ్య భావనాక్రాంతి, సాహిత్యలోకానికి ఒక వినూతన విద్యుత్కాంతి. ఈ 'శాంతి' సౌమనస ప్రశాంతి" అని సంధాత తన సంపాదకీయములో చెప్పుకొన్నారు. "పుస్తకాని కిన్ని పుట లుండాలి, ఇంత వ్యయమనికాని భావించక సర్వం నిర్మించడానికి సంపాదకులకు పూర్తి అధికార మిచ్చారు. గ్రంథం మొత్తంమీద—ఆంజనేయులు గారిని గూర్చిగాని వారి అర్ధాంగిని గూర్చిగాని ఒకమాట అయినా ఉండకూడదనే నియమం పెట్టారు. సంపాదకులు ఆ నియమాన్ని పాటించారు. "ఈ నాడు ఆంధ్రదేశంలోని జీవత్కవుల రచనలు సేకరించి యీ సంకలనం నిర్మించబడ్డది" అని సంధాత చెప్పుకున్నారు. "నా కందినంతవరకు ఆంధ్రసాహితీ నిర్మాతల జీవన్మూర్తుల రచనామూర్తులను పరిగ్రహించడానికి ప్రయత్నించాను. పుష్పములు ఇచ్చే రొకరు. మాల గ్రుచ్చే రొకరు. ధరించేవారు వేరొకరు. నేను కేవలం మాలాకారుణ్నే" అని సంపాదకుని నివేదన.

ఫలములయెడ బ్రహ్మార్పణ
కలనపరుండ గురుకార్య కర్మము నడుపన్
వలయున్ దత్త్వజ్ఞానము
దలకొనినన్ కర్మశమము తానై కలుగన్.

తిక్కన మహాభారతములోని శాంతిపర్వ భాగమైన యీ పద్యములో ప్రారంభమై—ఈ సంపుటి అంకితము పొందిన ఆదిలక్ష్మమ్మగారు నిత్యమును పాడు మంగళహారతులలోని రెండు పాటలలో అంతమగుచున్నది. అట్టమీద ఆంధ్రుల సంస్కృతికి చిహ్నమైన నారికేళయుత పూర్ణకుంభము నాగార్జునకొండ శిల్పములోనిది వేసి, అట్ట చివర అధునాతన రాజకీయ శాంతి చిహ్నము—తెల్ల పావురము బొమ్మతో అలంకరించారు. నేటి కాలములో ధనము, ముద్రణాసౌలభ్యము సమకూరిన ఎట్టి సంకలనములు తెచ్చుటకు వీలు కలదో నిరూపించుటకు ఈ సాహిత్య సంకలన మొక మంచి నిదర్శనము. మన యాస్థాన కవి కాశీ కృష్ణాచార్యులుగారు మొదలు నిన్న మొన్న సాహిత్య రంగంలో కన్ను తెఱచిన "సత్యం" వంటి యువరచయితల వరకు 200 మంది జీవత్ కవుల రచన లిందున్నవి. గ్రంథము చివర ఈ 200 మంది రచయితల పరిచయమున్నది. దీనిలో రచయితల గూర్చిన సంగ్రహ వివరణ మున్నది. ఈ రచయితల జన్మదినములు 1872 మొదలు 1943 వరకు పరచుకొన్నవి. దీనినిబట్టి వృద్ధులు, ప్రౌఢులు, యువకులు, బాలురు కూడ పంపిన రచన లిందు సంకలనము పొందినట్లు గ్రహించవచ్చును. ఈ పరిచయము తరువాత అకారాదిగా 'కవి రచనా పరిచయానుక్రమణిక' ఉన్నది. ఇదిగాక గ్రంథాదిని 281 విషయములనుల్లేఖించిన విషయసూచిక ఉండనే ఉన్నది. ఈ సంకలనములో పద్యములు, గేయములు, గద్య రచనలు పంపిన రచయితలకే విషయనిర్ణయభారము నప్పగించి సంధాత కేవలము మాలాకర్తగా మిగిలిపోయిన కారణంచేత—వినాయక పూజకు వివిధ రకాల పూలు, పత్రులు, ఆకులు అలములు సమకూర్చినట్లు—ఈ సంపుటి ఒక అడవిపూల సజ్జగా రూపొందినది. మంచి పరిమళాలతోపాటు, మన్నూ మశానం, క్రొన్ననలతోపాటు మున్ననలు, వన్నె చిన్నెల మొగ్గలతోపాటు వాడిపోయిన ప్రాతపూలు కలిసిపోయాయి. వీనిలో సరిక్రొత్త ప్రాతరచనలు, అతిపురాతన నూతన రచనలూ వచ్చాయి.

ఒకే విషయమును గూర్చి పలువురు, పలు విషయముల గూర్చి ఒకే ఒకరు రచించిన రచన లున్నవి. ఈ సంచికకొరకు ప్రత్యేకముగా రచించిన రచనలు—వ్రేళ్లమీద

లెక్కపెట్టదగినవి ఉండిన ఉండవచ్చు. అందుచేతనే 'శాంతి' ని ధ్వనింపచేయు రచనలు లేవే లేవనవచ్చును. 281 రచనలలో అత్యధికభాగం ఇదివరలో పుస్తకరూపమునవో, పత్రికా రూపమునవో, రేడియో ప్రసారములుగానో పాఠకులకు పరిచితమైనవే. రేడియోలో ప్రసారమైన వానికి కొన్నింటికి ఆకాశవాణి సౌజన్యము గుర్తించారు కాని బహుళసంఖ్య గల రచనలకు అట్టి స్వీకార మైనను చేయలేదు. కారణము సంకలన కర్తలకు అవి ఆకాశవాణి ప్రసారితములని తెలియకపోవచ్చును. రచయితలు తమకు చేతికందిన రచన పంపగానే దానిని అచ్చులోనికి తెచ్చుటయే ఈ సంపుటమైనది కాని యీ సేకరణలో ఒక విచక్షణ, ఒక విధానము అనుసరించినట్లు తోచదు.. 200 మంది రచయితలలో నేటి ఆంధ్ర రచయిత లందరూ లేరు. ఆరుద్ర, శ్రీశ్రీ, భీమన్న, పురిపండా అప్పలస్వామి, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పింకా గణపతి శాస్త్రి, కృష్ణకుమారి నాయని, కనుపర్తి వరలక్ష్మమ్మ, ఇల్లిందల సరస్వతీదేవి—ఇటువంటివా రెందరో ఈ సంపుటములో చేరలేదు. చేరినవారిలో సుప్రసిద్ధు లున్నారు. అప్రసిద్ధు లున్నారు. పద్యరచనలే హెచ్చుగా ఉన్నను అవి తెలుగు పద్యము తీయగా చెప్పగల తీరుతెన్నులు రుచి చూపుచున్నది కాని హృదయస్పర్శియైన రసానుభూతిని కలిగించేవిగా లేవు. వీనిలో కొన్ని అనువాదాలు—సంస్కృతము నుండి తెనుగునకు, మరికొన్ని తెనుగు లిపిలో సంస్కృత రచనలు. కొందరు కవులు, తమ సంస్కృత భాషా పరిజ్ఞానము వెల్లడించుట కిట్టి రచనలు చేసినారేమో కాని నిజముగా కవితా ప్రతిభను ప్రతిఫలింప జేయుట కిట్టి కృషి చేసిరని తలపించరు. చిరస్మరణీయముగా నుండవలసిన యీ సంపుటిలో అట్టి రచనలకు తావు లేకుండ చేయవలసినది. ఈ సంపుటములో ప్రకాశించుచున్న కవులు రచించినవే—ఇంతకంటె ఎన్నో రెట్లు ఉత్తమమైన పద్యములు గద్య వ్యాసములు నున్నవి. దాని పొంత పొక, వా రిచ్చినవి తీసుకొని యీ సంకలనము చేర్చుటచేత యీ "పుష్పమాల" శాంతిని కాని అశాంతిని కాని సూచించక "విశ్రాంతి" ని ధ్వనింపజేస్తున్నది. చర్వితచర్వణము "పాపః పుష్పములు" ఎడనెడ దర్శనమిచ్చుచుండును.

ఆస్థానకవి శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు రచించిన 'గీర్వాణ భాషామతల్లి' "కన్నతల్లి" కి పర్యాయపదముగా వాడినట్లున్నారు.

వీరు రచించిన అనువాదములలో భ్రమరగీతికి అనువాద మొకటి యున్నది.

> పరిమళమ్మున గేదంగి ప్రబల యున్న
> దొలుగు మలిరాజ ! దానికి దూరముగను
> లేదు మధులాభ మచ్చట లేశమైన
> మీదు మిక్కిలి నీ మేన బూదినిండు.

ఈ గీతికి ప్రక్కగానే శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు చేసిన అనువాదం కూడ ప్రకటించుటలో అంతరార్థం తారతమ్య పరిశీలనకు అవకాశ మిచ్చుటకా ? చూడండి, పై పద్యము వంటి మరొక భ్రమరగీతి !

> తొంగి చనుమోయి ! మధుకరా ! దూరమునకు
> సురభిళం బంచు గీతకీ సుమము చేరకు
> అచట లవమేని మధువు లభ్యమ్ము కాదు
> అది యటుండగ ధూసరంబౌను మేను.

వీరి జంటకవి—కాటూరి వెంకటేశ్వరరావుగారి రచన లెన్నో యుండగ శంకరభగవత్పాదుల సంస్కృత రచనానువాదములు ప్రకటించినారు. ఇవి వారికి ప్రీతి కలిగించునేమో కాని, వారి కవితను మెచ్చువారిని స్వీయకవిత అంతగా అలంకరింపజాలవు. విశ్వనాథ సత్యనారాయణగారివి రెండు ఈ సంపుటిలో నున్నది. ఇవి మల్లికార్జునమధ్యాక్కరలలోనివి, "శశిదూతము" కావ్యములోనివి. విశ్వనాథవారి కవితాప్రతిభకు నిదర్శనమైనవి యింకా యెన్నో యుద్భుత రచనలున్నవి. అలాగే 'కరుణశ్రీ' రచన లెన్నో యుండగా కొండొక రేడియో నాటికలోని గీతాలను ఆకాశవాణి సౌజన్యప్రసక్తి లేకయే ప్రకటించుట అంత సమంజసంగా లేదు. జాషువాగారి రచనలలో—ఈ సంకలనములోనికి వచ్చిన ఏకైక శీర్షిక "శ్రద్ధాంజలి". ఆమర్షతో క్రాగిన యెదదపలుకు వాక్యములు అశాంతిని సూచిస్తున్నవి.

> లలిత కళోద్ధరణంబని
> కులమత రహితాధికార గుంఫితస్వేచ్ఛా
> నిలయంబని, సుఖదంబని
> హాళక్కి గావించి రీ పహాడరమంత్రుల్
> కావలె బహుత్వమందు నేకత్వ మనెడు
> మేలి పలుకులు మాట సామెతకు గాని
> ప్రళయ ఝంఝూనిలోద్ధూత బహుళభంగ
> సాగరమునందు సాగునే శాంతినౌక !

పుట్టపర్తి నారాయణాచార్యులుగారి ద్విపద భాగవతములో ఖండిక వేశారు. 24000 ద్విపదలలో 30 ఏపాటి. ఇంక పద్యరచనలో బలాబలాలు చూచుకొంటున్న యువకులు 'స్ఫూర్తిశ్రీ, భార్గవ విద్యాదేవ కులపతి కొర్లపాటి శ్రీరామమూర్తి, సుప్రసన్నవంటి వారి రచనలలో కొన్నింట సంస్కృత సమాసాడంబరము కనిపిస్తున్నది కాని సరస కవితా సంపన్నత స్ఫురింపదు. ఉదాహరణకు కొర్లపాటి శ్రీరామమూర్తి 'నాందీవాణి" లో తుది పద్యం.

> లాక్షా రూక్ష కటాక్ష వీక్షణ విధాగ్రై వేయ ఘంటాగవా
> ధ్యక్షుల్ మెచ్చరుగాక, చైత్ర నవరథ్యా జైత్రయాత్రాచణో
> ర్వ్యక్షేమంకర కాకలీ కల గళ శ్రీ మాధవస్వామి, తా
> దీక్షా కంకణ సూత్రధారి ! అదె నాందీవాణి నా పాలిటన్—

నాయని సుబ్బారావుగారి "వేదనా వాసుదేవము" లో తిరుపతి వెంకటేశ్వరస్వామిపైన పద్యములు కొండపైనుండి దిగి "కరివేపాకు రుచు"ల పైన పయనించినవి.

> కరివేపాకు రుచుల్ పఠించిన రసజ్ఞా! నిత్య వానానిరం
> తర ఛూజాన్విత సుందరోపవన మీ ధాత్రీధర మ్మెందువే
> చలీయుందో మొలిపింపవచ్చుగద స్వేచ్ఛన్ మొక్కనొక్కండుతా
> మరతంపమ్మయి మీ పరస్పర రుచుల్ మూయించి రాణింపగన్.

కొండవీటి వేంకటకవి—"శాక్రిఫైజ్" రవీంద్ర రూపకమునకు చేసిన స్వేచ్ఛానువాదములో గాంధారి మనోవేదన వర్ణిత మైనది.

> తల్లీ ! పిల్లలులేని యీ బ్రదుకు నెందాకన్ భరింతున్ భవత్
> ఫుల్లాంభోరుహ నేత్రయుగ్మమిడ లేదో యాశిస్వ్రాతమున్
> దర్శింగాగల భాగ్యమీజనికి లేదా లేనిచో మ్రోడునై
> యుల్లాసంబు పరిత్యజింపగలవా యూహింపు మా శాంకరీ ?

ఇలాగ చక్కగా కదళీపాకంలో పాగిపోయిన పద్యరచనలీ సంపుటిలో పరశ్శతంగా ఉన్నవి. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "అవని అంతా పెద్ద అక్షయపాత్ర," 'రాయప్రోలు సుబ్బారావుగారి "శ్రీలు పొంగిన జీవగడ్డ" మరికొన్ని గీతములతోపాటు ఇందులో కూడ సరిక్రొత్తగా పొందుపరచారు.

ఆధునిక "ముక్త చందస్సులో" గేయ కవిత లవి పించుకునే రచనలు అమరేంద్ర, గోపాలచక్రవర్తి మున్నగు యువ రచయితలవి చాల ఉన్నవి. వీనిలో కవి సమయములు, మాటలబొమ్మలు క్రొత్తవి. వూహాలు క్రొత్తవి. ఉదాహరణకు—గోపాల చక్రవర్తి "రేపటి మనిషి" కట్టుకున్న కలల గోపురాలు పరిశీలించండి.

> ఇవాళ మనకు కోరికలే గుర్రాలు
> మూడూ ఇంటూ ఏడూ శతాబ్దంలో
> సరఫరా చేసుకుంటాం
> రెక్కల గుర్రాలు కూడా
> రిక్కల్లోకి నిజంగా ఎగరడానికి
> ఎల్లలు చెరిగిపోయి, ఎల్లరు ఒకటయ్యేవేళ
> నేటి సగటు సంతోషాన్ని వేయిపెట్టి హెచ్చించేరోజు
> నిత్యం వసంతంగా ఉండే సీజను
> అదే కనిపిస్తున్నది మన స్టైలివిజనులో—

ఈరకం రచనలలో శ్రీశ్రీ మార్కు భావాలు ముద్రలు కనిపిస్తుంటాయి. అమరేంద్ర— "తీపి చేదు" లో

> చేదు తీపి జీవఫలం
> కాదు కాలకూట విషం
> లేదు సుధా మాధుర్యం
> కాలపు మగ్గం నేసిన కలినేతల చీరెరా !
> వడుగు పేక చెడుగు మంచి ఎడ బాయని చెలులురా
> అశ్రుబిందు హృదయంలో దరహాస విలాసం
> ఒక కంట్లో ఖేదం, ఒక కంట్లో మోదం
> అడుగడుగున జగములోన రెంటికీ అభేదం—

పద్య, గేయ, కవితలలో స్థాలీపులాకముగా చూపిన యీ కృతుల వలన, యీ సంకలనములోని గద్యేతరరచనం స్థాయిని గహించవచ్చును. వీనిలో స్తుతులున్నవి. స్తోత్రము లున్నవి కథలున్నవి. ఖండికలున్నవి. స్మృతు లున్నవి. విస్మృతు లున్నవి. విషయప్రధానమైనవీ, ఆత్మాశ్రయ కవిత్వమనెడు 'విషయీ' ప్రధానమైనవియును కలవు. కాని యే యొక్క రచనమును రసోత్కర్షమును కలిగించునట్టిది లేదు.

ఈ గ్రంథమున కంతకును తలమానికమైన రచన కళా శాంతి యను పేరున శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు శ్రీ విద్యను గూర్చి సమగ్రసమీక్షతో చేసిన గద్య వివరణము. గద్యవిభాగములో అట్టి ఉదాసీనతకు అవకాశములేకుండ కొన్ని మంచి రచనలే వచ్చినవి. "అందమె ఆనందము" అను శీర్షికను 'అమరేంద్ర' వ్రాసిన వ్యాసము మొదలు 'వేదకాల మందు వ్రాత కలదు' అని తెన్నేటి విశ్వనాథముగారు రచించిన వ్యాసము వరకు అన్ని ఆలోచనలకు పని కల్పించేవిగానే ఉన్నవి. అయితే యీ బృహత్ గ్రంథములో పద్య గేయ భాగము ఆక్రమించుకొన్న స్థలము, గద్యవిభాగమాక్రమించలేదు. వీనిలో మతము, వేదాంతము, భాష, వ్యాకరణము, చందస్సు, సాహిత్యము, కళలు మొదలయిన అన్ని విషయములను కూర్చిన వ్యాసము లున్నవి. నాటికలు, కథలు, గల్పికలు లేవు. ఒకే విషయమును గూర్చి పలువురు వ్రాసిన రచనలు కూడ నున్నవి. శ్రీరామసాహితి గూర్చి పిల్లలమర్రి వేంకటహనుమంత రావుగారి రచనతోపాటు "వైదేహి" యని వాదెళ్ల మేధా దక్షిణామూర్తిగారి వ్యాసము, రామాయణము సుందరకాండ గూర్చి కల్లూరి చంద్రమౌళిగారి రచన, ఆదర్శ రామ రాజ్యము గూర్చి శ్రీమతి వూటుకూరి లక్ష్మీకాంతమ్మగారి రచన, రామాయణము మహాకావ్యముగా నిరూపించిన ఖండవల్లి లక్ష్మీరంజనముగారి వివరణము కూడ నున్నవి.. పలు పత్రికలలోను పుస్తకములలోను వెలువడిన వ్యాసము—"రవీంద్ర సౌందర్యాదర్శము" ఈ సంకలనములో కూడ సాక్షాత్కరిస్తున్నది. భాషా విషయములు తెనుగు భాష గూర్చి గంటి జోగి సోమయాజులుగారు చిన్న వ్యాసమును నివేదించినారు. కొన్ని పదములు రూపుమాసిన విధానమును దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు చక్కని వ్యాసములో సమీక్షించినారు. ఇంక 'ఉక్తి లాలిత్యము' అని—చిన్నయసూరి బాలురకోసం మలభ శైలి రచించుటకు చెప్పిన సూచనలు చక్కగా వ్యక్తపరుస్తూ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు గొప్పవ్యాసం వ్రాసారు. ఇంక వేదాంతంలో అద్వైతదర్శనమును సర్వ దర్శన సామరస్యముతో సమన్వయపరచి శ్రీ ముదికొండ వేంకటరామశాస్త్రిగారొక సుదీర్ఘ వ్యాసములో సమ్యక్ దర్శనము చేసినారు. యోగ దర్శనమను శీర్షికను మిన్నకంటి గురునాథశర్మగారు యోగ శాస్త్ర పరీక్ష గావించినారు. భారతీయ దర్శనములు, ఔపనిషద దర్శనములు అను పేరున ఓరుగంటి నీలకంఠ శాస్త్రి గారు శంకరుని బోధ సారాంశమును వ్యక్తపరచినారు. షడంగములలో శిక్ష నిరుక్తము గూర్చి షడ్దర్శనం సోమసుందర శర్మగారు వివరించినారు. ఇంక సాహిత్య విభాగములో—

కొమ్మనమంచి వెంగయ్యశర్మగారు రచించిన "స్వప్న శ్రీనాథము" శ్రీనాథకవి సార్వభౌముని కవితా విలాసమును శివభక్తి తాత్పర్యమును చమత్కారముగా స్వప్న, సాదృశ్యముగా ప్రదర్శిస్తున్నది. జీవితచరిత్ర లవదగిన ఉత్తమరచన కీ. శే. కోన వేంకటరాయశర్మగారు రచించిన వారణాశి ధర్మసూరిని గూర్చిన సంగ్రహ వివరణము, అడవి బాపిరాజు గూర్చి ఒక వ్యాసము వాడరేవు సుబ్బారావు, సరోజినిని గూర్చి మండలపర్తి ఉపేంద్ర శర్మ, బసవరాజు అప్పారావు గేయపరిశీలన చేస్తూ శంకర శ్రీ రామారావుగారి వ్యాసములుకూడ నున్నవి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిని గూర్చి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి ప్రశంస పద్యాత్మకమైనను గద్యము వంటిదే తాంబూలము, తులసి గూర్చిన వ్యాసములు చేర్చినారు. ఇవి రేడియోలో ప్రసారమైనవియే కాని ఆ ప్రసక్తి యెక్కడ కనిపించదు. శాస్త్ర విజ్ఞాన విషయములలో, మంత్రశాస్త్రమును ఆధునిక విజ్ఞానశాస్త్రముతో సమర్థించుటకు శ్రీ వసంతరావు వేంకటరావుగా రొక చర్చ చేసినారు. మన సంగీత సాహిత్యములు గూర్చి శ్రీమతి పిల్లలమర్రి సుశీల, గంగావతరణము గూర్చి శ్రీమతి కొలకుల సావిత్రి, జీవ బ్రహ్మైక్యము గూర్చి తాడేపల్లి యజ్ఞమహాలక్ష్మి రచించిన వ్యాసములు — స్త్రీ ప్రాతినిధ్యము కొఱకు చేర్చినట్లున్నవి. చిట్టచివరి గద్య వ్యాసము, స్త్రీలకు సౌభాగ్య సందేశము శ్రీ శ్రీనివాసానంద సరస్వతీ స్వామివారు ప్రసాదించినది, స్త్రీలకు తమ సౌభాగ్యమునకు తామే కర్తలుగా నుండుమని ప్రబోధించు నీ వ్యాసములో (Self Control — ఆత్మసంయమరాహిత్యముల దరిచేర నీయరాదు (Self Introspection)ఆత్మపరిశోధన పరిపెట్టుకొనుట, సరిపుచ్చుకొనుట, సమన్వయపరచుకొనుట యని సెలవిచ్చినారు. ఈ యింగ్లీషు మాటల ప్రయోగముతో సరళముగా నున్న వ్యాసమును స్వాములవారు మరింత క్లిష్టపరచిరేమో! భావము ఎంత గొప్పది యైనను ఇతర భాషల ప్రభావము వలన అది స్పష్టముగా వ్యక్తముకాక నిలిచిపోయిన సందర్భములు ఈ సంపుటిలో కానవచ్చుచున్నది. ఉదాహరణకు 'సాంస్కృతిక ప్రాతిపదిక—సాహిత్యకారుడు' అను వ్యాసమున శ్రీ యస్. వి. మాధవరావుగారు హిందీ భాషలో ఆలోచించి తెనుగులో వ్రాయుట చేతనేమో చెప్పవలసిన విషయము ప్రక్షిప్తమై పోయినది. భారతీయసాహితికి భారతీయ సభ్యత సంస్కృతి ఆధారముగా ఉండవలెనని వారి భావన. ఈ యిరవయ్యో శతాబ్దంలో అది ఎంతవరకు నిలిచిందీ పరిశీలించడానికి కొన్ని హిందీ కావ్యాలు, కొన్ని తెలుగు కావ్యాలూ ఆధునికులు రచించినవి వారు యాదృచ్ఛికంగా పేర్కొన్నారు. ఆలోచనలోని అస్పష్టత సమీక్షలో కూడ నిలిచిపోయింది. ఇలాంటి వ్యాసములు కలిగిన—శాంతి—సాహిత్య సంకలనమై 810 పుటలు నిండినది. దీని చివర వ్యాసకర్తల పరిచయము, అకారాదిగా వారి నామావళి మాత్రం ఈ గ్రంథమునకు అలంకారములు.

ఈ గ్రంథమును వ్యయప్రయాసల కోర్చి యింత బృహత్ సంచికగా తయారుచేసిన సంధాత్ర నిర్మాతల సంకల్పము మంచిదే. కాని యీ విషయ నిర్ణయాధికారము ఆయా కవులకు, కర్తలకు వదలిపెట్టిన కారణము చేతనేమో కవులకు నచ్చిన రచనలే పంపినారు. ఆ నిర్ణయములో కవి పండితుల 'అహం' ప్రభావము పనిచేసినది. అందుకే కొందరు కవులుకాని వారు కవిత వ్రాసినారు. సంస్కృతము పలుకుబడి తెలియని వారు తెనుగులిపిలో సంస్కృతశ్లోకములు రచించినారు. సంస్కృతము ఆంగ్లము కూడ తమకు వచ్చునని చెప్పుటకు ఆయా భాషలనుండి అనువాదములు పంపినారు. ఇట్టివి— అన్ని రకముల ఆకు, అలము, పూవు, పిందె, కాడ, కంప చేర్చిన కారణముచేత ఈ గ్రంథసంకలన మిట్లు రూపొందినది. పాతిక రూపాయల వెల పెట్టిన యీ గ్రంథము నిజమునకు అమూల్యమైనది. దీనిని ఎంతవరకు వినియోగించగలరు అనునది పాఠకుల అభిరుచినిబట్టి ఆధారపడి యుండును. ఇంత బృహత్ గ్రంథమును ముద్రించునపుడు అచ్చు తప్పులు లేకుండ చేయవలసినది. ఆధునికాంధ్ర గ్రంథములకు పట్టిన లక్షణము నీ బృహద్గ్రంథము కూడ మీఱలేక పోయినది. సుమారు 850 పుటలు గల ఈ గ్రంథము ఘనమైనది. ఈ ఘనత దీనిని ముద్రింపజేసిన ఉదారులు పీకా ఆంజనేయులు గారికే దక్కగలదు.

(శ్రీ) ఇ. స.

## నిర్వచన సుందరకాండము

[కర్త : శ్రీ సోమంచి వాసుదేవరావు; ప్రాప్తిస్థానము : సోమంచి వాసుదేవరావు, కామకుర్తివారి వీధి, శ్రీకాకుళము శ్రీకాకుళముజిల్లా వెల రు. 5.]

గీర్వాణమున శ్రీ మద్వాల్మీకి రామాయణము ఆదికావ్యమనియు, వాల్మీకి ఆది కవియనియు, వేదసారమే రామాయణ మహాకావ్యమై వెలసినదనియు జగత్తంతయు నంగీకరించిన విషయము. ప్రభుసమ్మితమైన వేదము, కాంతా సమ్మితముగా, రసనిష్యంది సాత్త్వికహృదయమునుండి, పునీత భావస్ఫోరకముగా ఆనందరసపర్యవసాయిగా రామాయణ మహాకావ్యమైనది. కరుణరసము అనన్యముగా సింగారించుకొన్నది రామాయణమున. దానిని గూర్చి ఎంత లెంతలు వ్రాసినను మాటలు కొరవడుటవే తెల్పును. అట్టి మహాకావ్యమును ప్రజలందరు చదివి ఆనందించి తరించుటకు పూర్వము కవి తిలకులు పెక్కురు తెనిగించిరి. తెన్గించిన వారి ఉద్దేశము 'స్వయం తీర్ణః పరాన్ తారయతి'—అన్న నానుడిని సాధించుటయే. కొందరు కవి వృషభులు 'వాల్మీకము' కట్టుకొయ్యగా ధర్మపాశబద్ధులై కొంత మేర స్వేచ్ఛగా విహరించిరి. కొందరు రామాయణ హృదయ తతమునకు అపశ్రుతులు పలికించుకొనిరి. కొందరు ఉచ్ఛృంఖలతను భజించిరి. కొందరు రామాయణ పావిత్ర్య దీప్తిలోనే వివిధ వస్తుతత్త్వము నాలోకించి ఆలపించిరి. కొందరు పాడిరి. మరికొందరు ఆడిరి. కొంత పాలనేతగా గొంతమాలనేతగా భాసించిన దొకని కవితాపటమును దెన్గు చేయుటలో—'వాల్మీకము' స్పష్టముగా—ఈ సోమంచి వాసుదేవరాయకృత నిర్వచన సుందర

కాండమునఁ—బ్రతిబింబించిన దనుటలో అతిశయోక్తి లేదు. ఏవో కొన్ని ఆధునిక నామరూపములు, క్రియా రూపములు—వ్రేలుపెట్టి చూపింపఁదగినవి—వదలినచో ఒక హుళక్కి భాస్కరుని శైలియో, పాపరాజు శైలియో ఈతని కవితలో దొంగి చూచుచున్నది. వీరి కిట్టి చక్కని ప్రాచీన కవి శైలి అలవడుట సుకృతవిశేషమనక తప్పదు.

ఇతివృత్తములు ప్రఖ్యాతోత్పాద్యములైనప్పుడు కవికి స్వేచ్ఛ న్యూనాధికములుగా నుండును. మూలానుసరణముగా నొక దానిని అనువదించుట మిక్కిలి కష్టము. అందు ఆకర్షణీయముగా నిర్వచనముగా రచించుట కత్తిపై నడక వంటిది. దానిని స్వతంత్ర కావ్యమనిపించు రచన చేయుట ప్రజ్ఞా విశేషము. అనువాదము రెండురకములుగా నున్నది. సంస్కృత విభక్తిప్రత్యయానుసారముగా నట్లే అనువదించుట యొక మార్గము—తెలుఁగు నుడికారముతో, తెనుఁగు తనముతో మలచుట మరియొక పద్ధతి. ఇందు రెండవది కవిత్రయమువారి అనువాద సరణి. మొదటిది సంస్కృత నాటకాంధ్రీకరణ ఫక్కిక. ఇది నీరసమై, రెండవ పద్ధతియే మనకు ఆహ్లాదజనకముగా నున్నది. ఈ నిర్వచన సుందర కాండము రెండవ పద్ధతికి జెందినది. ఇందలి అనువాదము మూలానుసారియు—స్వతంత్రమైనదియు.

వాసుదేవరావుగారు సుమారు 1766 పద్యములతో ఐదాశ్వాసముల కావ్యముగా ఈ నిర్వచన సుందర కాండమును సంతరించినారు. పీఠికలో హరిహరబ్రహ్మలు, లక్ష్మీ వాణీ గౌరులు, గణపతి, వాల్మీకి, హనుమంతుడు (ఈ పద్యము గణపతి ప్రక్కన ఉండదగినది) వ్యాసుఁడు, కాళిదాసాదులు స్తుతింపబడిరి. తెల్గు కవుల స్తుతించుటలో (13 వ పద్యము) వారి కాల క్రమముతో నిమిత్తము లేకుండ కవుల పేర్లు గణబద్ధము చేసినారు. ఇది రామరాజ భూషణాదులు పోయిన బాటయే—చిత్రంబేక కాలంబునన్—(పుట 5—28 పద్యము) అన్న కూర్పు సరసభూపాలీయమందలి..........నిద్రా ముద్రానుగత ప్రబోధముల జిత్రింబేక కాలంబునన్—అన్న పాదమును దలపించుచున్నది. వారి కవితా పాటవము అనువాద భాగమునుండి చూచుట అటుంచి, స్వతంత్రమైన పోకడలుగల కవితాప్రశంస అన్న శీర్షికయందు గమనించినచో సువిదితమగును. శైలి మిక్కిలి మృదు మధురము. ఉదాత్తభావగంభీరమైన రచన వారిది. సీసములు అందు వివిధములుగా గులికినవి.

ఈ కావ్యము వ్రాయుటలోఁగల ఉద్దేశ్యము పీఠికలో (7 పుట)......ఆ రఘుకులాబ్ధి చంద్రు ననంతగుణ మహాంబురాశికిఁ దరిప బారంబులేదు—దానఁ గోట్యంశమైనను దడవలేదు. తొల్లిటి కవీంద్రులనఁ జెప్పఁ జెల్లుగాన, అనియు—అల సహస్రముఖునికేఁ దెలుపఁగ వశమే పరుఁడును నలఘుండగు రాము చరిత మగణితమగుటనినియును, 'మంత్రరాజ మట్లు మహి జనుల్ తమ తమ యోపినంత పట్టు నొప్పు జెప్ప, రఘుపరుని చరిత్ర మఖిలతారతిల పవిత్రంబు జన్మతారకంబు—అనియుఁ దెల్పినాఁడు. ఇంకను అవతారికలో—'....అనేక సుకవు లనేకభాషలలో రచించి ధన్యులైరి. రాఘవేశ్వరు చారిత్రము నెంద రెన్ని కృత, లన్ వాక్రుచ్చినన్ బోలదే, అని పాపరాజు చెప్పినట్లు....పునరుక్తిఁ గాఁజాలదని—పల్కి, అల్పజ్ఞుండనగు నేను నా నేర్చిన విధమున... మూల గ్రంథాభిప్రాయమును విడువక స్వేచ్ఛానుసారముగాఁ జేసితిని.......సుజనులిందరి గుణాంశమునే చూతురని ప్రార్థించుచున్నా నన్నాఁడు. ఇక కృతిపతి నారాయణుఁడు—అతని వంశచరిత్ర పేరుతో—బాల్యము, కంసవధ, పారిజాతాపహరణము, హంసడింభక శిశుపాలవధాదులు, కుచేల రక్ష, పాండవపక్షపాతము తడవినాఁడు. షష్ఠ్యంతములు వెలసినవి. కృతిపతి వంశావతార ప్రశంసలో 64 పద్యములో 'భూరిశరదాగమారంభ పూర్ణ పూర్ణిమారాత్రియామల వల్లవీమానినులను బ్రేమ జగదభిరామ వంశ్యామృతమున అలరఁజేసిన శ్రీకృష్ణుఁడు—65 పద్యములో చంద్రికాసౌందర్యంబు రహించు యామినుల నివ్వన్ నివ్వలున్ నిల్పి, ఆనందం బారఁగ, వంశ్యగానసుధ దాగోపికాబృందమ్ము నానంజేయుట—సొంపు నింపుటలేదు—కృష్ణ గుణగానమైనను వైవిధ్యముండవలెగదా!

కావ్యమున సఖండయతులు మిక్కిలిగా బాటింపబడినవి. (అప్పకవి మతమునఁ బేళ్లు మారిన మారవిండు)......

కం. మరకత వర్ణ సుషమా సముంచిత చిత్ర, స్ఫురదురు....
(2 పుట 8 పద్యము)

అనఁజనె నుత్తాలమయి సముంచితభంగిన్
(9 పుట—46 పద్యము)

వేగమె సిద్ధినొందు మద భీప్సితమీ.........
(134 పుట—252 పద్యము)

కుజ, ముల సురమున ద్రోయుచున్ సముత్కట
మృగముల్ (పుట 2—7 ప.)

ఉరరీకృత వీచికాసముత్కరమగు— (20—051)

అలంకృతింజేయుదురు సముంచితరీతిన్– (113–133)

అఖండయతి మహాకవులచే సంగీకరింపబడినదియు కదా!

'యతి' అందముగా గుదిరినను వడక సరిగా నుండని పాదము లీ కావ్యమున నటనట కన్పించుచున్నవి.

కనదనలార్చుల మధ్యం
బున వెలువడు ధీమ ధూమము విధమున గడున్ –(3–16)

రెండవ పాదము మొదటి యక్షరముతోఁ బదము విరుగు నట్టి ప్రయోగములు వీరి కవితలో మెండుగ గలవు. ఇవి ఎక్కువ భాగము సొంపుకల్గించునవియై పూర్వ కవులను మించి విచ్చలవిడిగ సాగినవి. అసదృశతపః ప్రభావము

న, సత్య బలమునన...... (269—137)

అహిత జనకాలుఁడను విన

యు, హితములగునట్టి..(204—266) మొదలగునవి. ఈ కావ్యమున అచ్చు తప్పులు మీదు మిక్కిలిగా గోచరించుట బాధాకరము.

నన్నయ వడి సీసములు, ప్రాస సీసములు ఇందు మనోహరముగా రచింపబడినవి. 5 పుట—24 పద్యము. 11 పుట—57 పద్యము. 12—62, 15—76, 18—94, 19—101, 20—106, 23—120 మొదలగునవి.

ఈ రచయితచే సాధారణవృత్త జాత్యుపజాతులతోపాటు మానిని, ఉత్సాహ, మందాక్రాంత, మహాస్రగ్ధర, లయవిభాతి, తరువోజ, తరల, తోటకములు గ్రహింపబడినవి.

ఈ గ్రంథమునందుఁ గులకములు అపకర్షములు వర్ణన సందర్భమున గోచరించుచున్నవి. (పుట 93—38, 39, 40 ప); (94—44 ప, 46, 47); (108 పుట—110, 111, 112 పద్యములు).

'మఱియు—మరిన్'—అన్న పదములు విస్తారముగా గనపడుచు, 'ఇది అనువాద గ్రంథమనెడి, ముద్రను వేయుచున్నట్లున్నవి. ఈ రెండు పదములను తొలగించియుండిన ఆయా ఘట్టములు అందముగా నుండుననుట నిస్సంశయము—107 పుట—110 పద్యము చివర. 94 పుట 46 పద్యము చివర, 110 పుట—114 పద్యము చివర—

ఈ కవి ప్రయుక్తములైన విశిష్ట రూపములఁ గొన్నిటిని ఇట పొందుపరచుచున్నాను. ఇరువై (ఇరువదికి—పీఠిక 6 పుట). ఇరువయి—అన్న రూపము శబ్దార్థ చంద్రిక గ్రహించినది. తరంగలు (10—56 చర్త్రాది గణము). ఊహ (న్) (146 పుట 300 పద్యము — చర్త్రాదులలోనిది). ప్రీత చిత్తుఁడౌదేని, ఒందినవాఁడై తిన్ (చిత్తుడవు+ఔదేని; ఒందినవాడను+ఐతిన్—ప్రథమాంతంబులగు యుష్మ దస్మ ద్విశేషణంబుల కేకత్వంబున వునులును బహుత్వంబున రుములును అంతాగమంబులు వచ్చుట, ఉత్వంబున కత్వంబగుట మొదలగు కార్యములు రాని రూపములు—16—87; 17—88—పుట—పద్య సంఖ్య గలవి— పూర్వకవి ప్రయోగములు కలవు) 'కంటె'కు 'కన్న' వాడఁబడినది (16—81); నేతురు (నేర్పుదురు సలక్షణము—324—429); అడాడ (అక్కడక్కడ—38—200); అద్దమరేయి (అర్థరాత్రమునకు వికృతి); ఉనికితము (ఉనికి—67—343); లోపలకు (74—378); గుటుక్కుమని (జాతీయము 77—387); తలలు గొట్టుకొందురు పిడికిళులచేత—(79—396 సహజముగా నున్నది); అలఘు ప్రమోదమందుచు—(99—68 చంపకమాల—ఘు—లఘువు) ఉన్నావు (114—138 'ఉన్నాడవు' అనుటకు బదులు); విండు (వినుడు అనుటకు మారుగ 142 పుట 289 పద్యము); వెలలింపన్ (వెడలింపన్ అనుటకు బదులు—సాధురూపమే!); అడువన్—(అడుగన్ అన్నదానికి రూపాంతరము 201—251); రెక్కౌలల్ (162—48); మెలగెదర్ (204—267); ఘననాథుడు (మేఘ నాథుడనుటకు 236—133); ఉన్నెడ(ఉన్న—ఎడ 285—214). పై రూపములన్నియు ఆర్య సమ్మతములు—'విండు'—వ్యాకరణము సాధింపనిది.)

ఇక అనువాద సరణి కనుఁడు—

శ్లో. తతో రావణ నీతాయా స్సీతాయా శ్శత్రు కర్శనః
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితే పథి'—(1-1) దీనికి

కం. వైదేహి రావణుడు వరారాగ్రణి దాచిన చోటు వరసి వెదకఁగా వారుట రిపు భయదుఁడు పనఁగాఁ దలచెన్ బవనసుతుడు గగన పథమునన్—అన్నది అనువాద పద్యము—ఇందు మూలమున వరారాగ్రణి, పవనసుతుడు లేకున్నను గథా ప్రారంభమున రావణున కొక విశేషణమును, శత్రు కర్శనుడను విశేషణము నకు విశేష్యమును గూర్చుటలో—పూర్వ కథారంగము లేని లోటును దీర్చు చిన్న వివరణమైనది.....'వానరః' సముద్రగ శిరో గ్రీవో గవాంపతి రివాబభౌ'—అన్న దానికి—సముద్రగ శిరోదార గ్రీవుడయి పొలిచె వాలోతు గతిన్—అన్నది తెనుఁగు సేఁత—(ప్రాస అడ్డువచ్చి రూపము చెడినది)—నీలలోహిత మాంజిష్ఠ పత్రవర్ణైః సితాసితైః స్వభావ విహితై శ్చిత్రై ర్ధాతుభిః సమలంకృతం—అన్నదానికి దెనుఁగు—

కం. అరుణ వినీల హరిద్రా మరకత వర్ణ సుషమా సమంచిత చిత్ర స్ఫురదురు గైరిక ధాతుల కిరవై పొలుపారు సమ్మ హేంద్రవ గమ్మున్—

ఇందు 'సితాసితైః' విశేషణము విడువబడినది—స్వభావవిహితము అన్న స్ఫూర్తి లేదు—

'తేన చోత్తమ వీర్యేణ పీడ్యమాన స్స పర్వతః
సలిలం స్రస్రావ మదం మత్త ఇవ ద్విపః'—అన్న దానికి

క. వానర వివీర్య మాన మహానగమది సెలల పేరి అప్పుల విడువన్ బూనె, గజ శిక్ష కాహతి నేనుఁగు మద జలము దొరఁగి యెనఁగు విధమునన్—ఇందు పూర్వోపమము భాసించినది.

'స పేతు ర్వారి రాజస్య సమీపే రాఘవస్యచ
హనుమాంశ్చ మహా బాహుః ప్రణమ్య శిరసాతతః
వియుతా మక్షతాం దేవీం రాఘవా యన్య వేదయత్'
64 స. 37 శ్లో.

—దీనికి దెనుగుగా వెలువడిన రచన యిది:

అనిల తనూజుడు సాష్టాంగ వతులు గావించి భక్తి కౌతుకములు వెమ్మనమున ముప్పిరి గొన నిట్లనియెన్ గేలో మ్మోడ్చి లక్ష్మణాగ్రజు రామున్
కంటిని దేవిని హర్షము
గంటిని దక్షిణలమునకు, ఖలదనుజుల ఁ
ల్గంటిని, మరి మా యుమతో
నంటిని దుశ్చరిత చరితమంతయు వచటన్
చూచితి జానకి ననెడు, ప
మీచిన సమీరమాత్యమృతవాక్కులు దై
ర్యాచలులు రాఘవులు విని
ప్రాచుర్య ముదబ్ధి దేలి రాజిలిరంతన్—
(పుట 313—361, 362 పద్యాలు)

ఈ పద్య భావములు స్వతంత్రములై కమ్మని తెనుగుతనమును బుణికి పుచ్చుకొన్నవి.

"రామ సుగ్రీవ సఖ్యంచ శ్రుత్వా ప్రీతి ముపాగతా
నియత స్సముదాచారో భక్తిశ్చాస్యా స్తథా త్వయి
ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ
ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ—(65 సం. 17, 18 శ్లో). అన్న శ్లోకములకు వాసుదేవరావుగారి అనువాదము గనుడు.

కం. యావద్వృత్తాంతంబును నే వినిపింపంగ రామ సు
గ్రీవుల సఖ్యము విని యుద్దేవి మహానందవారిధిన్ మునుకలిడెన్.

మ. అనఘా! నాథునియందు భక్తియును, శిష్టాచార సంపత్తి స
జ్జన సంస్తుత్య పతివ్రతాత్వ మహిమా సౌభాగ్యమున్ సంశ్రితా
వన సౌశీల్యము మున్నుగాగల గుణవ్రాతంబు సీతమ్మయం
దె నిరాఘమ్మగు గాంచితో ధరణి నేదీయట్టి దొక్కర్తయున్

శా. నిద్రాహారము లొల్ల కెల్ల యెడలన్నియుంద యేకాగ్రత
కృత్యోద్రేకంబు జనించి నిన్ బరముగా మల్లంబునందెంచుచున్
భద్ర ప్రాప్తికి సాధనంబగు త్వదాప్తాన్ ప్రేళ్ల లెక్కించుచున్
క్షుద్రంబుల్ దలపెట్టనట్టి సతి మీ శుద్ధాంతమున్ జూచితిన్

(పుట 315—374, 375, 376 పద్యాలు) ఇవి రసస్ఫోరకములని వేర చెప్పవలయునా?—)మహిమన్ శబ్దము నకారాంత పుంలింగము—దీర్ఘము రాగూడదు)

'జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ—(65 స. 24—శ్లో.)
ఊర్ధ్వం మాసాన్న జీవేయం రక్షసాం వశమాగతా
ఇతిమామబ్రవీత్సీతా కృశాంగీ ధర్మ చారిణీ
రావణాంతః పురే రుద్ధా మృగీవోత్ఫుల్ల లోచనా
ఏతదేవ మయా ఖ్యాతం సర్వం రాఘవ యద్యథా—
సర్వథా సాగరజలే సన్తారః ప్రవిధీయతాం'—దీని తెల్గుః

శా. జీవేశా! యిక నొక్క మాస మెటులో జీవింతు నామీదటన్
జీవింపన్ దనుజాంగనా వశగనై, నిక్కంబు నామాట మీ
సేవా భాగ్యము దీనురాలి కిటుపై సిద్ధించునో లేదొ ఈ
నా విజ్ఞాపన మాలకించి కృపతో నా నేరముల్ సైపవే—
(316—381)

మ. అని మాయమ్మ కృశాంగి, ధర్మరత, త్యక్తాహార, యేణీవిలో
చన, పౌలస్త్య గృహావరుద్ధ యయి బాష్పంబుల్ దిగంజారి రో
దనమున్ జేయుచు సూర్యపుత్రుఁడు వినన్ ద్వత్సన్నిధానంబునం
దు నివేదింపు మటన్న పల్కులివి మీతో నన్నియున్ జెప్పితిన్—

ఇందు 'సర్వథా........ప్రవిధీయతాం—విడువ బడినది—ఇక మూలమును మరపించు రచన సాగిపోయినది—ఇట్టి రసవత్కావ్య పరంపర విశ్వశ్రేయమేల గూర్పదు?—

## అభినవ భరత సార సంగ్రహః

(ముమ్మడి చిక్కభూపాల విరచితము; శ్రీ వరలక్ష్మి లలితకళామందిరము, మైసూరు వారిచే ప్రకటితము. మూల్యము : 15 రూపాయలు.)

విజయనగర రాజ్యముపై ముస్లిములు దండయాత్ర చేసి దానిని నాశనము చేయుటలో అసంఖ్యాక గ్రంథములను, అమూల్యములైన పరికరములను గూడ వారు నాశనము చేసి నట్లు కీర్తిశేషులు శ్రీ టి. వి. సుబ్బారావుగారు అనుచుండెడి వారు. సంగీతరత్నాకరమున శార్ఙ్గదేవుడు చెప్పిన దానినిబట్టి చూడగా, భరతుడు చెప్పిన సంగీత విజ్ఞానమునకు దీనికిని మధ్య ఎంతోయో అఖాత మేర్పడి కాన్పించుచున్నది. మరి యీ రత్నాకరములో ఉన్నది గూడ చాల భాగము ప్రాతబడి పోయినదని ఆ తర్వాత వచ్చిన వేంకటమఖి అన్నాడు. అందు వలననే అతడు తన కాలములో ప్రచారములో ఉన్న సంగీత సంప్రదాయముల ననుసరించి, చతుర్దండిప్రకాశికలో లక్ష్యమును నిబంధనము చేయగా పూనిక వహించుట జరిగినది. ఆ తర్వాత ఈ 50 సంవత్సరములలోను, ప్రబంధములు, లక్షణ గీతములు మూలబడి పోయినవి. ఇట్టి పరిస్థితులలో దేశములో అన్ని ప్రాంతములయందును సంస్కృతములో సంగీత శాస్త్రమును గూర్చి గ్రంథములు ప్రయత్న భాజ్యములు కావుటయు, అవి సమగ్ర నివేదికలను పోలి యుండుటయో, పూర్వపు గ్రంథములను తిరిగి వల్లెవేయుటగా నుండుటయో జరుగుచూ వచ్చినది. ఇట్టి పుస్తకములు ఎంత వరకు ప్రయోజనకారులో పరిశీలింపవలయుచో, అవి వర్తమానమున ప్రచలిత మగుచున్న సంగీత సంప్రదాయములను గూర్చి ఏమి చెప్పుచున్నవి అన్న దానిని దృష్టిలో నుంచుకొని పరిశీలింపవలసి యున్నది. ఇంకను విస్పష్టముగా చెప్పవలయు నన్నచో సంప్రదాయప్రదర్శినిలో శ్రీ సుబ్రహ్మణ్య దీక్షితారుగారు స్థాపించిన సిద్ధాంతము ననుసరించి ఎంతవరకు అవి ప్రయోజనము లగుచున్నవో చూడవలసి యున్నది. ఆయన ఆ గ్రంథమునందు స్థాపించిన సిద్ధాంతము వర్తమాన సంగీత విజ్ఞానము యొక్క నిష్కృష్టార్థమును, సారభూతమైన విషయమును అయియున్నది.

ఇప్పుడు మనము సంగీత శాస్త్రమునకు సంబంధించిన పురాతన గ్రంథములను గాని, ఇటీవలి గ్రంథములను గాని, వెలుగులోనికి తెచ్చుచున్నప్పుడు, సంగీత ప్రయోగమును, సాధనమును ఆ గ్రంథము ఏమైన విడమరచి చెప్పుచున్నదో, లేదో, తెలియని విషయములను అవిష్కరించు చున్నదో, లేదో, చూచుకొనవలసి యుండును. అంతియుగాక, ఆ గ్రంథము, గ్రామము, మూర్ఛన, జతి మొదలైన పురాతన సిద్ధాంతములను గురించి ఏమైన అనుపానములను తెలియజేయు చున్నదేమో గూడ చూచుకొనవలయును. మరియు, ఆ గ్రామాదికము వలన మన సంగీత ప్రక్రియలు—గాత్రము కానిండు, యాంత్రికము గానిండు,—మెరుగుపడు యోగము కల్గునేమో గూడా పరిశీలించవలసి యుండును. వర్తమాన సంగీతమును గురించి మౌనము వహించి పురాతన సంగీతమును గురించి మాత్రమే తెలియజేయు సిద్ధాంత విజ్ఞానము వలన ప్రయోజన మేమియు నుండదు. శ్రీ ఆర్. సత్యనారాయణ గారు ఇప్పుడు ప్రకటించిన అభినవ భారతసార సంగ్రహము (సంస్కృతము) వంటి గ్రంథముల వలన సంగీతశాస్త్ర చరిత్రలో లుప్తములైపోయిన కొన్ని కొన్ని ప్రాత విషయములు తెలియవచ్చునేమో గాని, అంతకన్నా జరుగు మేలు ఏమియు ఉండదు. మరి ఇంతమాత్రము కోసము, వారు యీ పుస్త

కము ప్రకటించుటయు, దానినిగూర్చి ప్రకర మైన పాండిత్యముతో గూడిన పీఠికను రచించుటయు పూర్తిగా వ్యర్థము. పీఠికలో శ్రీ సత్యనారాయణగారు తమ అమేయమగు పాండిత్యము నంతయు ప్రదర్శించి, అభ్యమైన విషయములను నుపరామృష్టముగా చర్చించిరి. కాని గ్రంథములో పేర్కొనబడిన కొన్ని రాగములు అధునాతనము లైనవై నట్లు కన్పించుచున్నవి. ఉదాహరణమునకు శుద్ధబంగాళమును చూపవచ్చును. మరియు ప్రాత గ్రంథములలోని అంశములను ఉద్ధృత పరచియు, ప్రాత గ్రంథములలోని అభిప్రాయములను ఉట్టంకించియు, రచింపబడిన గ్రంథము వలన, అధునాతన సంగీత భావ ప్రపంచమునకు ఒరిగివచ్చునదేమియో గూడ తెలియుటలేదు. ఈ విషయము పీఠికలో ప్రస్తావింప బడనూ లేదు. అట్టి ప్రశ్నలకు, ఇందులో ప్రత్యుత్తర మీయబడనూ లేదు. అందువలన అపరామృష్టముగ నిట్టి గ్రంథములను ప్రకటించుటవలన, బహుళముగా కుహనాపాండిత్యమును బండ్లతో ఒలకబోసికొనుట యగునే గాని, అందులో ప్రయోజనకరమైన అంశ మొక్కటియైనా లభ్యమగుట దుర్లభము.

సంధ్యావందనం శ్రీనివాస రావు.

## ఏకాదశి వ్రతము: నామ మాహాత్మ్యము

(మూలము : శ్రీ జ్ఞానేశ్వర మహారాజ; అనువాదము : శ్రీ టేకి సత్యనారాయణ; జ్ఞానేశ్వర గ్రంథమండలి, చిలకలపూడి.)

ఇందులో తొలి గ్రంథమునందు చైత్రశుద్ధ ఏకాదశి మొదలు పాల్గుణ బహుళ ఏకాదశి వరకును గల ఇరువదినాల్గు ఏకాదశుల మాహాత్మ్యమును, ఆయా ఏకాదశీ తిథులయందు చేయవలసిన వ్రతములను, ఆ వ్రతములను గూర్చిన కథలను మహాభక్తులు, మేధావులు అయిన శ్రీ జ్ఞానేశ్వర మహారాజు మహారాష్ట్ర భాషయందు వెలయించిన గ్రంథమున కిది తెనుగు అనువాదము. అనువాదము సరసమైన వచనములో సాఫీగా సాగినది. ముముక్షువులే గాక, కథాప్రియులు కూడ చదువవలసిన గ్రంథము.

పైన పేర్కొన్న రెండవ గ్రంథము గూడ శ్రీ జ్ఞానేశ్వర మహారాజ విరచితమే. ఇందు మహాభక్తులైన జ్ఞానేశ్వరులు అభంగనామకములైన కీర్తనల ద్వారా భగవన్నామ మాహాత్మ్యమును విశదపరచిరి. శ్రీ టేకి సత్యనారాయణ గారు ఆ అభంగములకు మూలము యిచ్చి, వానికి తెలుగు వచనములో తాత్పర్యము వ్రాసిరి. అభంగ రచనలో జ్ఞానేశ్వరుని ప్రజ్ఞా ప్రాభవము లెట్టివో ఇందు చూడ వలను పడుచున్నది. ఇందు మొత్తము 28 అభంగములును, వానికి సరసవచన తాత్పర్యములను, అర్థవివరణమును కలవు. ఈ నామమాహాత్మ్యమును మహారాష్ట్ర భాషలో "హరిపాఠ్" అందురు. జ్ఞానేశ్వరులు పండిన విజ్ఞానులని ఆయన గీతా వ్యాఖ్యానమును చదివిన అందరకును తెలియును. ఆ గ్రంథమును ఆయన తన పదునైదవ యేట రచించెను. అట్టి మహానుభావుని గ్రంథములను తెలుగుచేసి ప్రకటించుచున్న జ్ఞానేశ్వరగ్రంథమండలి వారిని నిజముగా అభినందించవలసి ఉన్నది.

ఇందు ఏకాదశి వ్రతము వెల: ఒక రూపాయి; నామ మహాత్మ్యము వెల : పది అణాలు.

## మహాత్ముల ఉపదేశములు

(జ్ఞానేశ్వర గ్రంథమండలి, చిలకలపూడి.)

హిందీలో గీతా ప్రెస్సు వారు ప్రకటించిన "సంత్ వాణి" అను గ్రంథమున కిది తెలుగు అనువాదము. ఇందు భక్తిజ్ఞాన వైరాగ్య సదాచరణాది సద్విషయ ప్రబోధకమగు ఉపదేశ రత్నములు 526 దాకా గలవు. ముముక్షువులు పారాయణముగా చదువవలసిన గ్రంథము. వెల : ఒక రూపాయి.

హా. శ్రీ.

## గ్రంథ స్వీకారము

1. శ్రీరామకృష్ణ పరమహంస ప్రబోధము.
2. ఆత్రేయ శ్రోత్రానందం.
(కర్త : శ్రీ నాదెళ్ల దక్షిణామూర్తి, బందరు. వెల : 3—00.)
3. శ్రీ సుబ్రహ్మణ్య స్తుతి.
(కర్త : భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మ, వెల : 50 నయాపైసలు.)
4. యోగామృతము.
(స్వామి రామానంద పరమహంస విరచితము. శ్రీ అచ్యుతన్న నరసింహవర్మచేగారిచే ప్రచురితము. వెల : 2 రూపాయలు.)
5. వెంకటేశ ప్రశస్తి.
(కర్త : సామవేదం జానకిరామశర్మ, ఏలూరు. వెల : 50 నయాపైసలు.)
6. క్రైస్తవమత ప్రాశస్త్యము.
(తెన్నేటి వేంకట దీక్షిత ప్రణీతము. వెల : తెలియదు)
7. పరమసంత్ కబీరు సూక్తులు.
(అనువక్త : శ్రీ ఆవుల పురుషోత్తము. భారత సాహిత్య కళాపరిషత్ ప్రచురణము. వెల : రూపాయి.)
8. ఆంజనేయ దండకము, చెన్నకేశవ శతకము.
(శ్రీ బులుసు వేంకటేశ్వరులు, కాకినాడ. వెల : 25 నయాపైసలు.)
9. సుగుణ శతకము.
(రచయిత : శ్రీ రామగిరి వెంకటేశ్వరులు, నెల్లూరు. వెల : 20 నయాపైసలు.)
10. తప్పక చదవండి.
(శ్రీ టేకి సత్యనారాయణ, జ్ఞానేశ్వర గ్రంథమండలి. చిలకలపూడి. వెల : రూపాయి.)
11. నిర్గుణ స్తోత్రము.
(రచయిత : శ్రీ ఆవుల పురుషోత్తము, ఖమ్మం. వెల : 10 నయాపైసలు.)

# వార్తలు

ఎన్నికల అనంతరం దేశంలో 12 రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అయితే కొన్ని రాష్ట్రాలలో ముఖ్య మంత్రి పదవుల విషయమై, మంత్రివర్గ నిర్మాణం విషయమై తగాదాలు గూడా వచ్చాయి. అట్టి రాష్ట్రాలలో ఆంధ్ర, మైసూరు, యు. పి. చెప్పుకోతగినవి.

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రి పదవిని కాంగ్రెస్ అధ్యక్షుడుగా వుంటున్న శ్రీ సంజీవరెడ్డికి ఇచ్చారు. శ్రీ నెహ్రూ జోక్యంవల్ల, ఈ పార్టీ నాయకత్వానికి ఈయన ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది. ఆ తర్వాత మంత్రివర్గంలో ఎవర్ని వేసుకోవాలనే సమస్య ఏర్పడి తగాదా వచ్చింది. శ్రీ సంజీవరెడ్డి శ్రీ అల్లూరి సత్యనారాయణ రాజు, శ్రీ సంజీవయ్యలను మంత్రివర్గంలోకి తీసుకోలేదు. శ్రీ సంజీవయ్యను తీసుకుంటానుగాని, శ్రీ అల్లూరిని తీసుకోను అంటున్నారు. ఈ సమస్య ఎట్లా తేలుతుందో ఇంకా తెలియకుండా వుంది.

## 12 రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు

మైసూరులో గూడా శ్రీ కాన్తి, శ్రీ జెట్టి వర్గాన్ని పూర్తిగా మంత్రివర్గంలోంచి మినహాయించారు. ఆ కారణంచేత అక్కడ తగాదా ఏర్పడింది. ఈ తగాదాను పరిష్కరించవలసిందిగా కాంగ్రెస్ అధిష్ఠానవర్గం, పార్టీ అధ్యక్షుడు శ్రీ సంజీవరెడ్డిని కోరింది. కాని, స్వంత రాష్ట్రంలోనే తగాదాలు పడుతున్న ఈయన అక్కడికిపోయి చేయగల్గింది ఏమీ వుండదని పరిశీలకులు భావిస్తున్నారు.

మద్రాసులో శ్రీ కామరాజ, అస్సాంలో శ్రీ ఛాలిహా, బీహార్‌లో శ్రీ బినోదానంద్ ఝా, మధ్యప్రదేశ్‌లో శ్రీ భగవంతరాయ్ మండ్లోయ్‌లు ముఖ్యమంత్రులుగా పార్టీలచేత ఎన్నుకోబడినారు. మహారాష్ట్రలో శ్రీ చవాన్ ముఖ్యమంత్రిగా తిరిగి వచ్చారు. ఉత్తరప్రదేశ్‌లో శ్రీ చంద్రభాన్ గుప్త, పశ్చిమ బెంగాల్‌లో డా. బి. సి. రాయ్, పంజాబులో సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్‌లు ముఖ్యమంత్రులైనారు. రాజస్థాన్‌లో శ్రీ మోహన్‌లాల్ సుఖాడియా, గుజరాతులో శ్రీ జీవరాజ్ మెహతాలు పార్టీ నాయకత్వాన్ని చేపట్టారు.

ఈసారి ఒకటి అరా రాష్ట్రాలలో తప్ప, తక్కిన అన్ని రాష్ట్రాలలోను మంత్రివర్గంలో సభ్యులసంఖ్య అధికమైపోయింది. ఆంధ్రప్రదేశ్‌లో స్టేట్ మంత్రులంటూ క్రొత్త హోదాలు ఏర్పాటు చేయబడినాయి. మహారాష్ట్రలో 17 మంత్రులు, 14 ఉపమంత్రులతో మంత్రివర్గం 31 మందితో ఏర్పడింది. ఉత్తరప్రదేశ్‌లో ఈ సంఖ్య మరికొంత అధికమైంది. అక్కడ మంత్రివర్గంలో సభ్యుల సంఖ్య 42 దాకా వుంది.

రాష్ట్రాలలో మంత్రివర్గాలు ఇట్లా అతి విస్తృతం అవుతూ వుండటాన్ని గురించి విమర్శ గూడా వచ్చింది. మార్చి 16 న శ్రీ త్యాగి ఈ విషయాన్ని గూర్చి లోక్‌సభలోనే విమర్శ చేశారు. శ్రీ నెహ్రూ గూడా ఇట్టి విస్తృత మంత్రివర్గాలను విమర్శించారుగాని, ఆ యా రాష్ట్రాలలో, అట్లా వాటిని పెంచక పోతే పని జరిగేట్టు కన్పించడంలేదు. ముఖ్యంగా యు. పి. మైసూరు, ఆంధ్రప్రదేశ్‌లలో ఇట్టి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి.

## వివిధ వార్తలు

మార్చి 1 : పాకిస్తాన్‌లో అధ్యక్ష పద్ధతి రాజ్యాంగాన్ని అయూబ్‌ఖాన్ ప్రకటించారు.

మర్చి 2 : బర్మాలో జనరల్ నేవిన్ తిరిగి ఉనూ ప్రభుత్వాన్ని పడగొట్టి సైనిక ప్రభుత్వాన్ని స్థాపించారు. ఉ నును ఇంకా ఇతర మంత్రులను అరెస్టు చేశారు.

మార్చి 3 : దక్షిణ నేపాల్‌లో విప్లవం చెలరేగుతూనే వున్నది. బీరగంజ్ ప్రభుత్వం కర్ఫ్యూ విధించింది.

మార్చి 4: వాతావరణంలో అణ్వస్త్ర పరీక్షలు జరపడానికి అమెరికా నిశ్చయించుకున్నది.

మార్చి 4 : బర్మా పార్లమెంటును జనరల్ నేవిన్ రద్దు చేశారు.

మార్చి 5 : కామరూన్‌వద్ద విమాన ప్రమాదం జరిగి 111 మంది చనిపోయినారు.

మార్చి 5 : గోవాను కేంద్రపాలిత ప్రాంతంగా నిర్ణయిస్తూ, రాష్ట్రపతి ఆర్డినెన్సు జారీ చేశారు.

మార్చి 6 : రష్యా క్రొత్త ఆయుధాలను నిర్మిస్తుందని శ్రీ కృశ్చేవ్ ప్రకటన చేశారు.

మార్చి 7 : బెర్లిన్ సమస్యను గురించి మాస్కోలో అమెరికా రాయబారి సాగించిన మంతనాలు విఫలమైనాయి.

—మూడవ ప్రణాళికా కాలంలో 14 ఎరువుల ఫ్యాక్టరీలను కట్టడానికి ఆలోచన జరుగుతున్నది. ఇందులో 10 ప్రైవేటు రంగంలో నిర్మించబడతాయి. ఆంధ్రప్రదేశ్‌కు 2 కేటాయించారు.

—పాలై బ్యాంకు డైరెక్టర్ల అప్పీలును సుప్రీంకోర్టు కొట్టివేసింది.

—నేపాల్‌రాజుకు ప్రధాని శ్రీ నెహ్రూ తిరిగి ఆహ్వానం పంపించారు.

—అణ్వస్త్ర పరీక్షల నిషేధాన్ని గురించి పాశ్చాత్య రాజ్యాలు క్రొత్త పథకాలను ప్రతిపాదించాయి.

మార్చి 9 : కేరళ ప్రభుత్వం 9 లక్షల మిగులుతో బడ్జెట్టును ప్రతిపాదించింది.

—రొడీషియా ప్రభుత్వం రాజీనామా చేసింది.

మార్చి 11 : క్రొత్త ఆంధ్ర ప్రభుత్వం శ్రీ సంజీవ రెడ్డి ఆధ్వర్యంలో ఏర్పడింది. 12 న ప్రమాణ స్వీకారం చేసింది.

మార్చి 12 : మూడవ ఫైనాన్సు కమిషన్ నివేదిక, ప్రభుత్వం ఆమోదించిన సిఫారసులు ప్రకటించబడినాయి. రాష్ట్రాలకు రాబడి పన్నులోను, ఎక్సైజు సుంకాలలోను వాటా అధికం చేశారు.

మార్చి 12 : సరిహద్దు తగాదాను గూర్చి భారతదేశం చైనా ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రకటించబడినాయి. చైనా దురాక్రమణను ఉపసంహరించుకుంటేనేగాని, మంతనాలు సాగవని భారత ప్రభుత్వం స్పష్టం చేసింది.

—శ్రీమతి కెనెడీ ఢిల్లీకి వచ్చారు.

—ఏప్రిల్ నెలలోగా అణ్వస్త్ర పరీక్షల నిషేధాన్ని గురించి ఒప్పందం కుదరాలని అమెరికా కోరింది.

—పశ్చిమ ఇరియన్‌నుగూర్చి రహస్య సమాలోచనలకు హాలెండు ఆమోదించింది.

మార్చి 13 : రైల్వే బడ్జెట్టును శ్రీ జగ్ జీవన్‌రాం పార్లమెంటులో ప్రతిపాదించారు.

మార్చి 14 : గోవాను భారతదేశంలో విలీనంచేస్తూ, పార్లమెంటు శాసనం చేసింది.

మార్చి 14 : జెనీవాలో నిరాయుధీకరణ సంఘం సమావేశం ప్రారంభమైంది.

మార్చి 14 : కేంద్ర బడ్జెట్‌ను శ్రీ మొరార్జీ లోక్ సభలో ప్రతిపాదించారు. ఇందులో లోటు 63.46 కోట్లు. రక్షణ వ్యయం 39 కోట్లు.

మార్చి 16 : నదీ జలాల తగాదా విషయంలో మధ్యవర్తిత్వం (ఎడ్జూడికేషన్) జరిపించాలని మైసూరు కోరింది.

—అణ్వస్త్ర పరీక్షల నిషేధాన్ని గురించి అమెరికా చేసిన ప్రతిపాదనలను రష్యా తిరస్కరించింది.

—నిరాయుధీ కరణను గురించి ఒక చతుస్సూత్ర ప్రణాళికను అమెరికా విదేశాంగ మంత్రి జెనీవాలో సభలో ప్రతిపాదించారు.



మార్చి 16 : 1960—61 లో 793 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండినట్లు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.

మర్చి 17 : సిరియా సైనిక స్థావరాలపై ఇజ్రాల్ సైన్యాలు దండయాత్ర సాగించాయి.

మార్చి 18 : జనీవా సభలో తటస్థ రాజ్యాల రాజీ ప్రతిపాదనలు చేయడానికి ఆలోచనలు చేశాయి.

మార్చి 18 : అల్జీరియాలో యుద్ధ విరమణను గూర్చి అల్జీరియా భవిష్యత్తునుగూర్చి ఒప్పందం కుదిరింది.

మార్చి 20 : రాష్ట్ర శాసన సభను ప్రారంభిస్తూ, గవర్నర్ శ్రీ సచార్ ప్రసంగించారు.

మార్చి 20 : అణ్వస్త్ర పరీక్ష నిషేధం చర్చల్లో శ్రీ మీనన్ క్రొత్త ప్రతిపాదన చేశారు. తటస్థ రాజ్యాలలో పరిశీలన కేంద్రాలు పెట్టవచ్చునని సూచించారు.

—పాకిస్తాన్ సమితికిపోతే, కాశ్మీర్ విషయంలో మంతనాలు వుండవని శ్రీ నెహ్రూ రాజ్యసభలో ప్రకటించారు.

—వాషింగ్టన్‌లో పశ్చిమ ఇరియన్‌ను గురించి డచ్చి—ఇండొనేషియన్ రహస్య సమాలోచనలు ప్రారంభమైనాయి.

మార్చి 21 : పెద్ద పెద్ద మంత్రివర్గాల ఏర్పాటు అధిష్ఠాన వర్గం ఆమోదించిన సూత్రం కాదని శ్రీ నెహ్రూ పత్రికా విలేఖరుల గోష్ఠిలో పేర్కొన్నారు.

—అంతరాళ పరిశోధనను గురించి శ్రీ కృశ్చేవ్ అమెరికాకు క్రొత్త ప్రతిపాదన చేశారు.

—చైనాతో వివాదంలో మధ్యవర్తిత్వం పనికిరాదని ప్రధానమంత్రి ప్రకటించారు.

మార్చి 22 : 2 కోట్ల లోటుతో ఆర్థిక మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి తాత్కాలిక బడ్జెట్టు ప్రతిపాదించారు. ఈ సందర్భంలోనే ఆయన మూడవ ఫైనాన్సు కమిషన్ సిఫార్సుల మూలంగా రాష్ట్రానికి కేంద్రంవల్ల లభించే సహాయం ఏమిటో గూడా వివరించారు. ఇంతఃపూర్వం ఈ సహాయం 20 కోట్ల పైచిలుకు లభిస్తూవుండేది. ఇప్పుడు 26 కోట్లపైచిలుకుగా వుండవచ్చని ఆయన అంచనా వేశారు.

మార్చి 22 : శ్రీ నెహ్రూను కలుసుకొని మాట్లాడ్డానికి జనరల్ అయూబ్ ఒక షరతు పెట్టారు. ముందు మంత్రుల స్థాయిలో సమాలోచనలు జరగాలని ఆయన సూచిస్తున్నారు.

మార్చి 23 : జనీవా సభ నిర్వహణకు రష్యా—అమెరికా సమిష్టి కార్యక్రమ పథకం ఆమోదించబడింది.

మార్చి 24 : నదీ జలాల పంపిణీ తగాదాను మధ్యవర్తిత్వానికి పెట్టడం తమకు ఇష్టంలేదని ఆంధ్ర ప్రభుత్వం ప్రకటించింది.

మార్చి 30 : నదీ జలాల పంపిణీ తగాదాలో మైసూరు కోరికను (మధ్యవర్తిత్వం కోరికను) కేంద్రం తిరస్కరించింది.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.